# భారతి

సచిత్ర మాసపత్రిక

**BHARATHI**

(A TELUGU MONTHLY)

సంపాదకుడు:

శి. శంభుప్రసాద్

ఆంధ్రపత్రికా ముద్రాలయము,

మద్రాసు.

౧౯౪౦

సంపుటము ౧౭, సంచిక ౪

# ప్రకటన

ఈక్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల భారతి (1940 సం. ఏప్రిల్ నెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నవి. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపు లేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువఱకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1940 సం. మే 10-వ తేదిని రూ॥ 6—4—0 లకు వి. పి. పంపుచున్నాము. కావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకి పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మాకావిషయము వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము.

A 5. D 1. H 10, 12. K 4. M 2. N 2, 3. P 3, 4. R 2, 3. S 4, 5, 9, 53, 54, 74. V 5. W 3.

---

## వ్యాసవిలేఖకులకు మనవి

వ్యాసాలు ఎనిమిదిపుటలకు మించకుండా ఉండాలి. కాగితానికి ఒకపెడే వ్రాయాలి. శాస్త్రీయవిషయాలనుగురించిన వ్యాసాలుకూడా ఎక్కువ పరిభాషా, ఎక్కువ వివరాలూ లేకుండా సంగ్రహంగాను, సామాన్యపాఠకునికి విషయం బోధపడేటట్టు సులభంగాను, మనస్సును కథలా ఆకట్టేటట్టు ఆకర్షకంగాను ఉండాలి. శాసనవ్యాసాలు పదిపన్నెండు పుటలకు మించేయెడల రెండు సంచికలలో ప్రకటింపవలసివచ్చును. "బాలానందమున" కుచితమైన కథలు, పాటలు, సాధ్యమైనంతవరకు పిల్లలభాషలో రచించి పంపించవలసినదని కవులకు మనవి. విమర్శలకు గ్రంథములు పంపువారు రెండుప్రతులు పంపవలెను.

దేశాన్ని ఎక్కువగా కలవరపరుస్తున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయాది విషయాలనుగురించీ, మనఆంధ్రుల ప్రత్యేకసమస్యలనుగురించీ ప్రత్యేకవ్యాసాలు కావాలి. సాధ్యమయినంతవరకు ఎత్తుకునే విషయంలోను, చూచే దృష్టిలోను, రచించే రచనలోను కొత్తదనంకావాలి. మన ఉద్యమాలు, మనదేశం, మనసంఘం, మనఆశయాలు భారతిలో ప్రతిఫలించేటట్టు చూడవలసిదని వ్యాసకర్తలకు మనవి.—భా. సం.




సంపుటం. ౧౭ విక్రమ ప్రమాది, చైత్రమాసము (ఏప్రిల్ 1940) సంఖ్య. ౪

# పి లు పు

శ్రీ మేడవరపు సత్యనారాయణశాస్త్రి

౧

నవ నింబ భూజ సుమనః పరిమళ శ్రీ
క ! వసంత చూత పృథుక ప్రసవ సారా
సవ పాన మత్త పిక షట్పదనినాదా
భివద త్స్వవిక్రమ ! సువిక్రమసమాఁదీ !

౨

తత భావ పుష్ప భరితంబు లగు చేత
స్తతి పూల దోసిళు లుదారమతిఁ గొంచు
ధ్వతిరమ్ము!మాదు నెడఁదఁ ముదముఁగూర్పన్
వెతఁ దీర్చఁగాఁ బిలుతు విక్రమసమాఁదీ !

౩

రస నాల్గువైపులఁ దిరం బగుచు స్వాతం
త్ర్యసమాధి సాగఁగ జయప్రదముగా, నాం
ధ్రసమాఖ్యరాష్ట్రము యథార్థ మరుదేరన్
వెస రాఁగదే! పిలుతు విక్రమ సమాదీ!

౪

నెలమూఁడు వాన లవనిం గురియు; ముక్కా-
రులు పైరెసంగ; సిరిరూపుఁ గొనియాఁడన్;
తలపూవు వాడక సదా జగతి యెల్లన్
విలసిల్ల, రాఁగదవె! విక్రమసమాకీ!

౫

ముహురుత్సవోపచితమోదకసమూహా
స్పృహయాళు డింభకృత పృచ్ఛనవితానా
న్వహపీడితాఖిలగృహస్థతతి ప్రీతిన్
విహరింప; రాఁగదవె! విక్రమసమాకీ!



# కావ్యరచనము

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

నైసర్గికప్రతిభాసమన్వితుడే కావ్యరచనమున సిద్ధహస్తుడు కాజాలును.

తాను వలచిన విషయమునందే ప్రజ్ఞ గలవాడు తన చేవను ప్రకటింపజాలును. గుడివంటి గుండెగలవాడును, ఉద్వేగభరితాంతరంగుడును, తపస్సిద్ధివలన పరిశీలన భావనాశక్తులను పడసినవాడును కవితాధోరణియందును, కథాకల్పనమందును, కావ్యరచనమందును, తనకాలమును గడపి, తనప్రతిభ నందే ప్రకాశము గావించును. శిల్పకౌశలమనుడు, స్వతంత్రశక్తి యనుడు, నైసర్గికప్రజ్ఞ యనుడు, సృష్టిసామర్థ్య మనుడు విశేషించి ఈ కళాశాఖలందు సహజవ్యక్తీకరణమార్గములను గాంచును. కావ్యాంగములనుగాక, కళాశాఖలనుగాక, ఇతరవిషయములను వివరించుపట్ల నీయాంతరంగిక శక్తులు విజృంభింప నక్కఱలేదు. తత్త్వశాస్త్రము విశేషముగ నున్నతమేధకు సంబంధించినది కావున నిది కళకును, కావ్యమునకును చుట్టము కాదని తలచు పండితులనేకు లున్నారు. ఒక కథగాని, పాత్రసృష్టిగాని తత్త్వశాస్త్రమున, జటిల- ఆధ్యాత్మిక సమస్యా విమర్శనమున జొరజాలదు. నిక్కమే! కాని తత్త్వశాస్త్రము మతశాస్త్రమును సైదోడుచేసికొని, నక్షత్రములుపోలు సత్యములను కావ్యావనియందు వెదజల్ల గలదు. [illegible]

వెన్కనిలిచి, గంభీరభావ ప్రవంతులన దానిలోనికి బాఱించును. ఈ యద్భుతశ పృథ్వీవలయమున విశేషముగ దాక్షిణాత్య మహాతాత్త్వికులకు కలదు. తాత్త్వికు లందు తలమానికమైన శ్రీశంకరుని "సౌందర్యలహరి"ని పరిశీలింపుడు. ఇది నిక్కముగ సౌందర్యలహరి యని, అద్భుత రసస్రవంతి యని, మహత్తరకవితాపూర మని గుర్తింతురు. కాని, శంకర భగవత్పా దుడే రసప్రధానమైన విషయమును గైకొని, దానిని కవితాసుధాకలశము గావించినాడు. అగుటయు నే యసాధారణ ప్రజ్ఞాధురీణుడో తక్క క్లిష్ట తాత్త్వికాంశములందు కవితాకల్లోలిని జూపలేడు. కావున తాత్త్వికులు తాత్త్వికులే యని, పండితులే యని, భాష్యకారులే యని కళోపాసకులు కారని తెలుపుటకు కొంత యవకాశ మేర్పడుచున్నది.

రసభంగము కలుగని రీతిని తన తాత్త్విక విభూతిని పురస్కరించుకొని గభీరపర్యాలోచనాప్రజ్ఞను అండగావించుకొని, కావ్యకర్త గంభీరభావబంధుర సత్యములను ఆణిముత్యములట్లు తనరచనమున వెదజల్లవలయును.

కావ్యమున గణనీయమైనది "ధ్వని". సూచనతో, అంటియునంటక హాయి నిచ్చు స్పర్శతో, మెల్లగ నాత్మను లేపు తియ్యని గుసగుసలతో క్రీగంటిచూడ్కితో, తడసి [illegible]

కోపని హావభావములతో పఠితమనసున నౌత్సుక్యమును లేపి, వన్నెకాడైన కావ్యకర్త ప్రక్కకు తరలును. ఈ యౌత్సుక్య మన్వేషణమును పురికొలుపును. ఈ యన్వేషణమున గంధర్వాంగనలబోలు భావము లెదురగును. ఇవి హృదయమున నానంద సింధువులను పొంగించును. ఆకుమూకల నడుమ నుండి తొంగి చూచు ఫలమే, సాంద్రవల్లరులందు దాగిలిమూతలాడు పసి కుసుమములే, కనకమరీచినిచయమును మేలి ముసుంగు చేసికొనిన శిశిరకాంతియే, మలయహిల్లోలమున అల్లనల్లన నెందుండియో యరుదెంచి చెవిసోకు సన్నని వీణారవమే, అనంతనిస్తబ్ధతలో తప్పటడుగు లిడుచు చెవిబడు విమలగీతికానిస్వనమే, మొయిలుకొనపై తళుక్కున వగి తటాలున పలాయనమగు తొలకరిచంచలయే, తీవపడుచు మేనిపులకలై అరమోడ్పుకన్నుల బడు చిన్నారిమొగ్గలే, చిఱునవ్వు చిల్కరించు అందకత్తెవాలుచూపే కడలేనితీపితలపులను చిత్తమున బుట్టించును. షేక్స్పియరు మహాకవి తెలిపిన "Speechless messages" ఎందఱు బెసేనిమోలకన్నులను, ఎందఱు కవికుమారులమనసులను, ఎందఱు కళాప్రపతుల హృదయములను, ఎందఱు పఠితలయంతరంగములను మధురభావపూరితము లొనరింపలేదు? పోర్షియా కావ్యసుందరి కాదా?

సమస్తము బట్టబయలు చేయువాడును, ఏయంశమునైన బోధపడనితీఱున వచించువాడును, కావ్యరచనమునకు పనికిరారు. తలకు మించిన పనిని పఠితనెత్తిపై పెట్టువాడును, ప్రమోదబంధురమైన కొంతపనిని వానియూహకు నొసగనివాడును కావ్యరచనమునకు తగరు. తాను పండితుడై, పఠిత పండితుడైన బాధ లేదు. కాని, కావ్యకర్త తనపాండితిని విజృంభింపనీయరాదు. విజృంభింపనిచ్చెనేని, పఠితమనసునకు తగనిబాధ నొసగి, ఎన్నెన్నో యుస్సురుస్సురులను వినును. ఛాందసుడై, ఈ దేవయ్య సర్వము నేకరువు పెట్టెనేని, చిట్టాఅవర్జాతబిసీళ్లను దెలిపెనేని, జాబితాలను వివరించెనేని, చదువరికి తగని ప్రబోధ మీయదొడగెనేని, ఆతనియూహా నించుకంతైన చలింపనీక, వానిని కొద్ది చూపుతో జూచువాడై, వాని ప్రతిభ నవమానించినవా డగును.

సూచన నెఱిగిన పాఠకుడు కావ్యకర్త మనసున నెట్టి బ్రహ్మాండ మున్నదో యని యచ్చెరువొందును. చదువరి మనసున నిట్టి యచ్చెరుపాటు నుదయింపజేయజాలువాడే సిద్ధహస్తుడైన కావ్యకర్త! అణాపైసలతో లెక్కలు తేల్చువాడు అంగడివాడు; గుమాస్తాగిరిలో నాఱితేఱినవాడు, ఈతనికిని, ఈతని బండఘనికిని, ఈతని వస్తువివరణమునకును కావ్యకర్త బహుయోజనముల దూరమున వసించును. తలనొప్పిచే బాధపడుట కీ సుకుమారి సమ్మతింపదు.

ధ్వని యన Suggestion అని తెలుపుచుందుము. ఇది కేవలము వినికిడికి సంబంధించినది కాదు. మధురభావస్పర్శకతన నిభృతమునసుండి బహుళయూహల నాహ్వానించునది. ధ్వని చదువరిమనసునకు చేవు గలిగించును. తోడన యది భావక్షీరముతో నిండిపోవును. ధ్వనికిని, రసమునకును, ఔచిత్యమునకును, ఎట్టి యవినాభావ సంబంధ మున్నదో యోజింపుడు. ధ్వనికి చేటుదెచ్చు నెఱిదోరణియు, జటిల పదప్రయోగమును

రసాభాసము గావించి, ఔచిత్యమునకు భంగము దెచ్చితీరును.

కావ్యకర్తవాక్కు సుమదళసదృశము, బహుదూరమును పరిమళపూరితమొనరించు నది చిన్నిపూరేక. "అల్పాక్షరముల ననల్పార్థరచన కల్పించుటయు కాదె కవివివేకంబు" అనికదా పాల్కురికి సోమనాథకవి పలికినాడు! ఒక్కమాటవలన పదిభావములను మనసున స్ఫురింపజేయువాడు ఆదర్శరచయిత. పదిమాటలవలన నొక్కతలంపును మనసున తోపించునాతడట్టివా డెట్లగును?

పాండితిమీది మక్కువ ఎక్కువైనపుడే పదబాహుళ్య మధికమైపోవును. అందకత్తెకు నగలు దాపురించుదో, ఆమెసహజసౌందర్యమునకు చెట్ట కలుగును. తెచ్చిపెట్టికొనిన యలంకరణము నైసర్గికలావణ్యమును వెక్కిరించును.

సహజసౌందర్యమునకు చెఱుపుదెచ్చు లాటి శక్తులలో పాండితీప్రదర్శన మొకటి. పాండితికే అంజలెత్తు సంప్రదాయము వివిధ దేశముల సాహితీచరిత్రలం దపుడపుడు పొడసూపినది. యుగమర్యాద ఈ సంప్రదాయముపై పూలు చల్లినది. దీని స్తన్యము గ్రోలిన కవిడింభకులు దీనికి నంజలిఘటించి, దీనిపదాంకములందు తమ యాదర్శము నవలోకించి, ఆత్మరచనములందు దీనిపీఠస్థలి నెలకొలిపి, సమకాలికుల యారాధనము నందిరి. ఆంగ్లసాహిత్యసామ్రాజ్యమున నొకప్పుడు శామ్యూల్ జాన్సన్ ముకుటధారియై నిలచెను. ఇతడు దుడ్డుకఱ్ఱనుకలము చేసికొనియుండును. ఇతని రచనము భారవహమైనది; పండిత ప్రకాండులకు మేలుబంతియైనది.

సంప్రదాయమునకు దాసులగువారు సహజశక్తికి చెఱుపుదెచ్చుకొందురు. మూఢభక్తి స్వాతంత్ర్యమున తిమ్మెర పుట్టించును. వీరిపాండితి వీరిప్రతిభకు గుదిబండ యగును. పుంతమేకలై నడతురు కావున డొంక కవ్వల సౌందర్యమును కుసుమవల్లరులను వీరు కన్నెత్తిచూడరు. వీరి రచనమున కనబడునవి డొంకలే గాని లలితరసాలపల్లవములు కావు.

విచక్షణ మెఱుగని ఆరాధనమే కాదు ప్రతిభారాహిత్యమును, సంశయమును, ఓటి చదువును, స్పర్ధయును, గర్వమును, దాష్ట్యమును నైసర్గికసౌందర్యమునకు చేటుదెచ్చును. తమరంగులను, తమకుంచెలను చేబూని వీని నవి మార్కొనును.

పూర్ణచంద్రునకు సుద్దపులిమి, ప్రభాతప్రభాకరునిపై పసపుచల్లి, నగుమోముగులాబికి కుంకుమ నలంది, చిఱునవ్వుబోలుమల్లెను మంచిగంధమున నూరవేసి, సహజసౌందర్యమును ఘనతర మొనరించినవా రెవరు? వీరు సౌందర్యమును సంహరించువారు కారా? దాష్ట్యమో, మూఢ్యమో, సంశయమో వీరి కుగ్గుబాలిచ్చియుండును.

జిజ్ఞాసకు సంబంధించిన సంశయము వేఱు; దాష్ట్యమునకు దగ్గఱిచుట్టమైన సంశయము వేఱు. అది మహత్తరమైనది; విజ్ఞానాన్వేషణమును పురికొలుపునది. రత్నరాసులపోలు భావరాసులను, క్రమయత్నమొనరించు తపసిమానసనేత్రముల మ్రోల నిలుపునది. రెండవరీతిశంక తనయాయువుపట్టున నజ్ఞాన మున్నదనుసంశయము నెఱుగదు. తానే పూర్ణజ్ఞానమును మణిమకుటము గావించు

మహాజ్ఞానిని బోనులో నిలువంబెట్టును. ఆరాధన మేడ? క్రాసుపరీక్ష యేడ?

స్పర్థతో కూడిన సంశయమునకు పీడనా కౌశలము మిక్కుటమై యుండును. ఖర్వము గాని గర్వము దీనికి మిగుల గూర్చునెచ్చెలి. ఇవి యన్నియు గూడినపు డెదుటియాదర్శము పై మఱింత మన్నుపడును. ఇవి ఎవ్వాని నాశ్రయించునో హానిమనసు దుశ్చింతలకు విడిది యగును. వాని దృష్టిలో దోషము ప్రవేశించితీరును. కావున వానికృత్యములు వేర్వేఱు తెఱగుల వికృతరూపములు దాల్చును.

పూర్ణానుస్వారమైన అజ్ఞానము మానావమానముల నెఱుగదు. ఇది క్షంతవ్యము. ముప్పు వాటిలుట విశేషముగ అర్థానుస్వార పరిజ్ఞానమువలననే. ఈరీతిజ్ఞానము పురుష భామవలె "తెయ్యి!" మనును. తనలోని వంక నిది యెఱుగదు. ఏకాక్షియై ఒరుల వంకలు చూపును. సుద్దులు పాడును. బృహస్పతికి బుద్ధులు చెప్పును. ఎదుట నెవ్వ రగపడినను, వారి కిది చక్కట్లు దిద్దుటకు సిద్ధపడును. పాండితి యనుకొని తన వెంగలితనమును ప్రకటించును. హనుమంతున కిది కుప్పిగంతులు కఱపును; దేవతలకు పంచాంగము చెప్పును. కోయిలకు పాట నేర్పును; అంచలకు నడకలు చూపును. వజ్రమునకు తళ్కుల నందించును; మోహినికి వలపులు తెలుపును. ఎదుటిప్రతిభకు అవమానమును, చక్కందనమునకు చేటును దెచ్చును.

బహుళహేతువులలో నే హేతువుచే

మెఱుగుపూతవలననేమి, నగలమోతవలననేమి అవమానితమైన అందకత్తెమోము నుండి అందచందములు అదృశ్యము లగును. టార్పియనుకన్య భూషలభారమున క్రుంగెనని రోమనుచరిత్ర తెలుపుట లేదా? దురంతమైన భూషణభారమున కావ్యకన్య కూలుట కెంతసేపు పట్టును?

ప్రకృతిగ్రంథమందలి ఈశ్వరరచనమే కావ్యకర్తకు నోజ్జబంతి కాదగినది. ఒక్కకిరణమందు ఒక్కసుందరదృశ్యమందు అనంతభావములు ప్రకాశమగు టెఱుగమా? వీనిని గ్రహించియే కదా కళోపాసకులు జగదీశు డనంతప్రతిభాసమన్వితుడని వాకొనిరి! విశాల వియత్తలమున నొక్కసూర్యుడును, ఒక్కచంద్రుడును తేజరిల్లుచు జగము నాలోకసందీప్తమొనరించుట లేదా? భావమరీచులతో కాంతిలు కావ్యజగతి ప్రాణసంచారముగలదై, బహుగుణాన్వితమై, సౌందర్యప్రదీప్తమై యుండునుగదా!

ప్రకృతి ఎల్లవారి నలరించును. అడవి మానిసికూడ ప్రభాతప్రభాకరుని గాంచి, పట్టరాని యానందమున గంతులు వేయును. ఇతడు రవ్యాలోకమునుగుఱించి చరిత్రలు వ్రాయలేడు. నిహితార్థమును వ్యక్తీకరింపలేడు. బహుళభావములను గుఱించి భాష్యము చెప్పలేడు. ఇతడు విమర్శకుడు కాడు. వ్యాఖ్యాత కాడు. కాని సౌందర్యమను విలోకించినంతన, వీనియాత్మ తన్మయనృత్యము చేయును.

ఆదర్శ రచనమును వీక్షించినంతన, పామరులును ఇట్లే యానందింతురు. వీరు

గలవారు; హృదయములుగలవారు; మనుష్యులై పుట్టినవారు. ఆనంద మాధ్యాత్మికమైనది. ఆత్మకు సంబంధించినది. ఆనందమందగలశక్తి వీరికి గలదు. హేతువివరణము నెఱుగకున్నను, సంతసింప జాలువారు పామరులు. మహాకావ్యములు పామరులకు దూరమున లేవు. మహారచయిత లస్పృశ్యులట్లు జనసామాన్యమునకు దూరమున నిలువరు. మీదుమిక్కిలి జనసామాన్యమందు వీరు దేవుళ్లై, నిత్యారాధన మందుచుందురు.

సహజశక్తిపై పాండితీ భారము పడినపుడే సహజ గ్రహణముపై పెద్ద రాయిపడిపోవును. కావున పాండితీవిజృంభణమునకు రంగస్థలమైన రచనము పామరుల—గుండియలను దడదడలాడించును. దీనికి వీరు దూరమందే నిలుతురు. దీని నాదర్శరచన మని తెలుపుట తప్పు.

పశ్చిమపర్వతములందు మహోన్నతమైన శిఖరము ఆర్థరుశిఖరము. ఇది సాంద్రమైన బ్రహ్మారణ్యమున గలదు. కృష్ణానది పుట్టిన చోటనుండి ఈ యరణ్యమున మూడుక్రోశులు నడచిపోతిమేని ఇది చూపట్టును. ఆర్థరుశిఖరము నధిష్ఠించినపుడు గురుగంభీరదృశ్య మగపడును. దిగ్వలయమునకవ్వలగూడ పర్వతసామ్రాజ్యము వ్యాపించి, అనంతమై గోచరించును. ఎంతోదూరమున వెండితీగవలె, వెన్నెలరేకవలె, పాలగీరవలె, పేకదారమువలె నొకచిన్నివెల్లువ మింటిచెంపను ముద్దిడుకొను కొండదారల నడుమ దోచును. ఆర్థరుశిఖరమునుండి చూడ్కిని తళుక్కుమను సీసీటిగీతపై (ఇది సావిత్రీనదిసుడీ!) దుమికించి నిమునము ధ్యానింపుడు. ఒకరుకమై, అనంతశాంతమున, అనంతకాలమున, నీబాలకల్లోలిని మహాకాయులైన పర్వతయోధులం దెట్లు నిభృతజీవితమును కడపుచున్నదో యని యబ్బురపడరా? పర్వతరాజులబోలు శబ్దములందలి లలితభావమును ఇట్లే యుండును. ఎంతో మానసికశక్తి గలిగి, గురుగంభీర పాండితీశిఖరమున నిలిచినవానికే ఈ తలపు రేక మానసగోచరమగును. సామాన్యమానవులు దీని నెఱుగనేమెఱుగరు. పశ్చిమశైలములందు సావిత్రీశైవలిని కల దని మనలో నెంద ఱెఱుగుదురు!

గంగోత్తరి నవలోకింపుడు. గగనచుంబిశిఖరమున జనించి, వేగవంతమై చనిచని, తెరువున నడ్డునిలిచిన పెద్దకొండలనుసయితము తునకతునకలుచేసి, మహారవమున లోతులోయలలో లంఘించి, ద్విగుణీకృతరయమున పోయిపోయి, సమతలప్రదేశములందు ప్రవేశించి, బహుళకేదారములను తనిపి, తన పవిత్రకర్తవ్యమును సంపూర్ణముగ నిర్వర్తించి, ప్రాప్తలాభముదితహృదయమై, రత్నాకరు జేరును. ఆదర్శరచనము గంగాధునిబోలునది. ఇది కావ్యకర్తహృదయకుధరమున జనించును. గంగ దివియందు జనించెననుచో, నిదియు నందే యుద్భవించి, కావ్యకర్తహృదయ మహీధ్రమునుండి కావ్యజగతిలో జాలువారుచుండెనని విశ్వసింపుడు. పదపుంజము దీని కడ్డురాదు. దీనికంటె నది మిన్న! రాళ్లవంటిశబ్దములు జడము లే యనుట తప్పు కాదు. సుందరసాహితీసామ్రాజ్యమున జీవసందీప్తముగాని యేనుడువునకును చోటులేదు. సహజగంభీరభావము దివిజకల్లోలినియై ఎన్నెన్ని మానసకేదారములనుతనిపి, ఎట్టి సుందర

సార్థకము చేసికొనదు? మహారచయితల హృదయ కైలాసములం దుట్టి దివ్యభావము లుదయించి, పూతకల్లోలినులై యనేక మానసములను దనుపుచుండు టెఱుగమా?

తాత్త్వికులం దుట్టివారి నొకరిద్దఱిని పేర్కొనుట సమంజసమే కదా! ఆంగ్ల గద్యరచయితలలో ఎమర్సనును, ఆధునిక భారతీయులలో రవీంద్రునిని బేర్కొనగలము. వీరి రచనలను వీక్షింపుడు. మీరు విలోకించునవి భావములు గాని శబ్దములు కావు. కోటికోటి యద్భుతదీపికలు మానసగోచర మగునుగాని మనసునకు బాధకలిగించు బండరాళ్లు కావు. దీపికలు కాచగోళములందు వెలయును. వీనిని తిలకించుతఱి గాజుకుప్పెలు కన్నులకడ్డుపడునా? ఇట్టివి కట్టెదుట నున్నవని చూపఱు లూహింతురా? ఆదర్శరచయిత పల్కులు గాజుకుప్పెలబోలునవి. పఠితలు లోనిభావప్రదీపములనే పరికించి, వానివెలుంగున కాత్మహృదయము నొడ్డి, జ్ఞానసందీప్తజీవులై వఱలుదురు. అవిరళానందబాష్పములు కన్నులనుండి జాల్వార నాదర్శగ్రంథకర్త రచనమందలి రామణీయక దృశ్యమునకు చాగిలి మ్రొక్కుటకు కన్నుగల సాహిత్యోపాసకులందఱును ఆతురంపడరా?

స్వర్గమందురు, వైకుంఠమందురు, నాకమందురు, ఏమేమో యందురు. అదృశ్యప్రపంచము లెట్లుండునో ఎఱుగము. ఇవి నిక్కములని తెలుపుటకు ప్రత్యక్షదృష్టాంతములను గానము. మాటల కందక, పల్కులందిముడక, కేవల మాంతరంగికానుభవమునకే లొంగు కవిరచిత సౌందర్య సముద్భాసిత మహాద్భుతభావసామ్రాజ్య మెట్టిదో గ్రహించి, డెందమున ననంతానంద మందమా? దివ్యాలోకముచే తేజరిల్లు ఇట్టిదృశ్యమును సృష్టించిన ఆత్మ యెట్టితపసు కావించెనో యని యబ్బురపడమా?



# తెనుగుకవిత్వంలోని క్రొత్తందనం

శ్రీ దామెర రాజగోపాలరావు

ఏభాషలోనైనా దేశకాలపాత్రలను అనుసరించి కవితావిధానంమారుతూంటుంది. తార్కాణకు ఆంగ్లకవితావిధానం తీసికొందాం: నాటి 'స్పెన్సేరియజం' మొదలుకొని నేటి 'స్విట్వెల్లిజం' వరకు సింహావలోకనం చేస్తే ఆంగ్లకవిత్వవిధానం పొందిన పరిణామం సక్రమంగానే తోస్తుంది. మన తెనుగుకవిత్వవిధానంకూడ అంతే!

అసలు తెలుగుకవిత్వం పురాణయుగంతో ఆరంభ మయింది అనాలి. ఏమంటే అంతకుపూర్వం ఏయుగం అయినా ఉన్నట్టయితే అది అంధయుగంగానే ఉండిపోయింది. ఆకాలంలో మతానికి ఉన్నంత ప్రాముఖ్యత, ప్రాబల్యత దేనికీ లేకపోయింది. దేశం మతవివాదాలతోనూ, మతవిచారాలతోనూ, మతప్రచారాలతోనూ, ధర్మోపన్యాసాలతోనూ, నీతినియమాలతోనూ నిండి ఉండేది. ఒకవైపునుండి జైన, బౌద్ధమత సిద్ధాంతాలు విజృంభిస్తూంటే, యింకోవైపునుండి వేదమతతిరస్కారసంహితములయిన కౌత్సచార్వాకాది వాదములు రేకెత్తుచుండిన రోజులవి. ఆంధ్రులలో అనేకులు వేదమతం విసర్జించి జైనబౌద్ధమతములను స్వీకరించుటకు ప్రారంభించేరు. ఆసమయంలో వేదమతపునరుద్ధరణకోసం పురాణం దిగుమతి అయింది. సంస్కృతమునుండి అన్నీ అను

లేదు. ఆ విధంగా కొన్ని శతాబ్దాలు గడిచేయి.

అంతలో కాలం మారింది. దేశం మహాదైశ్వర్యంతో తులతూగుతుంది. సంఘంలో శాంతిసౌఖ్యాలు విలాసవిహారాలు చేస్తున్నాయి. ప్రజాబాహుళ్యంలో భోగలాలస, రాగలోలత హెచ్చయింది. మహారాజులు విలాసాలతో, వినోదాలతో కాలక్షేపం చేస్తూవుండేవారు. అటువంటి వాతావరణానికి అనుగుణ్యంగా ఉండటంకోసం శృంగారరస ప్రధానమగు, లిప్సాత్మకమైన ప్రబంధం సృష్టింపబడింది. ప్రబంధ పరమేశ్వరుడు వేసిన పునాదిమీద ఆంధ్ర కవితా పితామహుండు ప్రబంధ నిర్మాణానికి పూనుకొన్నాడు. మనుచరిత్ర తయారయింది. మహారాజు 'సెభాష్' అన్నాడు. అప్పటి రసికలోకం 'ఓహో'! యని మెచ్చుకొంది. అంతటితో పురాణయుగం పూర్తి అయింది; ప్రబంధయుగం బయలుదేరింది. దానితో చిన్నమనుచరిత్రలు, పిల్లమనుచరిత్రలు, బుల్లిమనుచరిత్రలు, ఎన్నో తయారయ్యేయి. అన్నీ మనుచరిత్రకు అనుసరణలే! ఒక్క ప్రబంధం సాంతంగా చదివితే మళ్లీ రెండోది చదవనవసరం ఉండదు. అదేనాయిక, అదేనాయకుడు, అదే చెలికత్తె, అదేమోహం, అదే విరహం, అదే మన్మథోపాలంభనం, అదే

అదే ఉద్యానవనం, అదే సమాగమం, అదే సమాప్తం. నాటికవులంతా పాండిత్యప్రకర్ష, భాషాచమత్కృతి, కవిత్వానికి ప్రధానలక్ష్యాలుగ పెట్టుకొని రచన సాగించేరు. అందులకే రానురాను భాషతో కసరత్తు (Gymnastics) కుస్తీపట్లు ఆరంభించేరు. దానికి ఫలితమే హారిశ్చంద్ర నలోపాఖ్యానం, రాఘవపాండవీయం వంటికావ్యాలు. ఆ విధంగా ప్రబంధకవులచేతులలో ఆంధ్రకవిత్వం అడుగంటింది. సూరన్నవంటి ప్రతిభావంతు లెవరైన ఒకరిద్ద రున్నప్పటికి రాజానుగ్రహంకోసమో, పండితమండలి మెప్పుకోసమో, ఆ తప్పుత్రోవనే పోక తప్పేదికాదు. కనుకనే, కళాపూర్ణోదయంవంటి మహాకావ్యం రచించిన సూరన్న ప్రభావతీ ప్రద్యుమ్నంవంటి పాడుప్రబంధానికి సిద్ధపడ్డాడు. ఆంధ్రకవిత్వచరిత్రలో ప్రబంధయుగం, ఆంగ్లకవిత్వ చరిత్రలో పదునెనిమిదవ శతాబ్దమువంటిది.

ప్రాచ్యపాశ్చాత్య నాగరకతా సమ్మేళనవలన నయితేనేమి, కాలమానపరిస్థితుల వలన నయితేనేమి, దేశంలో, ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా మహత్తరమయిన మార్పుకలిగింది. ఆ మార్పే సారస్వతంలో కూడ కలిగింది. అంతటితో ప్రబంధయుగం ముగిసింది; ఖండకావ్యయుగం మొదలయింది.

ఆంధ్రకవితోద్యానమునకు హేమంతం వెడలి వసంతోదయ మయింది. కవికోకిలలు పంచమస్వరమున మధురగానం సేయుచున్నవి. కావ్యకుసుమములు నూతన పరీమళములతో వికసించుచున్నవి. రసికభృంగములు రసాస్వాదన మొనర్చుచు వినోదించుచున్నవి. సంస్కృత సారస్వతంతోపాటు ఆంగ్లసారస్వతాన్ని క్షుణ్ణంగా చవిచూచిన గురజాడకవికోకిల ప్రభాతగీతంతో తొలుదొలుత వసంతాన్ని ఆహ్వానించింది. వంగసారస్వతోద్యానవాటికయందు రవీంద్రకవికోకిలసహవాసమున వైష్ణవ కవికోకిలల కాకలీస్వనముల నాలకించి వచ్చిన రాయప్రోలుకవికోకిల తన యమృతగీతములచే కీర్తించినది. అబ్బూరి, బసవరాజు, నండూరి, విశ్వనాథ, దువ్వూరి, తల్లావఝ్ఝల, నాయని, వేదుల, దేవులపల్లికవికోకిలలు, తెలుగుతోటలో తీయని క్రొత్తపాటలు హాయిగా పాడుచున్నవి. ఆ పాటలలోని క్రొత్తందనం కొంతవరకు పరిశీలిద్దాం:

నవ్యాంధ్రసాహిత్యానికి ప్రత్యేకాలంకారం ఖండకావ్యం. పూర్వాంధ్రసారస్వతంలో మహాకావ్యాలు, కావ్యాలే కాని ఖండకావ్యాలు కనబడవు. నేటికవులు ఖండకావ్యరచనలో వృత్తంవంటి పురాతన ఛందస్సులను క్రొత్తనడకలు నడిపించుటయేకాక, 'ముత్యాలసరాలు'వంటి నూతన ఛందస్సులను సహితం నిర్మించేరు. గీతానికి క్రొత్తమెరుగులు పెట్టింది నేటికవులే! బసవరాజు, నండూరి, దేవులపల్లివారి చేతుల్లోనే గేయం ఒయ్యారపునడకలు నేర్చుకొంది. 'అవనియంతా పెద్ద అక్షయపాత్ర', 'వాడిపలీగకు', 'మ్రోయింపకోయ్ మురళీ', 'దాసిగా నుంటకైనా తగునా', 'లేపనై సాలేపలేదే', 'నట్టనడి సంద్రాన', 'దూరాన నా రాజు', 'ఈ రేయి నన్నొల్లనేరవా', 'కొమ్మలో కోకిలా కోయంటదే', వంటిగేయాలు అమృతమయాలు!

ఇంకోవిషయం. నేటికవులకావ్యాల్లో,

చిత్రింపబడదు. కవి కథలోని కొంతభాగాన్నే తీసికొంటాడు. ఆ తీసికొన్న కథాభాగం మధ్యనుండి తన కావ్యం ఆరంభిస్తాడు. 'తృణ కంకణము'లో చూడండి:

"అడుగులు బొబ్బలెత్త, వద
  నాంచలమందుల జిక్కు చెమ్మటల్
మడుగులు గట్ట, మండుకసు
  మాలపు టెండ బడంతి యొర్తు జా
ఱుకు జిలుగుంబయంట పవ
  రించుచు జొక్కిన యింపుతోడ గా
ల్నడకను బోవుచుండె వెడ
  లన్ గనుపట్టెడు తోటలోనికిన్."

అని ఆరంభం చేస్తాడు. అక్కడనుండి కథ నడుస్తుంది. 'కష్టకమల', 'స్నేహలతాదేవి', 'పూర్వప్రేమ', 'మల్లికాంబ', మొదలయిన కావ్యాలుకూడ అదేఫక్కీని నడిచేయి.

కావ్యవస్తువులుగా నేటికవులకు ఆ శశికాంతశిలానిర్మిత ప్రాసాదాలే, ఆ సుందర నందనోద్యానవనాలే, ఆ శీతలసరోవరాలే, ఆ సార్వభౌములే అవసరం లేదు. 'గతిక', 'గంగిరెద్దు', 'ఆలిచిప్ప', 'అంధభిక్షువు', 'కప్పతల్లిపెళ్లి', 'కృషీవలుడు', మొదలయిన వానిమీద ఒక్కొక్క కావ్యం రచించేరు. నేటికవులకు చక్రవర్తిచరిత్రకంటె కూలివానిజీవితమే కావ్యానికి విశేషాదరణీయం. కనుకనే, వీరి కృతులలో నాయికానాయకులుగా మహారాజులు, రాచకన్నియలు కనబడరు. చూడండి: నండూరివారి కావ్యంలో 'వెంకి నాయుడుబావలు' నాయికానాయకులు; 'సౌభద్రుని ప్రణయయాత్ర'లో కవే నాయకుడు, కవిప్రియురాలు నాయిక; 'తృణకంకణము'లో ఊరుపేరులేని యువతీయువకులు నాయికానాయకులు.

పూర్వకవులశృంగారం పరిపూర్ణంగా కామావరణమందే సంచరించింది. నేటికవుల శృంగారం కేవలం ప్రేమావరణమందే విహరిస్తూంది. ప్రేమ హృదయసంబంధి! కామం శరీరసంబంధి! కనుకనే, పూర్వకవులు శారీరక సౌందర్యాన్ని ఆనందిస్తూ, అసభ్యమైన, అంగోపాంగవర్ణన చేసికొంటూ వచ్చేరు. నేటికవులకావ్యాల్లో లిప్సాత్మకమైన అంగాంగవర్ణన కంచుకాగడా వేసి వెదకినా కనబడదు. స్త్రీమూర్తిని చిత్రించుటలో నేటికవులు పోయినపోకడలు ప్రశంసింపదగినవి. ఉదాహరణకు 'ఊర్వశి' మూర్తిని తీసికొందాం:

"నీవు తొలిప్రొద్దుసను మందుతీవసోనవు,
నీవు వర్షాశరత్తుల నిబిడసంగ
మమున బొడమిన సంధ్యాకుమారి, నీవు
తిమిరనిశ్వాసముల మాసి కుములు శర్వ
రీవియోగకపోలపాళికవు, నీవె,
నీవె నిట్టూర్పు, నీవె కన్నీరు, విశ్వ
వేదనామూల్యభాగ్య మీవే, నిజమ్ము
నే గళమ్మార పాడుకొనిన యఖాత
శోకగీతమ్ములం దీవె శోకగీతివి!
ఊర్వశీ! ప్రేయసీ!"

—ఊర్వశి.

స్త్రీయెడల నేటికవులు పూర్వకవులవలె కామోద్రేకమును గాక, దివ్యమైన ప్రేమను ప్రదర్శింతురు. నేటికవి తనప్రియురాలితో పలికే విధానం చూడండి:

"అంతె శ్రమపడి పావన మభ్రగంగ
ధారుణికి దెచ్చినాడు భగీరథుండు,
అంతె మథియించి కలశరత్నాకరమ్ము
అమృతభాండమ్ము పడసినా రమరవరులు,
మత్పురా నేకపుణ్యజన్మములు పండి.

నైన నీదివ్యసాన్నిధ్య మందుకొంటి
పుడమికిఁ స్వర్గమునకొక్క ముడి రచించి."
—సౌభద్రుని ప్రణయయాత్ర.

హృదయంగమములయిన కావ్యాలంకారము లనేకములు వాడిచూపుటలో నేటి కవులుపోయిన క్రొత్తపోకడలు చూడదగినవి:

"సంజెలను దారిదప్పి మిలిందములుతుల
జేసెపొ లిచ్చి చీకట్ల దిరుగనీక
ఉదయ మగుదాక రొమ్ములోన నిదురబుచ్చి
జేరదీసిన మమతకు జిక్కె నళిని."
—స్వప్నకుమారము.

"లక్ష్మణా! చూడు మేలకిలతలు పూసె
వాసనల నిండుకొను మాధవీకుసుమములు
సీతకన్నులవోలె విచ్చె నాకొంతి
వేదనలు విచ్చె నా మనోవీథియందు."
—ఊహాగానము.

"అ తరుచ్ఛాయ లోలసిన యంతవరకు
స్నిగ్ధశీతాతలమ్ములు చెన్నమీఱు,
నెండకన్నెఱుగక, వానయేపు గనక
యలరు కలవారియింటిబిడ్డలవిధాన."
—తృణకంకణము.

"ప్రేమపిపాసచే నమృత
పీథులజేరిన సుందరాంగనా
స్తోమసితాపకుంకవత
తుల్ సుమి యాతెలిమబ్బు దొంతరల్."
—దీపావళి.

"మాయునిశీథి కుచ్చెళుల
మాదిరి ప్రాకుపనీమహీజపుం
జాయలు."
—ఊర్వశి.

"విరహబాష్పతుషారమ్ము గురిసికురిసి
కను మెంగిడ్చెను హేమంతకాలరాత్రి."
—దీపావళి.

"నింగిమూలలె నీలిపందిళ్లు పరచి
ఎంత తెలిమల్లెతోట వేయించినానో."
—ఊర్వశి.

"అలరుమనకుబోలె నా హృదయమ్మనకును
జన్మమున కొక్కటే వికాసమ్ము సకియ."
—దీపావళి.

"తమి విదారించు నవచంద్ర ధవళరోచి
రుదయములు వోని చూపులు."
—తృణకంకణము.

అపుడు నిర్మేఘమార్గ శీర్షా గ్రవీథి
వృద్ధసంధ్యాతపస్విని పెదవి విరిచె."
—దీపావళి.

"అవని యంతా పెద్ద అక్షయపాత్ర
అఖిలేశు హస్తమే అన్నపూర్ణమ్మ."
—కృష్ణశాస్త్రి.

"ఆకాశపు బెడారిలో, కాళ్లుతెగిన
ఒంటరి ఒంటెలా గుంది జాబిల్లి."
—ఒకరాత్రి.

"ఎలుతురంతా మేసి ఏరు నెమరేసింది,"
—యెంకిపాటలు.

"ఏటికడుపువదాగి తోట నిదరోయింది."
—యెంకిపాటలు.

ప్రకృతిని చిత్రించుటయందు, ఒకేసందర్భమున, పూర్వకవుల శిల్ప చమత్కృతితో నేటికవుల శిల్పచమత్కృతిని తూచి చూపిస్తాను; సాయంకాలవర్ణన :

"చుక్కలు తోడుతోడ దల
చూపదొడంగె, మనోభవుండు వి
ల్లెక్కిడి చక్రవాకముల
యిక్కలఁ రోయగజొచ్చె, నేలకుం
బెక్కుచువచ్చె, దీవియల
యేత్తెలసోయగమంద, సందడుల్

దక్కు బిరంబువీథుల, ము
దంబొలసెన్ విటచిత్తవృత్తులన్."

—తిక్కన.

"క్రుంకె నపరాంబురాశిం
బంకజబంధుడు తదీయబడబాముఖవీ
త్యాంకురితపటుకరద్యుని
రంకుశవేగాపహృతకళంకుడు వోలెన్."

—పెద్దన.

నల్లడెల గ్రమ్మి సాయంతనంపు టెరలు
నీలకాదంబినీజవనికల వెనుక
మినుకుమినుకను తారకాగణము లెల్ల
మందకళల వెలార్చు నంబరమునందు!

రసవదాలాపగతి నొక రమ్యగీతి
పాడిపాడి కోయిల తన గూడు జేరె;
మంజుగానానురాగ ప్రమత్తయైన
కాపుకన్నె మందలతోడ గదలి చనియె.

వచ్చియును రాని పలుకుల ముచ్చటించు
వలపుబిడ్డల కన్నము గలిపి తెచ్చి
మాయమాటల మ్రింగించు మాతృవచన
గతులు తోచె గృహారామతతులయందు.

—అబ్బూరి.

వేములవారి 'సుధాకరా!' లోని చంద్రునివంటి చక్కదనాలహంస ఒక్క ఆంధ్ర సాహిత్యమే కాకుండా విశ్వసాహిత్యం అంతా వెదకిచూసినా కనబడదు. మచ్చునకు ఒక పద్యం చూపిస్తాను:

"నీవొక యప్సరః ప్రణయినీకబరీచ్యుతపారిజాతమా
లావిసరంబవో, మఱియిలాతల మంట సుధాతుషార వ
ర్షావిమలావకుంఠనము జార్చుచు బోవు శరద్విభావరీ
దేవిలలాటికామణివో, దీపికవో సురరాజ్యలక్ష్మికిన్.

భావం శైలిని మించిందా, శైలి భావాన్ని మించిందా అనుపించే అపూర్వమయిన పద్యాల్లో నిది యొకటి!

కవిత్వానికి ప్రధానలక్షణం భావనాశక్తి! భాషాచమత్కృతియందు పూర్వకవులు అసమానులయినప్పటికీ, భావనాశక్తియందుమాత్రం నేటికవులకు క్రిందే! ఈ ఘట్టమే యిందులకు సాక్షి:

"అపుడు గొంతెత్తి యేడ్చినాను;
అపుడు నన్ను
గాంచగా నోపగా లేక కన్నులట్టె
యార్చికొనినవి తారకలు;......
..............................
..............................
అపుడు
కుంచుకొని కుంచుకొని కుహూకుహరవాటి
నను దొలగి దవ్వుదవ్వుల చని శిరాలు
వాల్చుకొనినవి తిమిరాలు భయవశాన;
అపుడు బ్రతుకొక్కటే యేడుపైన గాలి
కిచ్చవడి పట్టె పసిపాపతీల మూన
యానమున జారి సుప్తపత్రాళి నొఱగి
పొంచిచూచుచు చలియించిపోయినాడు;
అప్పుడీ విశ్వకేళి నిత్యయాత్ర వాగి
శ్రవణములు మూసికొనినది,......

—ప్రవాసము.

భావం వింతపరువులు పెట్టింది. నేటి కవుల కావ్యాల్లో ఇటువంటివి అనేకం ఉన్నాయి!

'మూకశోకము', 'మూగసోయగము', 'వలపుతీపి', 'మధురవేదన', 'తీయని ప్రేమవేదన', 'విరహ విషాదరేఖ', 'విరహాతోరణము', 'అరుణారుణాంధగీతి', 'అమవసకన్నెటిపాట', వంటివి నేటికవుల రచనకు ప్రత్యేకలక్షణం!

తెలుగుతోటను చక్కగా దిద్దితీర్చి కొత్తపూలు పూయించునది నేటికవులే

అయినప్పటికి, అధునాతన సారస్వత మండలి అపభ్రంశములకే అట్టులు సాచే పండితమండలి మాత్సర్యపు విమర్శనల గాలి దుమారం నేటికవులపై ఇంకా విసరుతూనే ఉంది. ఔను! కవులయందు సమకాలికులు ప్రదర్శించే ఈర్ష్యాప్రపూరితమైన నిరాదరణం లోకప్రసిద్ధం! కావుననే చామకూర వెంకన్న "సమకాలికు లెన్నడు మెచ్చరే కదా" యంటాడు. మహాకవి భవభూతి హృదయ వేదనతో

"యే నామ కేచిదిహ నః ప్రథయంత్యవజ్ఞాం
జానంతి తే కిమపి, తాన్ప్రతి నైష యత్నః,
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి, ర్విపులా చ పృథ్వీ."

అని పాపం! జాలిగా నిట్టూర్పు విడుస్తాడు. అటువంటి భవభూతి ఈ కాలానికి కవిచక్రవర్తి యైనాడు. కనుక, నవకవులను, అసూయాపరులైన సమకాలికుల విమర్శనల దాడికి చలింపక, తెనుగు కవితాకన్యను అపూర్వములయిన నూతనాలంకారములచే నింకను కైసేయు మని హెచ్చరిస్తూ, యీ వ్యాసం ముగిస్తున్నాను.

---

# వసంతలక్ష్మి

శ్రీ పాకల వేంకటసూర్యనారాయణ

---

నవ్య వాసంతికా
నవయౌవనశ్రీలు
కైసేసి రావమ్మ
కళ్యాణమస్తు!

ఈ శుభోదయవేళ
ఎలమావిపందిళ్ల
కోకిలాంగన నిలచి
గొంతెత్తి పాడినది.

చివురాకు వసనాల
చిన్నారి విరిచేడె
మంద మందాక్షయై
మధుపాత్ర తెచ్చినది.

పలుకబారినపండ్ల
పళ్లెరమ్ములు పట్టి
వేడ్కతో వనలక్ష్మి
పేరటాలై వచ్చె.

ఎచట గన్నను శోభ!
ఎచట విన్నను పాట!
ఎంతమంగళకరము!
ఈ మధూదయవేళ!

ప్రకృతియాశీః ప్రసవ
భాగ్య శీర్షవు నీవు;
ధర్మ దీక్షా బద్ధ
ధర్మకంకణ వీవు.

---

# విమర్శకుడు - కళోపాసకుడు

శ్రీ పిల్లలమఱ్ఱి వేంకటహనుమంతరావు

విమర్శకకళోపాసకుల కర్తవ్యతాబాధ్యతలను, వారివారి ముఖ్యోద్దేశములకుఁ దోడగు వివిధోపాయములను, వారియుత్కృష్టాదర్శములకు మార్గదర్శకములగు విషయములను, మరి తదితరవిషయములను నవగాహన చేసికొనుటకుఁ బూర్వము విమర్శన మనఁగ నేమిరో, కళయనఁగ నెట్టిదో, యెట్టివాఁడు విమర్శకుఁడని, కళోపాసకుఁడని పిలువంబడెడినో యెఱుఁగుట మన కవశ్యకర్తవ్యమై యున్నయవి.

సూక్ష్మరీతిని బరిశీలించిన విమర్శకునికిని, కళోపాసకునికిని సన్నిహితసంబంధ మున్నటులు దెలియనగును. నిజముగ కళోపాసన, కళాదృష్టి, కావ్యాదులయందుఁ బ్రవేశమును గలిగియుండి, గొప్పరసికుఁడైనవాఁడే విమర్శనాకార్యమునకుఁగాని, కళారాధనకుఁగాని గడంగుట కర్హుఁడగును. దీనిఁబట్టి విమర్శకునికిని, కళోపాసకునికి నొకేవిధమగు పరికరము లుండవలయు నని మనము దెలిసికొందుము. ఒక్కొక్కతఱిఁ గళోపాసకుఁడే విమర్శనకుఁ గడంగుట సంభవించుచుండును. కళోపాసకుఁడు, కావ్యాదులం దగురీతిని బరిశీలించి, యందలి లోపాలోపములను గుర్తెఱుంగుట కెక్కుడవకాశ మున్నది. తాను గుర్తెఱింగి, యితరజనంబుల కెఱుక చేయుటయే విమర్శనాదర్శకము. ఈ విధంబున విమర్శన, కళోపాసకుని కలముపై నాధారపడినచో గుణాగుణపరిశీలనముగా నెంచఁబడవచ్చును.

ప్రత్యేకముగా నీరెంటినిఁ బరికింతము గాక! ఈ కార్యాచరణకుం గడంగుటలో రెంటికిని సాదృశ్య వైధర్మ్యముల సులభ మార్గముగఁ గన్గొన వీలగునను నాశయము ప్రబలియున్నది.

మున్ముందుగ 'విమర్శన'మన్న నెట్టిదో విపులముగఁ బరిశీలింతము. ఈ పదము ననేకు లనేకవిధముల నిర్వచించియున్నారు. ఎవరికిఁ దోఁచినటులు వారు వాకృచ్చుచుండ నేఁటికి విమర్శనమను పదమునకు భిన్నాభిప్రాయము లేర్పడి, విమర్శకుఁడన్న కేవలముఁ గావ్యములపట్ల రక్కసుఁడుగ భావించునంతటి భీతిని నెలకొల్పినది. నేఁడు ప్రతివిమర్శకుఁడును 'విమర్శన'మ నుపదమునకు భిన్నమైన నిర్వచన మొసంగుచున్నాఁడు. లక్ష్య మేదియు లేక,నోటికి వచ్చినటులు, కలము నడచి రీతిని బ్రేలుచుండువిమర్శకుల ననేకులఁ గాంచుచున్నారము. సంప్రదాయార్థములో విమర్శకుఁడు దోషాన్వేషి గా నెంచఁబడుచున్నాఁడు. కొందఱు, కావ్యాది కళలయందలి గుణదోషవిశేషములను బరికించి, యున్నది యున్నట్లు దెలుపువాఁడు విమర్శకుఁ డని యూహించుచున్నారు. మరి కొందఱు కృతియందలి విశేషములనే
[illegible]

చితముగ నభినందించుట విమర్శన మను చున్నారు. ఒకవస్తువును గైకొని, యందలి కవితామాధుర్యమును గాని లేక రసోత్కృష్టతనుగాని, చమత్కృతులను, తదితరాన్వయములను సహాయముగఁగొని యితర వస్తువులను వీనితోఁ బోల్చి యేది మిన్నయో నిర్ణయించుతత్త్వమే విమర్శకతత్త్వమని కొందఱు నుడువుచున్నారు. దీనికి సంబంధించినవాక్యమే 'విమర్శన మొక యానుషంగిక (Comparative) పరీక్ష' యనునది.

విమర్శకుఁడు నిజముగా, నిష్పక్షపాత బుద్ధితో నద్దేని పరిశీలింపవలెను. లేదేని యయ్యది విమర్శన మనిపించుకొనక, కేవలము కవిపైనున్న యభిమానమువలనఁగాని, లేక నాతనిపై నిరసనభావమువలనఁగాని పురస్కరింపఁబడిన కలముయొక్క నడకగా నెంచఁబడును. బాగుగ పరికించిన నేఁడు వెలువడు విమర్శనములలో చాలవఱకు నీ నిర్వచనమునకుఁ దోడగునవే యని గ్రహింపఁగల్గుదుము! ఒకానొకఁడు తన విమర్శనమం దొకకవిని, అతనికృతిని ఖండించినచో, నాకవిపైనున్న యభిమానముచే వేరొకఁడుదానిని తిరిగి ఖండించుచు మఱియొకవిమర్శన మావిమర్శనపై వ్రాయఁబూనుకొనుట సామాన్యముగ మనము గాంచుచున్న విషయమే. తుద కీవిమర్శనలు వ్యక్తిగతమాకక్షల వెలిఁబుచ్చుమార్గములుగా నుపయోగింపఁబడుచున్నవి. క్రమముగ వ్యక్తిద్వేషమునకుఁ గారణభూతమై విషమపరిణామము నొందుచు ముఖ్యోద్దేశ్యమునకు దూర మగుచున్నవి. ఈ సందర్భమున నొక విషయము చెప్పవలసియున్నది. విమర్శనము కృతుల ననుసరించునదికాని కృతికర్తల కనువర్తించునది కాదని ప్రతివిమర్శకుఁడును గ్రహింపవలెను. కృతిలోనున్న గుణదోషములఁ గాంచుటేకాని కృతికర్తల గుణదోషముల నెంచుట విమర్శనాపద్ధతికి విరుద్ధము. నేఁటివిమర్శకులలోఁ గొందఱు దీనినే గ్రహింపలేకున్నారు. విమర్శకుఁ డెన్నఁటికిని కృతికర్తపై తన కున్నయభిప్రాయము ననుసరించి యాతనికృతిపై తదభిప్రాయమే ప్రతిబింబించునటులు వ్రాయఁబూనుకొనఁడు.

'Judge not others that they be not judged'

అనువచనమును ప్రతివిమర్శకుఁడును గమనింపఁదగినది.

నిజమైన విమర్శనలోఁ గలహములకుఁ గారణంబులగు విషయము లుండక, విషయవిభజన, వ్యాకరణార్థపరిశీలన (Philology) నిరుక్తము, భావవ్యాఖ్యానము, పరిష్కరణమున్నగు నితరవిషయములు చేరుచున్నవి. వీనియన్నింటియెడను గౌశలము వడసియుండువాఁడే సరియైన విమర్శకుఁడు. అనఁగ, విమర్శకుఁడు సర్వతోముఖుఁడై విజ్ఞానసర్వస్వసాధకుఁడై యుండవలె నన్నమాట!

విమర్శన మందు చారిత్రక, శాస్త్ర, కావ్యవిమర్శనము లని ప్రత్యేకవిభాగము లున్నవి. విమర్శకులలో నిరుతెగ లున్నారు. ౧. ఉన్నదాని నున్నటులు విపులీకరించి యర్థమును (కవి తలంచినరీతిని) చెప్పువారు. ౨. ప్రత్యేక వాక్యములను, సందర్భములఁ గైకొని ఖండించువారు. విమర్శకులకు గర్వము హెచ్చఁగ నహంభావముతోఁగూడి, యున్నదాని విపులీకరించుటే యేమిప్రయోజకత్వ మని తమయభిప్రాయ [illegible]

ములు సల్పుచు ఘర్షణలలోనికి దిగుదురు. అట్టిచో వీరు రెండవ తెగలోనివారుగాఁ బరిగణింపఁబడెదరు. విమర్శనోద్దేశ్యము గుర్తెఱింగి, తత్పద్ధతుల నరసి, దాని కనువగు పరికరముల సమకూర్చుకొని, తదుద్యమమునకుఁ బూనుకొనిన మహాపురుషుని విమర్శనము సార్థకనామముతోఁ బరఁగుననుట నిస్సందేహము. ఇట్లు సర్వలక్షణలక్షితుండై సకల పరికర సమన్వితుఁడై పరఁగునాతని విమర్శన ముదాహరణగాఁ గైకొన సాహసింపవచ్చును.

విమర్శనమే ప్రత్యేక వాఙ్మయస్వరూపము దాల్చుచున్నది. గూఢార్థమును ప్రకాశింపఁజేయుట, ప్రజలకు కళాసౌందర్యమును వెల్లడించి, కావ్యాదులయందు, కళోపాసనలందు నభిరుచి, యాదరణాభిమానము లేర్పఱచుట విమర్శనయొక్క ముఖ్యాశయములు. కనుక విమర్శకుఁడు పై నుదాహరించిన పరికరములతోడను, మహదాశయములతోడను, నిష్పక్షపాతబుద్ధితోడను విషయవ్యక్తీకరణమే ప్రధానకర్తవ్యముగా నెంచుచుఁ దాఁ గైకొనినదానిలోని లోపాలోపముల నవలోకించి చదువరులకుఁ జూపుచుండవలెను. విమర్శన మని నామం బిడుట కట్టితఱి గాని సమంజసము గాదు. లేనియెడల "ప్రశంస" యనియో లేక "రంధ్రాన్వేషణ" మనియో వారివ్రాఁతలకు నామంబిడిన ఘర్షణకుఁ దావుండదు !

ఇఁక కళనుగూర్చి కళోపాసకులఁగుఱించి తెలిసికొనవలసియున్నది. ప్రథమమున 'కళ' యనుపదమును నిర్వచించి పిదప దాని వివిధ శాఖలు,వాని నారాధించుపద్ధతులను గ్రహింతముగాక !

'Art is the presentation of Real in its mental aspect'

అనఁగా, జీవనసాదృశ్యము యొక్క మానసికరూపమును ప్రదర్శించుటయే కళ — యని యొకమహామహుఁడు సెలవిచ్చియున్నాఁడు. చతుష్షష్టికళ లున్నటులు మనకు తెలియుచున్నవి. కాని వాని నన్నింటిని గ్రహింపఁగల్గునంతటి యవకాశము మన కిచ్చట లేదు. ఈ అఱువదినాల్గుకళలలోను లలితకళలుగా నెంచఁబడుచున్నవానిఁ గైకొని తగుకీలిని బరిశీలింతము:—

కవిత్వము, చిత్రలేఖనము, తక్షణము (Sculpture) సంగీతము, శిల్పకళ (Architecture) లలితకళలుగా నెంచఁబడుచున్నవి.మన భారతదేశమున లలితకళలపైనున్న యాదరము, తత్కాలౌన్నత్యము మరియే యితర దేశమందును గానుపించదు. హిందూదేశము శిల్పశాస్త్రములో నద్వితీయము. సంగీతములో సాటి. కవనమందు కన్నెర్ర. చిత్రలేఖనమందు చాతురీధురీణ. తక్షణములో తార. ఇట్టి వైశ్వర్యము లభింపఁజేసిన విశేష నైపుణీధురంధరు లెందరో మనభారతదేశము నాదర్శప్రాయముగాఁ జేసినందులకు వారు వందనీయులు. అధునాతనయుగమున పాశ్చాత్య దేశములందు లలితకళల కెట్టి యాదరము కలదో యించుక గమనించినవారు, విదేశములందే వీనిజనన మనియు, అచ్చటనే కళ ఔన్నత్యము గడించినదనియు సరియైన పరామర్శలేక, యభిప్రాయపడుచున్నారు. యథాతథముగ, నే విజ్ఞానమును గైకొనినను పూర్వము భరతదేశమందు వరలిన దేశాని యన్యము గాదు. సంస్కృతము, గణితశాస్త్రము, ఖగోళశాస్త్రము (Astronomy), సాముద్రికశాస్త్రము (Palmistry), ప్రకృతిశాస్త్రము, వేదాంతము (Philosophy) తగ,

శాస్త్రము, వైద్యశాస్త్రము, తదితర శాస్త్రములును—పై నుదాహరించిన లలితకళలు మొదలుగాఁగల వన్నియు, భారతభూమిలో జన్యంబులే! నేఁటికి వాని నితర దేశంబుల నుండి నేర్చుకొనుచుంటిమని, సర్వవిజ్ఞానము వారిధనమే యని తలంచునంతటి దౌర్భాగ్యము కలుగు టెంతయు శోచనీయము. ప్రాచీనవిజ్ఞానమును విస్మరించు విన్యాసము వెల్లివిరియుట విచిత్రముగా కేమున్నది? మన ప్రాచీనశాస్త్రములను, సంప్రదాయములను నిరసించు మనోదౌర్బల్యమునకు గురియై, పాశ్చాత్య సంప్రదాయములను, శాస్త్రముల నభినందించుచు, "పొరుగింటి పుల్లకూర రుచి" యన్న సామెతను నేఁటిభారతీయులలో నవనాగరికులమని గర్వపడువారు సార్థకపఱచుచున్నారు. నిజము గ్రహించిన మనము మనశాస్త్రములను నిల్పుకొనలేక, పఠింపలేక యితరుల కందఁజేసి, నేఁడు తిరిగి వానినే యితరులచేతను బోధింపఁబడవలసిన స్థితిలో నుంటిమికదా! ఏమి ఈవైపరీత్యము!

ఇఁక నొక్కొక్క లలితకళను గ్రహించి ఒకనాఁటి తదున్నతిని సంస్మరించి పరికింతము గాక!

౧. కవిత్వము: మనభారత దేశము కవనములో కన్నెర యంటిమి. నిజమునకంతియే. భావగాంభీర్యములందుఁగాని, భావార్థప్రకర్షణమందుఁగాని, రసికత్వమునఁగాని, పదకపొందికలోఁగాని, యలంకారపు టందమునఁగాని ఇతర దేశముల కవులు మన కవులతో సాటిరారు. శృంగారరసవర్ణనలలో మన కవుల కవనములు సోపాన మెక్కినవి. కవిచమత్కృతు లపూర్వములు. నవరసములొక్కపరి చిప్పిలఁజేయుసమర్థతలో మనవారగ్రగణ్యులు. ప్రబంధరచనలు, ద్వ్యర్థి కావ్యరచనలు మనకవివర్యుల మనంబులనే మొలకలెత్తినవి. షేక్స్పియర్ వ్రాసిన 'మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీము' (Mid summer night's dream) అనునాటకమును జూచి మనకవులను నిరసింప నక్కఱలేదు. దానికి దీటుగ పింగళి సూరన మనకొసంగిన "కళాపూర్ణోదయ" మున్నది: వర్ణ్యవస్తువే ప్రకృత్యుపాసకుఁ డని మన దేశపు నవనాగరికులు తలంచ నవసరములేకుండ మనకవులందఱు నట్టివా రని నుడువుచున్నాను. ఇందులకు మన వారిప్రబంధములలోని ప్రకృతివర్ణనలే ప్రమాణములు! కాళిదాసుని శృంగారముతో నెవ్వియు సమంబులు గావు. కనుక ప్రాచీన కవులకవనము లెట్లు నీతిబోధకములై, వర్ణనా పూర్ణములై భగవద్భక్తినిఁ బురిగొల్పువిషయములతో వరలినవో యట్లే నేఁటికవులుగూడ ప్రాచీనసంప్రదాయముల వదలక క్రొత్తనడవడిక సులభమార్గమున (ఉత్తమాశయములతో) వ్రాయుచున్నారు.

౨. చిత్రలేఖనము: హిందూదేశము చిత్రలేఖనమందు చాతురీధురీణ యంటిమి. ఈ వచన మూరక వ్రాసినది కాదు. నిజముగ, నీకళౌన్నత్యమును గమనింపవలెననిన, నిజాము రాజ్యమునందలి ఔరంగాబాదుజిల్లాలోఁ జేరిన 'అజంతా' చిత్రములే యుదాహరణంబులు. ప్రాచీనకళౌన్నత్యమును ప్రజలు విస్మరించునట్టిదినంబు లేతెంచినను, ఆ చిత్రములు నేఁటికిని సజీవములుగ నుండి చెక్కుచెదరక నూతనము లేమో యని భ్రమింపఁజేయుచున్నవి. నిజముగఁ జిత్రరచన మనిన నానాఁటిచిత్రకారులదే! చిత్రకళాపోషణమనిన నాఁటిమహీశులదే! కళోపాసన

మున్న నాఁటిదే! నిజముగ మనుష్యుని వర్ణించి నంత, నా వర్ణనను విని చిత్రించునట్టి కళా కౌశలముగల చిత్రకారు లుండువారలు. ఆ నాఁటి చిత్రకారుల కళౌన్నత్యమును వెల్లడి చేయు 'అజంతా' చిత్రములు నేత్రోత్సవ దాయకంబులు. ప్రాచీనకళౌన్నత్యమును, ప్రజల కందఱకును జూపుటకొఱకై తగు సౌకర్యము లేర్పఱచిన మ. ఘ. వ. శ్రీ నిజాంప్రభువుగారి నిష్పట్లి నభినందింపవలసి యున్నది!

౩. తక్షణము: ఇందలి నైపుణ్యమును గ్రహింపవలె ననినఁ బ్రాచీనపుకట్టడములనే గమనింపవలెను. ద్వారములందును, జాతి స్తంభములమీఁదను కాననగు చెక్కడము లిప్పు డేరు ననుకరింపఁజాలరు. ఆనాఁటి యుద్ధములలో నుపయోగింపఁబడిన ఖడ్గములపిడుల పైనను, డాలులమీఁదను, కవచములపైనను గొప్ప తక్షకులచేఁ జెక్కఁబడిన పనితనము నేఁటికిని మనము వస్తుప్రదర్శనశాలలలోఁ గాంచగల్గుదుము. ఫిరంగిగొట్టములమీఁదను నాఁటి తక్షకులనైపుణ్యము మెఱయుచున్నది. ఆగొట్టముల ముఖములు, నేసింహపు నోరుగనో, మొద్దుశలగనో చెక్కినట్లు గనఁబడుచున్నవి. ఎల్లోరాగుహాలు మొదలైనవి మన తక్షకుల కళౌన్నత్యమును బ్రకటించునవి.

౪. సంగీతము: "గీతం వాద్యంచ నృత్యంచ త్రయం సంగీత ముచ్యతే" యను శాస్త్రజ్ఞుల వాక్యానుసరణముగ సంగీతము గీత వాద్య నృత్యసమ్మేళనము. సంగీతమునే 'భరత' మని నుడువుట వినుచున్నారము. అనఁగా భావరాగతాళయుక్తమే సంగీతమనునది. సంగీతము మనదేశమునకుఁ గ్రొత్తది కాదు. ఇది వేదకాలమునాఁటినుండి యున్నట్లు సామవేదమువలన తెలియనగును. సంగీతమును తరణోపాయంబున కనువగునదిగా నెంచి, శ్రీ త్యాగరాజు, దీక్షితులు మున్నగువారు దానిం జేపట్టి స్థిరకీర్తింబడసిరి. నేఁటికిని త్యాగయ్యగారి కీర్తనలు, కృతులు రసజ్ఞుల నలరించుచునే యున్నవి.

౫. శిల్పము: దీనియౌన్నత్యము ప్రాచీనదేవాలయాదులయందుఁ గాననగును. ఇందులకు మనదక్షిణదేశమే పేర్కొనఁదగినది.

కళోపాసనయొక్క ముఖ్యతత్త్వ మీశ్వరోపాసనయే. కళయొక్క పరమావధి భగవంతుని నిరూపించుటే. మనకు కళాపోషకు లత్యావశ్యకము. ప్రాచీనసంప్రదాయముల విస్మరింపక, యుదాత్తాభిప్రాయములతోఁ బ్రాచీనులు చూపిన పథములనే పోవుచు నొకప్పటి భారతీయప్రతిభను, విజ్ఞానమును, కళౌన్నత్యమును సంస్మరించి వానిని పునరుద్ధరించుట యావశ్యకము.




మనోహరత్వము
స్త్రీయొక్క మొదటివలపు




POND'S
Cleansing

# కథాకలాపం

శ్రీ అత్తిలి సూర్యనారాయణమూర్తి

'నాకథ అంతా చెప్పవలసివస్తే భారతం అంత అవుతుంది.'

ఇల్లా వాడుకగా ఉండేమాటల్లో నిజాలు విషయాన్నిబట్టి విస్తరింపుకుంటూ పోతూంటవి. ఒకవిషయాన్ని ఫలితార్థ్నీ, మనసు కెక్కించాలంటే, మామూలుపలుకుల్లో, ఉపమానాలతో వర్ణిస్తే హృదయాన్ని తట్టి లేపటం సహజం. ఒక్కముక్కలో సూటీగా చెప్పేదానికన్న దీనికెంత విలువో అక్షరాల నాడే గ్రహింపబడ్డది.

పుట్టుక :

భారతంవిషయాలు నిజాలైనా, కావని అనుకున్నా కథగా వర్ణితాలగుటలో, విషయ ప్రాశస్త్యాన్నిబట్టి కలకాలం నిలువా విలువా కూర్చుకున్నాయి. పెద్దకొల్లేటి చేంతాడులా-కథలోకథ—ఇంగ్లీషులోనూ రైనాల్డ్సులాంటివారు వ్రాశారు — చెప్పకుపోయినదాన్నే కథ అనటం; పోతే యీరోజుల్లో 'నోవల్' అనటం వాడుకైంది.

ఇక చిన్నికథ, కథానిక-యీపర్యాయ పదాలు భారతంలోని ఉపాఖ్యానాలకు తమ్ముళ్లు అనవచ్చు.

చిరజీవులు :

అయితే మరపురాక సామెతల్లో వాడబడే చిరజీవులుగా, సాహిత్యంలో నిలచిపోయే కంటె, సుందోపసుందులూ, ఉత్తరకుమారుల కథలూ, దర్మిలాను ప్రవరాఖ్య నడవడీ—ఒక్కమాటుగా యీనాటికి వస్తే గిరీశం నీలకంఠాల కథలూ, మనసుల్లో మెదలేవి, తారాపథంలో మెరసిపోతూన్నవి చాలగా ఉన్నాయి.

సృష్టి-వినియోగం :

అక్షరాస్యుడు కాని అరువదేళ్ల వాడూ కుర్రనాయనే! అందుకే అర్భకథానిధిలాంటి కబ్బముల సృష్టి మరింత అవసరం.

ఔను సృష్టే! ఎంచేత నంటారా! గజిబిజిగా ఉండే వర్ణనలతో ఖంగారు చేసి అసలుసంగతికి దూరం తీస్కొని వస్తే, అంతు తెలియకపోవటమే ఫలం.

'పూర్వం దశరథరాజ గర్భజననం... రామతపోవనానుగమనం... రావణకుంభకర్ణ వధనం...ఏతద్ధి రామాయణం' అనే యీ శ్లోకం ఎన్నో పాదాలుగా ఉండకపోవటమే కాదు చమత్కారం; దీనిలో కథ ఏమిటీ; కొంచెం ఆలోచిస్తే నీతి ఏమిటీ అనేది స్ఫురింపచేసుకోనిస్తుంది.

పరిణామం :

దీనిలో నీతి, ధర్మం, అనుచరణయోగ్యం, యిదీ అని స్పష్టపరుస్తూ ఆమాటలే వ్రాయటం, రానురాను, చదువరి లేక వినేవారిబుద్ధి

సూచించి, పొసబట్టి వదలటమూ యీ కథలలో అనుస్రుతంగా వస్తూంది.

వీథిపాచి లగాయతు, విశ్వపరిభ్రమణ వరకూ, ఆరోగ్యం మొదలుకొని, ఆనందం, అహంబ్రహ్మదాకా, రాసక్రీడ దొరకొని, రాజనీతిపారంచుట్టే విషయాలన్నీ, సంఘం, సారస్వతంలో సమపాళ్లుగా పులిమేసింది. దాన్నే వ్యక్తీకరించటంలో కథారూపం అవుత.

పద్యరూపంవేరే అవతారం. ఇది ఏమిటీ అంటే జవాబు గద్యలోనే; మళ్లీ పద్యంలో పలుకటం ఉండదు! కథా కథానికా, జీవిత మనే పూతచుట్టపారల్లో పంచదారవంటివి.

నాడు-నేడు

భారతకథల్లో ప్రజాసామాన్యాన్ని ప్రధానపాత్రలుగాచేసిన ఉదాహరణ లున్నవిగాని, మధ్యయుగంలో, రాజవీక్షణాలకే పట్టంకడత. కాని పై అంతరువుల్లో పరుగెత్తక పునాదికంటా వచ్చి, మీకూ నాకూ గూడా సన్నిహిత బాంధవ్యం కలుపుగలిగింది కళా పూర్ణోదయంమాత్రం! మళ్లీ మధ్యలో వచ్చిన ఆ నడమంతరం మధ్యలోనే అంతరించింది.

ఆనాటి రాజనీతీ, పచ్చలపల్లెరాలల్లోని భత్యాలూ మనకు గాలిలో మేడలు. ధర్మం, జీవితం, రాజ్యం, సంఘం, యథార్థస్థితిలో అనటంలోని పలుకు ఒడుగుల్లో ఉంది పత నంగాని దాని ప్రతిష్ఠగాని.

కానైతే చెప్పే రంగస్థలాన్నిబట్టి, రంగవల్లులుదీర్చే నేర్పుగల సారస్వత సేవకు మనసు మళ్లించే కలం పట్టగలవా రుంటేనే, మనకు గాబట్టకున్న మానె, మన మునిమనుమల జాబితాలోనివారైనా, కలకలలాడే భారత భూమిని కనగల్గేదీ, అనుభవించగల్గేదిన్నీ—నే డీతరంగం ఉవ్వెత్తున ఉప్పొంగుతూన్నది. దీని సేచనంలో మానసిక తెగుళ్లు పోగొట్టుకొనేజాతి బయలు దేరుటే పరిణామం. ఆనాటి శుభ్రజ్యోత్స్నలో 'బూజపుబంతి'కై వేచి ఉండాలి!

మెళకువలు :

కథకి - ఉన్నసత్తా అట్టిది. విషయాన్ని ఎత్తుకోటంలోనూ, చెప్పటంలోనూ ఉంది కథంతాను. చిక్కులు అన్నవి సూక్ష్మాంశమై ఉండే అసలువిషయాన్ని కదల్చుటలో ఏతే ఏ ఉండొచ్చు; గాని అల్లిక అందాన్ని కూర్చిపెడ్తుంది. పైగా ఆకర్షణీయంకూడాను.

వాడేభాషా, తికమకలు లేని సంభాషణా, తగ్గపట్టులోనే చూచాయగా పోనిచ్చే వర్ణనా, తీపైన హాస్యం, అపార్థంరాని, చెవికింపైన పలుకూ, సిఫోటు తిరగేయ నక్కర లేకుండా విడిపోయేమాటలకూర్పూ, అన్వయ ప్రతిబంధకాలులేని వాక్యాల ముగింపూ, వాక్యసముదాయం సరిపెట్టవలసిన స్థలనిర్దేశం, వీ టన్నింటికీ మించి, చూపునూ, మనస్సునూ ఆరికట్టేట్టు, ప్రధానవిషయాన్ని బయల పెట్టే శీర్షికా—యివి కథానికకూ, నాటికకూగూడా, సొగసూ వ్యాప్తీ నిచ్చే సాధనాలల్లో కొన్ని.

మూదిరులు :

కవిత్వ సొంపులూ కళామెరుపుల్నీ చిమ్మేవీ ఒకరకం. పాతా కొత్తా చారిత్రకంగాచెప్పేవి ఇంకో రకం. ఆదర్శాలూ అలంకారాలూ ఆరోపించి భవిషత్తును రూపాలు తీర్చటం మరోరకం.

పోతే యిక —

ఉన్నదాన్నే చిలవలూ పలవలూగా అని, ఆవేశం ఎక్కించి, అంతులువెతికించటం సామాన్యంగా జరిగిపోతూన్న పద్ధతి.

మచ్చలు :

అన్నట్టు నేటి 'ఫిల్ము' కథల్నీ వాటిని చూపే పద్ధతినీ చెబితే సుభువౌతుంది కొంత-

"'ప్రభాత్'వారు విస్మరించిన పూర్వాన్ని వెల్లడిచేస్తే, 'న్యూథియేటర్సు' నిత్యజీవితాన్ని మచ్చలుగా తీసుకుంటారు. ఇక 'బొంబేటాకీస్' వారో! జీవితపు ఒడుదుడుకుల్ని నవరిస్తూ, రాగలకాలం యిల్లా ఉంటే అనే సూచనల్ని రాగాలాపనచేస్తూ, నేటి సంఘానికి నూతన చైతన్యం — మానసిక పరివర్తన—కలిగే హృదయతంత్రుల్ని మీటుతారు."

ధ్వనికే ఎప్పుడైనా ప్రాధాన్యం!

అడ్డంకులు:

ఎటొచ్చీ, భాషాచమత్కృతీ, భావనాశబలతలలో ఎంత అందెవేసినచేయి అనుకున్నా, కథ నడిపించేపట్టులో మాత్రం, అనుభవానికి గురికి బారెడు దూరాన్ని మించిన పరిసర ప్రసక్తులను ఎత్తుకొని తరళించుటలో తేలిపోవచ్చు — ఇక్కడే క్లిష్టపరిస్థితి కథకునికి. కథగాని నాటికగాని వ్రాయగానే పని గాదు. అంతతో ఆగదు వ్రాతకారునిబాధ్యత. ఉద్దేశం ఒకటైతే, పరిణామం, ప్రతిఫలం భిన్నాలయ్యే ఘట్టాలు తారసిల్లుతవి — ఇక్కడే ఉంది ఉతికుష్టం అంతా!

ఉన్నదిఉన్నట్టుగా ఉద్ఘాటించాం, చెడుగుఉన్నదీ అంటే దానికి ప్రతీహారం ఊహించి పని చేసుకోటం లెస్స - మంచి ఒక్కటే నిండి ఉంటే ఆనందమే! — గాని కప్పిపెట్టుకోటం సరైనపనా? అనేవాళ్లూ ఉన్నారు.

కాని ఒకసంగతిమాత్రం విస్మరించరానిది—

వివిధమనోవృత్తులు కదా అని ఎంచుకొని, తనరచన సమూహంపైన ఎల్లా పని చేస్తుందో ఆలోచించక వెల్తురులో పడటం అంతగా వివేకమైన పనిగాదు; పైగా సమాజాన్ని ముందుకు పట్టాలనుకుంటే పదడుగులు జారటానికే సందు అవుతుందికూడా!

అంచేతే సంఖ్యకు కాదు విలువ!

పథ్యం;

పాత ఉసిరిపచ్చళ్లు అయినా, మునలమ్మలనాటి పిట్టకథలు, మనసులూ ఒళ్లూ కుళ్లినల్లిన యీ దేశానికి పథ్యమే. కాకుంటే కాస్త కొంగ్రొత్తభావాల పోపుసరకుల మిళాయింపులో చవు లూరిస్తూంటవి.

ఆర్థికంగా రాజకీయంగా ఆధ్యాత్మికంగా, ఒకటేమిటి అన్నివిధాలా మనం సంధ్యాకాలంలో పరిభ్రమిస్తూన్నాం. ఒంటబట్టిన విషయాల్ని రసవత్తరంగా అక్షరాలల్లో నిలిపితే చేయతగ్గదీ చేసేదీ ఊహ్యాలు.

పరువుకూ ప్రణయానికీ; అధికారానికీ, ఆశకీ; భారతం అంత గ్రంథాల తయ్యారీకావలసినయుగం మనల్ని చూడకుండా లేచిపోయినప్పుడు, సంఘ, జాతి, మతజీవితంలో అడుగడుక్కీ 'నామాటంచెప్పావ్'అని 'బిస్మిల్లా' చేసే సంఘర్షణఘట్టాలూ 'కాలనేమి' వ్యక్తులూ ఎదురొడ్డే వ్యవస్థల్ని కళ్లముందు రూపింపచేసే చిన్నిచిన్ని ఘట్టాలు - కథానికలు - నేడు మనకు ఆహారంకన్నా,

హారాలకన్నా అందుబాటులో ఉండవలసిన పోషకద్రవ్యాలు.

అల్లిక:

'ఇట్టె కథ అల్లేస్తాడు' అనేది హాస్యానికే అన్నదైనా, ఆ అల్లిక జిగిగా ఉంటేనే ఏమైనా నిలవగల్గేది. ఉన్నది ఉట్టికట్టుకు పోయే కొత్తది కూర్చుకోలేకపోతే అవహాస్యాలపాలే!

'తాతా కథ చెప్పవూ?' అంటే పుట్టుకొచ్చినరోజులు రావే అనండి! ఆనాటికథలు లేతమనస్సుల్ని చక్కటితీరుల్లో మలపకపోలేదు.

ఇందుకనే చిన్నికథ సంఘానికీ దేశానికీ పుష్టికూర్చేది అనటం పునరుక్తి.

అనువాదాలు:

'స్వంతంగా అల్లటం చేతకాకపోతే, అనువాదాలకు దిగటం' అనేవారిలో ఒకళ్లం అనటం కష్టం. పాండిత్యానికీ భావనాగరిష్ఠతకూ ఔననిపించుకొన్న అతఃపూర్వకవులకు శ్రీనాథాదులు లొక్కు-కారుగా! ఐతే, అనువాదాల్లో వచ్చే అవధి అల్లా లిక్కికి లక్కిగా వ్రాయటంలో. తన పరిసరాలనూ, ఆచారాలనూ దొర్లిస్తాడు మూలకారుడు. ఇక - అనువాదకర్త చేయవలసిందల్లా, ఆసూత్రాన్ని చేజారనీయకుండా భావాలు క్రించు పరచని శైలిలో, అనలుకు నట్టు లేకుండా సరిపెట్టటం; చక్కటి జాతీయపదాలు వాడటం. అప్పుడే 'మాతృక ఏది?' అనేది విచికిత్సాహేతువు అవుతుంది.

అవుసరమే!:

కొత్త పరిస్థితుల్ని ఎదుర్కొనే సంఘటన లెన్నో ఏర్పడే యీ కాలంలో — దూరభారాలు కుదింపబడి, పప్పూ బియ్యంలా భావాలు కలసిపోయే ప్రజ విస్తార మవుతూన్నకొద్దీ - సాహిత్యంలో, వీరివి వారికీ, వారివి వీరికీ కొత్తచవుల్ని కలిగించి భావైక్యత కుదిరి, యిప్పట్ల 'త్వమేవాహం' అని భుజాలు రాసుకుని నిలబడటానికి వీల్లున్నవి.

అతిలోకప్రతిభావంతుల కలాన్నించి వెల్వడ్డ రచనలు ఏభాషలో ఉన్నా అనువాదయోగ్యాలే!

అనుకరణాలు:

మరపునకు రాని విషయప్రసక్తి గల పదాలకూర్పులు, ఒకప్పుడు అనుకోకుండా దొర్లటంకూడా కద్దు. అంతమాత్రంచేత చోరీ అనటంకంటె, ఆ మూలకారునిపదాల పటుత్వం అనుకుంటాం. 'బాణోచ్ఛిష్ట మిదం జగత్' అని ప్రతీకి అనుకరణంకింద నే ఆరోపిస్తే ఒక్కటే నూతనం అవకపోతుంది. సృష్టివైచిత్రం ఎల్లాగో కాలాన్ని మించిన వేగంలోని భావం విచిత్రాతిచిత్రం. గమనిక మనసును బట్టి.

కాదయ్యా యిది పాతపంథులు విడగొట్టిన కొత్తపలుకూ వ్రాతాఅంటే 'భారతకారుడు ప్రయోగించనివాటికి ప్రాధాన్యత లేదు. ఎబ్బే ఏమిటిది?' అనేస్తారు.

అసలు బంగారాన్ని, తమ ఊహాప్రతిభలకొద్దీ అలంకారాలుగా అనువదించటం మామూలుగా ప్రతి ఒక్కరూచేసే అనుకరణమే!

కాలం వేరు కావచ్చు:

'నేను చదివినవాట్లలో ఎక్కడా యిల్లాంటి పదగుంభనతో యీభావం పలికినవాళ్లు లేరు అనుకొని వ్రాస్తే, కొంతకాలా

నికి ఒకానొక పుస్తకంలో సరిగ్గా యిదే ఉంది' అని ఒప్పుకున్న మహాకవులూ ఉన్నారు. అంచేత భావకీ భావాలకీ యింత సన్నిత మగు సంయోగం—మనుజులూ, కాలం వేరు కావచ్చు కొంతవరకు.

నీలాలూ వజ్రాలూ పుట్టుకమాత్రం ఎక్కడో అయిఉంటుంది. నేర్పయినపనివాడు తనకూర్పులో చక్కగా అమర్చుకుంటాడు. విడిగా ఉన్నప్పటికంటె ఏ అంగుళీయకం లోనో, రవ్వలజోడు (తమ్మంట్లజత)గానో ఎంతగా రాణిస్తవి అవి!

బోల్తా కొట్టడం:

కానైతే ఒకటుంది. నీలాలూ రవ్వలూ నాస్పష్టే అనటమో లేకపోతే ఒకపనివాని వస్తువు తెచ్చి, చక్కటి ఉల్లిపొరకాగితంలో మడచి, తనకృషిగానే చెలామణీ జరిపించు కోటమో చేస్తే వస్తుంది చిక్కు. దాతను తలచుకోటంలో, వ్రాసినదానికి మనకున్న బాధ్యత తప్పటం అనటం సాహసమైతే కావచ్చుగాని కనుమరగైన ఆమూలకారుడు, రాగలకాలంపైనీ ప్రజలపైనీ, ఉంచుకొన్న విశ్వాసాన్ని నిందించినవారవటం పనికిరాని ది—ఎవరికివారు వంచించుకోటమే అవుతుంది.

స్వంతం:

అనుసరణాలు అవసరం లేకా కాదు, అధికమై పోతున్నాయి అనీ కాదు; కాని, నిరంతరానుభవం, వస్తుపరిశీలనా, తోడుగా, సూక్ష్మాంశమైన ఒకానొక ప్రసక్తితో క్రొత్త తెన్నులు తెరచి మనది అనిపించుకొనుటలో మమత్వం చాలా ఉంది.

పెరటిలోని వంగ ప్రీతిపాత్రం తెనుగు సొమ్ములు ఆంధ్ర ఆడపడుచుకు అలంకారాలు. పుట్టింటివారుపెట్టేది పసుపూ, కుంకుమే! ఎరువు తెచ్చికోలు ఎదకి అదటుపాటు అనటం సత్యదూరం అనిపించుకుంటుందా?

సభ్యత:

కాలం అనుకూలం కూడాను—ఏ రాజు కనుగొలకుల కెంపులు తరళింపచేయుటతోనో సరిపెట్టుకొన్న కవికలం, యీనాడు - తన జీవితాన్ని; నిరుపేదనీరసాన్ని; ఊరుపెద్ద ఉద్ధృతాన్ని; అగచాట్లలోనూ అలగాజనం, నిగ్రహించుకొని మల్లెతావులు సుమాళించుకునే ప్రేమవీథులు తెరుస్తారనీ; — యింకా ఎన్నో మనకళ్లఎదుట నడచే విషయాలను, మన కెందుకివి అని ఊరుకోకుండా తియ్యందనాల వియ్యంకల్పించే సావుకాశాన్ని వృథా పోనిచ్చు ఆసామీ ఎవరు? భావనాచాతురి అలవర్చుకొన్న కథకుని కలాన్ని అడ్డిపట్టగల పగ్గా లున్నవా?

తలపులు:

మీరుమాత్రం? కాస్త అనుకుంటిరా చాలు. ఓ ఎన్ని రచనలు! అవే కావలసింది - కాలాన్ని నెట్టుకొని ముందుకు కదలే సంఘాన్ని, తయ్యారీచేసే రచన కథానిక-చిన్నికథ-సొమ్ము—వంతు!

చింపిపాతలరోత
చిక్కిపోయినమేను
* * *
ఆంధ్రశూకలహాన
మరుణనేత్రాంచలాల్
ఓకవీ
పాడవోయ్
ఉజ్జ్వలగీతాలు
ఉడుకురక్తపుపోటు
ఊగవోయ్ శిల్పాన
ఉప్పొంగవోయ్ కవీ!

# బీ ద పూ జ

శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి

“ వాడినగ్రుడ్డిపూలు గొనివచ్చెను పూజకు నీ” డటంచు నో
నాడకు స్వామి! నన్ను విడనాడకు, సంగతి విప్పిచెప్ప నో
రాడదు; నేనుగూడ కుసుమాపచయమ్ముకు బోతిగాని నా
కాడ లభింపదయ్యె సదయా! ఒకమొగ్గయు నొక్కపుష్పమున్.

వారలు పెద్దపెద్ద ధనవంతులబిడ్డలు ; మంచిమంచి బం
గారపు పళ్లెరమ్ములను గైకొని పోయిరి ముందుగానె—మా
బూరుగుచెట్టుక్రింద పడిపోయినగోడల పూరిపాకలో .
దూరిన లేతవెల్తురులతో కను విచ్చితి అమ్మ లేపినన్.

లేచి చిరుచాప నొకమూల దాచిపెట్టి,
పుంతలోపలి జలమింత పుక్కిలించి,
తల్లికాళ్లకు వంగి వందనమొనర్చి,
ప్రాత తాటాకుబుట్టను చేత బూని.

తెలతెలవారుచుండ జనితిన్ విరిదోటకు, తోటమాలి త
ల్పులు బిగియించె నాచిరిగిపోయినగుడ్డలు నన్ను జూచి—కా
ళుల బడి గడ్డమంటి యెటులో బ్రతిమాలి యనుజ్ఞనంది లో
పల బడినాడ—చెంత గనుపట్టిరి వారలు పూలు గోయుచున్.

చకచక పూలు గోసుకొని సాగిరి మిత్రులు ; శూన్యకుంజమా
లిక లెటు జూచినన్, మిగులలే దొకమొగ్గయుగూడ నాకు—అం
దొకపెడ విన్నబోయి నిలుచుంటిని, నన్ గని వార లందరున్
పకపక నవ్వినారు; తల వంచితి నే నొక కొమ్మచాటునన్.

పట్టి పూమొక్కలన్ని నా వంక జూచి
ప్రసవబంధాలు సడల బాష్పములు రాల్చె;
తిరిగివచ్చితి గంపంత దిగులుతోడ
చేతిలో నున్న బుట్టను చింపివైచి.

ఇంటికి వచ్చుచుండ గనుపించిరి దేవర దేవళంబులో
మంటపమందు పుష్పములు మాలలు గుచ్చెడి మిత్రులెల్ల ; కూ
ర్చుంటిని నేనుగూడ నొకచో నొక స్తంభము వెన్క; నింతలో
గంటలు మ్రోగె, పూజకయి గర్భగృహంబును జొచ్చిరందరున్.

పూజ లయి మిత్రు లిండ్లకు బోయినారు—
రిక్తహస్తాల నిన్నుదర్శింప లేక
మండపము క్రింద ధూళితో నిండియున్న
కుంటి గుడ్డిపువ్వుల నేరుకొంటి నేను.

నిండు కోసిలి కన్నీట నిండిపోయె!!
విరుల కంటిన దుమ్మెల్ల కరిగిపోయె!!
ఆగియున్నాను నాథ! నీ యాజ్ఞ కొరకు
ఆదరింతువో లేదో నా బీదపూజ!!!

---

# కందుకక్రీడ

శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులు

గుండియల ముద్దుబిడ్డలు గునియుచుండ
జుట్టు ముడి వీడి పిఱుఁదులం దట్టుచుండ
పైఁడిహారాలు కవలతో నాడుచుండ
దూఁకుచుండెడి కుండలద్యుతులు గండ
విహితచుంబనములు తాండవించుచుండ
చందురునిమీఁద ముత్యాలు చల్లినట్లు
మొగముపై స్వేదబిందువుల్ ముసరుచుండ
అదరుపాటును పొందు చా మొదటిజంట

వెడలు నిట్టూర్పులకు లయ వేయుచుండ
జాఱె పిఱుఁదుల లంఘించు చీరచెఱఁగు
నెడమచేతను బూని పై కెత్తిపట్టి
పట్టుదల వీడఁగా లేక పంతగించి
తఱచు కుడిచేత లెన్నగాఁ జఱచు చిట్లు
రథినముగ నిన్నుఁగొలుచు నీ సుభగ; సుభగ
జన్మ మన నీదె! నీ యదృష్టమునఁ జేసి
క్రిందఁ బడుచును మీఁదఁ దాడు కందుకసఖ !

---

# మన తొంటి నాగరకత

శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రి

నామ రూపములు రెండే ప్రపంచము. మనస్సులో జనించే కల్పనలన్నీ నామములోను, రూపములోను ప్రతిఫలించును. నామ ప్రతిబింబములు చిరస్థాయులు. రూప ప్రతిబింబములు క్షణభంగురములు. నేడు ప్రపంచ మంతా రూపప్రతిబింబిత మగు బాహ్యనాగరకతకై మురిసిపోవుచున్నది. తమ కాలమును, శక్తిని, సర్వధనమును దానికై ధారవోయుచున్నది. నేడు తళతళ మెఱసినది, మరునాడు వెలవెలబారుచున్నది. నేటి ముద్దులమూట, మరునాటి మొద్దుల కాట. నేటిసొంపు, మరునాటికంపు. ఈ బాహ్య నాగరకత యూరప్ ఖండమునంతా ఆల్ప్స్ శిఖరముపై నొక్కపెట్టున నెక్కించి నేడు తల క్రిందుగా దిరగద్రోయుచున్నది. అంతటా అగ్నిజ్వాలలే. హాహాకారములే. సర్వధ్వంసము సర్వనాశము. అమానుష దారుణ కృత్యములు. ఒకటి నొకటి మించుచున్నది. తోకలుగలవారిలో నెవరి కెవరు తక్కువ. ఈ నాగరకత తన కరుణాకటాక్ష వీక్షణములను నేడు మన యేష్యాఖండముపై నిగుడించుచున్నది. ఈ జగన్మోహినివలలో జిక్కి మన వారపుడే మయి మఱచుచున్నారు. చెయి కాలినపిదప నాకులను బట్టిన ఫల మేమి? "నూవు గింజంత విషము నూరుకాకులను జంపును" అన్నట్లు నేడు అణుమాత్రముగా భాసించిన నాగరకతయే దేశము నధోగతి చేపాలుయును. కాన నుపేక్ష తగదు. ఇప్పట్టున మన ప్రాచీననాగరకతా స్వరూపమును ఇంచుకంత వెల్లడింతును.

వాల్మీకి శ్రీమద్రామాయణము ప్రాచీన నాగరకతాలతకు తొలికుసుమము. వాల్మీకి స్నానమునకై తమసానది కేగియుండ నొకబోయ క్రీడించు క్రౌంచమిథునములో పురుషపక్షిని నొక యమ్మున గూలనేసె. దానిని జూచి కరుణార్ద్రుడైన ముని బోయను శపింప నాశాపాక్షరములు ఘుణాక్షర న్యాయమున శ్లోకరూపమును దాల్చె. అందు రామాయణార్థముగూడ స్ఫురించె - పిదప బ్రహ్మానుమతిని, నారదోపదేశమునను వాల్మీకి రామాయణకావ్యమును రచించె. శాపమే రామాయణమునకాది. మధ్యను అరణ్యవాస, సీతా వియోగములు; చివరను సీతాభూప్రవేశము. ఈ విధమున నీయాదిమ కావ్యము కరుణాది, కరుణామధ్యము, కరుణాంతమునై యొప్పుచున్నది. మన ప్రాచ్య వాఙ్మయములో దుఃఖాంతములు లేవనుట పొసగదు.

రస మనగా కేవలానందానుభవము. ఇందు బాహ్యేంద్రియవ్యాపార ముండదు. మోహ మూర్ఛాదులలో నింద్రియవ్యాపారము లేకున్నను, కేవల దుఃఖానుభవము మాత్రమే యుండును. ఈ రసమును తొమ్మిది విధములుగా బేర్కొనియందు శృంగారమును బట్టభద్రునిగా మన యాలంకారికులు చేసిరి. సూక్ష్మదృష్టితో బరికించిన గరుణ యొక్క

టిదే రస మనదగినది. ఇందు హృదయము పూర్తిగా ద్రవించి యానందమయ మగును. కావుననే భవభూతి "ఏకో రసః కరుణ ఏవ" యని వాక్రుచ్చెను. ఇట్లు కరుణరసప్రధాన మగు నాదికావ్యమున మన నాగరకత పొంగి పొరలినది. నాగరకతాలతకు దాంపత్య ప్రేమమే దోహదము. సీతారాముల దాంపత్యప్రేమవాహినులు రామాయణ మంతటను జలజల పారినవి. పితృభక్తిచే రాముడు తనకు చిక్కిన రాజ్యమును విడిచి వానప్రస్థుడయ్యె. పుత్రవాత్సల్యముచే దశరథుడు దివికేగె. ఈభక్తి వాత్సల్యములు మన నాగరకతాలతకు నాటుకొమ్మలు.

రామ లక్ష్మణ భరతాదుల సౌభ్రాత్ర సంపద, రామచంద్రుడు, సుగ్రీవ విభీషణాదులతో నెరపిన మైత్రి, శబరి మున్నగు వారిపై జూపినకరుణ లోనగు సుగుణసంపదలు నాగరకతాలతకు బెట్టిన యావరణలు. ఇట్లు రామాయణమున నాగరకత చక్కగా బుష్పించి ఫలించె. అయినా అది శ్రవ్యకావ్య మగుటను బండితమాత్రవేద్య మని తలంచి కవిపుంగవులు దృశ్య ప్రబంధములగు నాటకములను రచింప మొదలిడిరి. అందు కాళిదాసుశాకుంతలము సర్వసారస్వతలలామమై వెలసినది. ఇందు అహింస, నిరాడంబరజీవనము, సర్వసమత్వము, పవిత్రప్రేమ మున్నగు ప్రాచ్యనాగరకతావిలాసము లతి మనోహరముగా వర్ణింపబడినవి. బాహ్యనాగరకత, క్షణభంగురములగు వేషభాషాదులపై నాధారపడును. దీనికి నర్థకామములు రెండేపురుషార్థములు. ఇందు తృష్ణ, దంభము మున్నగునవి పెచ్చుపెరిగి దేశము నశాంతిలో ముంచివేయును. అంతర నాగరకతకు ధర్మ మోక్షములు రెండును పరమపురుషార్థములు. ఇది పరమశాంతము, శాశ్వతము నగు నుభయలోక కల్యాణమునకు మార్గమును జూపును. ఇప్పట్టున శాకుంతలకథాసంవిధానమును బరికింపుడు. దుష్యంతుడు వేటమార్గమున కణ్వాశ్రమమును జేరుట, శకుంతలా దర్శనము, గాంధర్వము, పురిచేరి దూర్వాసునిశాపమున నామెను మఱచుట, కణ్వుడు గర్భిణియగు శకుంతలను హస్తినాపురి కంపుట, రాజు తిరస్కారము, తల్లియగు మేనక యెత్తికొనిపోయి హేమకూటమున నుంచుట, అంగుళీయక దర్శనము, రాజుకు శాపమోక్షము, విప్రలంభము, ఇంద్ర సహాయమునకై దుష్యంతుడు స్వర్గమున కేగి మరలివచ్చుచు హేమకూటమున భార్యా పుత్రులను గలియుట, పురప్రవేశము—ఇది నాటక కథాసంగ్రహము.

### అహింస

వేట మహావ్యసనము. అయినను దుష్యంతుడు మునిశిష్యులమాటను విని సంధించిన బాణము నుపసంహరించును. "ఆర్త త్రాణాయ వః శస్త్రం న ప్రహర్తు మనాగసి" —ఆర్తులను గాపాడుటకు రాజులకు శస్త్రము గాని నిరపరాధులను హింసించుటకు గాదని యెంతయో సుకుమారముగా నహింసారహస్యము నుపదేశించెను. ఇట్టివి పెక్కులు గలవు.

### నిరాడంబరజీవనము

వల్కలధారిణి యగు శకుంతల సహజ సౌందర్యమే దుష్యంతుని నాకర్షించినట్లు వర్ణించె- "కిమివ హి మధురాణాం మండనం నాకృతీనాం"— [illegible]

మండనమేయని చెప్పి నిరాడంబరతను చక్కగా ప్రశంసించె. పలుతావులయందు నాశ్రమములను, మునుల వేషభాషలను వర్ణించె. దుష్యన్తుని రాజధానినిగాని, వాని వైభవమునుగాని, మహారాజ్ఞీవేషముతో నున్న శకున్తలనుగాని యొక్కయక్కరముతో నయినను గవి వర్ణించి యెఱుంగడు. మీదుమిక్కిలి శార్ఙ్గరవాదులచే జనాకీర్ణమగు రాజమందిరము నిప్పంటుకొనిన గృహమువలె నున్నదని చెప్పించి యాడంబరసహితమగు నగర జీవనమును సుదూరముగా నిరసించె.

### సర్వసమబుద్ధి

కణ్వుడు బ్రహ్మర్షి. నాటికి రాజర్షియగు విశ్వామిత్రునకు మేనకయందు జనించి క్షత్త్రియకన్యకయగు శకున్తలను బెంచి పెద్ద జేసి యత్తవారింటి కసపెను. ఔరసపుత్త్రిక కంటె నెక్కుడుగా బ్రేమించెను.

బ్రాహ్మణ ప్రవరులగు శార్ఙ్గరవాదులును, వృద్ధయగు గౌతమి మున్నగువారును శకున్తలా విషయమున జాతిభేదమును స్మరించి నట్లు గానరాదు. దుష్యన్తుడు బ్రాహ్మణుడగు విదూషకుని దనతల్లులచెంత కేగి తనకు బ్రతినిధిగా బుత్రకృత్యమును నిర్వర్తింపుమని హస్తినానగరి కంపెను. దీనిచే బ్రాహ్మణ క్షత్రియులలో నెంతటి సమబుద్ధి పెచ్చు పెఱిగి యుండెనో యూహింపనగును.

### పవిత్రప్రేమ

శకున్తల కణ్వునిప్రీతివెన్నెలలు సర్వదా తనపై బర్వుచుండ, గౌతమివాత్సల్యధారలు తన్ను జలకమాడించుచుండ, చెలికత్తెల స్నేహవల్లరులు తన్నలమికొనియుండ నాశ్రమ వాసులప్రేమకు నేకాస్పదమై మృగములను సోదరులుగాను, లతల నాత్మగాను జూచుకొనుచు ప్రేమమయజీవితయై యొప్పుచుండె.

అట్టి తరుణమున దుష్యన్తుడు చెట్టు చాటున బొంచి యుండి చూచి మోహాపరవశుడయ్యె. శకున్తలయు రాజును బ్రేమించె. వారిరువురి దృష్టులు బాహ్యశరీరసౌందర్యము నందే విశ్రమించినవి. అంతరగుణపరీక్షకై యెవ్వరును యత్నింపలేదు. కామమోహితులయ్యును ధర్మవిషయమున ప్రమత్తులు కాలేదు. చూ. "సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః"— సత్పురుషులకు సందిగ్ధవిషయములందు వారి మనోవృత్తియే వారికి ప్రమాణము. నా మనస్సు ఈమెను కామించినది కావున నీమె క్షత్త్రియకన్యకయే కావలయును. బ్రాహ్మణకన్యకయే యైనచో నామనస్సు ప్రవర్తించి యుండదు. అని విశ్వసించిన్నీ ప్రియంవదానసూయలమూలమున సత్యమును దెలిసికొని ప్రవర్తించెను.

శకున్తలయు; "మదనసంతప్తాపి నఖల్వాత్మనః ప్రభవామి" — నేను మదనతప్తనయ్యును దండ్రికి బరవశను. ఆయన యనుమతిలేక నీ పాణిగ్రహణమున కొల్లనని తన ధర్మబుద్ధిని వెల్లడించెను. దూర్వాసుని శాపముచే రాజు శకున్తలను మఱచెను. ఆమె చెప్పిన యానవాళ్లను విని, సత్యముగా ధర్మపత్నిని మఱచిన మహాపాపి నయ్యెదనా? లేక, పరస్త్రీ స్పర్శచే దూషితుడ నయ్యెదనా? అని చింతించె. ఇందు ధర్మ మెంత సూక్ష్మముగా ప్రతిఫలించినది? ఇట్లు శకున్తలా దుష్యన్తుల కామము ధర్మానుబంధియయ్యె

భౌతికమగుటచే శిథిలమయ్యె. దుష్యన్తుడు స్వర్గమునుండి తిరిగి వచ్చుచు హేమకూటమున నదితికశ్యపుల సన్నిధిని శకున్తలను, బుత్త్రుని గలిసికొనియెను. అది దివ్యప్రేమ. అందు హావభావ విలాసాదులు లేవయ్యె. అది యాంతరము. బాహ్యశరీర సౌందర్యాదుల నపేక్షింప లేదు. ఇట్లు మహాకవి మానవ జాతిని బాహ్యప్రేమనుండి దివ్యప్రేమపథమునకు దీసికొనిపోయె. సత్యమైన యాంతర నాగరికతను బ్రత్యక్షముగా జూపి కాళిదాసు ధన్యతము డయ్యె.

భవభూతియు దన యుత్తర రామచరితమున దివ్యప్రేమ నిట్లు వేనోళ్ల బొగడెను:

అద్వైతం సుఖదుఃఖయో రనుగతం
సర్వాస్వవస్థాసు య
ద్విశ్రామో హృదయస్య యత్ర జరసా
యస్మిన్నహార్యో రసః,
కాలేనావరణాత్యయా త్పరిణతే
యత్ప్రేమసారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య బహుధా
ప్యేకం హి తత్ప్రార్థ్యతే.

అన్నియవస్థలయందును సుఖదుఃఖములలో నేకత గలదియు, అలసట నొందిన హృదయములకు విశ్రాంతి నొసంగునదియును, ముదిమిచేగూడ క్షీణింపని ప్రీతిరసము గలదియును, కాలక్రమముచే లజ్జాదులు క్షీణింప కేవల ప్రేమసారమునందే వెలుంగునదియు నగు మంచి దాంపత్యమే యందఱకును బ్రార్థింపదగినది—అని వర్ణించి రూపయౌవనమాత్ర విశ్రాంతమగు బాహ్యప్రేమను నిరసించెను. ప్రాచీనకవు లందఱును ఇట్లే భౌతికప్రేమను యథాయథముగ నిరసించిరి.

ఇప్పట్టున పాశ్చాత్యకవులకును, ప్రాచ్యకవులకును దృష్టిభేదము మెండుగా గలదు.

ప్రాచ్యకవులు జన్మాంతరములు, కర్మవాసన, పరలోకము, అందు భోగాదులు మున్నగువాని నంగీకరింతురు. ధర్మమోక్షములే పరమపురుషార్థములనియును, ధర్మానుబంధులగు నర్థకామములు గ్రాహ్యము లనియును వారి తలంపు. తదనుసారముగా తమ గ్రంథములయందు కథానాయకుల యథార్థస్థితిని వర్ణించుటకంటె బురుషులు పొందవలసిన యుత్తమస్థితిని సుకుమారముగా జూపుదురు. కావున మనకవులు యథార్థస్థితిని వర్ణింపరను నిందకు గురికారు. పాశ్చాత్యకవులకు బునర్జన్మాదులు లేవు. అర్థకామములే ప్రధానములు. యథార్థస్థితిని వర్ణించుటయే వారి లక్ష్యము. దృష్టిభేద ముండుటచే పరస్పరనిందకు పరస్పరమును పాత్రగా జేయరాదు.

శాకుంతలములోని మన ప్రాచ్యనాగరకత నేడు గాంధీమహాత్మునిలో మూర్తీభవించినది. చూడుడు. రాజులు ఆర్తరక్షణకే శస్త్రమును ధరింపవలయును. అని కాళిదాసు నొక్కిచెప్పెను—ఇదియే అహింసా సిద్ధాంతమునకు మూలసూత్రము. కాళిదాసుని వల్కల వర్ణనలకును, ఖద్దరుకును భేద మంతగా లేదు. ఆశ్రమవర్ణనమే గ్రామ పునరుద్ధరణ నిరాడంబరజీవనములకు మార్గదర్శి. మహాకవి చూపిన బ్రాహ్మణక్షత్త్రియ సంమేళనమే గాంధిగారి సర్వజాతి సోదర భావమునకు బీజభూతము.

ఇట్లు మన దివ్యనాగరకత భౌతిక

మును తీసికొనిపోవుచున్నది. మన నాగరకతకును, పరమార్థమునకును సన్నిహిత బంధుత్వము. ఇది యుభయలోక కల్యాణదాయి. ఇందు దురాశాంతఃకలహాదులకు ప్రసక్తి లేదు. అతిశాంతము, శాశ్వతము, సహృదయము, సరసము. మాక్సుముల్లర్, విలియమ్ జోన్స్ మున్నగు పాశ్చాత్య పండితప్రకాండులు మన వాఙ్మయమును జక్కగా మథించి మన నాగరకతను వేనోళ్ల బాగడిరి. అట్టి దానిని విడనాడి బాహ్యనాగరకతా వ్యామోహమునకు జిక్కి భారతకీర్తిని బటాపంచలు చేసి యధోగతికి బోవుట యవిచారవిలసితము. ఇక్కాలమున ప్రాజ్ఞులు దూరదృష్టితో బరికించి సర్వప్రయత్నముతోను బాలికాబాలుర బుద్ధులను మన ప్రాచ్యమార్గమునకు మరలింపవలసినదని విన్నవింతును. మొక్కయై వంగనిదో మ్రానై వంగదు.

---

# ‘తమస్సు’

శ్రీ పన్యాల వేంకట రంగనాథరావు.

ఇమిడిపోయిన చింతలో ఈ జగత్తు
గాఢమైన తమస్సు వచ్చెన నేడు
తెలియుపారత్నముల గీతికలు నభమ్ము
పై కెగసి వాయువులలోన వ్యాప్తిచెందె.

లెక్కలేనన్ని అస్థిక లొక్కమారు
పెనుతుపానున పడి, ఊరు పేరు లేక,
ఆవరించిన వీలోక మంతటను, త
మస్సు చిరునవ్వుతో తనమహిమ చాట.

ఎవరికర్మఫలమ్ము లీ ఎముకలందు
మెలగి ఈనాటి నిశలోన అలముకొనెనో!
ఎవరు నోచిననోము లీ శవములందు
కళలు తేరినవో, నిశాకాంతకొరకు !

పైన వీచెడి పెనుగాలిలోన కలసి
ప్రణయకంఠములు మొరపెట్టుచున్న
వో, తమస్సున పడిపోయె, ఒక్కమారు
పాప! మాకేకలను వినువారు కలర?

దాహమయ్యెను, జగతిరక్తమ్ముకొరకు,
మైమరపుహెచ్చె, జగతిమాంసమ్ముచూడ,
కండ్లతో తృప్తికై చూచుకాల మేగ,
అలముకొన్నది నలుదిక్కులను తమస్సు!

# ధ్రువోపాఖ్యానము

శ్రీ కొంపెల్ల లక్ష్మీనారాయణ

ఉత్తానపాదునకు సునీతియను, అప్రియమైన పెద్దభార్యగర్భమున జనించినవాఁడు ధ్రువుఁడు. రెండవభార్య సురుచికన్నకొడుకు నుత్తముని దనతొడపై నిడికొని, ఉత్తానపాదుఁ డుపలాలనము చేయుచుండఁగా ధ్రువుఁడు చేరి, రెండవతొడపై కూరుచున్నాఁడు. సురుచివచ్చి దిగ నీడ్చివైచింది. తండ్రి మాటాడ లేకపోయాఁడు. ధ్రువుఁడు సిగ్గుపడి, రోషకలితుఁడై తల్లి ఉపదేశంమీద ఘోరతప మాచరించాఁడు. అతని తపఃఫలితంగా ఈశ్వరసాక్షాత్కార మైంది. బాలుఁడైన ధ్రువుఁడు కోరినది ఒకపదము—తండ్రి తొడ నధిరోహించేభాగ్యము. ఈశ్వరుఁ డనుగ్రహించిన దిది:

"అది యెట్టిదనిన నెందేని మేధియందుఁ బరిభ్రామ్యమాణగోచక్రంబునుంబోలె గ్రహ నక్షత్ర తారాగణ జ్యోతిశ్చక్రంబు నక్షత్ర రూపంబు లయిన ధర్మాగ్ని కశ్యపశక్రులును, సప్తర్షులును దారకానమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుండుదు రట్టి దురాపంబును ననన్యాధిష్ఠితంబును లోకత్రయ ప్రళయకాలంబు నందు నశ్వరంబు గాక ప్రకాశమానంబును నయిన ధ్రువక్షితి యను పదంబు ముందట నిరువదియాఱువేలేండ్లు ననం బ్రాపింతువు."

(భాగవతము, స్కం. ౪, వ ౨౬౦.)

ధ్రువుఁడు తండ్రితొడపైకూర్చున్నాఁడు కాని, అది క్షణికమైపోయింది. వెంటనే పదభ్రష్టుఁ డైనాఁడు. ఈశ్వరుఁడు కూడా అతనికి తక్షణమే ఆపదము ప్రసాదించలేకపోయినాఁడు. ౨౬,౦౦౦ సంవత్సరములు కడచినతరువాత ప్రాపించు నన్నాఁడు. ఇది చూడఁగా, ఇందులో యేమో అంతరార్థం వున్నట్లు ఎల్లవారికి గోచరిస్తుంది.

'నక్షత్రరూపంబులైన ధర్మాగ్ని కశ్యపశక్రులును సప్తర్షులును దారకానమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుండుదు రట్టి ధ్రువక్షితి యనుపదంబు' అని భగవంతుఁడు పలికిన వరమునుబట్టి ఈ ధ్రువోపాఖ్యానము ఉత్తరదిశను నిశ్చలంగా కనుపించే ధ్రువనక్షత్రమును గురించినదే అని తేటతెల్లమౌతోంది. అయితే ఈ నక్షత్రానికి పదభ్రష్టత్వము, తిరిగి ౨౬,౦౦౦ యేండ్లకు ప్రాపించడం యేమిటి? అనే సందేహాలు స్థూలదృష్టిలో కలుగుతాయి. సూక్ష్మకార్యముల అర్థము శాస్త్రరీత్యా గ్రహించే చక్షుష్మంతునికి ఈ సందేహములు పొడమవు. ఈశ్వరవరంలో నున్న ధ్రువక్షితి ధ్రువనక్షత్రానికి క్షణికమైనదేననీ, తిరిగీ ౨౬,౦౦౦ సంవత్సరములకుగానీ ఆ పదము ఆ నక్షత్రానికి లభింపదనీ, అప్పుడైనా దాని కది క్షణికమైనదేననీ గణితసిద్ధాన్తము చెపుతుంది.

ధ్రువనక్షత్రము ఉత్తరమున నిశ్చలంగా వుండుటకు కారణం ప్రప్రథమంలో పరిశీలింపవలసివుంది. సూర్య గ్రహ తారాగణ

నస్తమించునట్లు కనుపించుట భూ పరిభ్రమణంవల్లనే! భూమి పశ్చిమమునుండి తూర్పునకు, తన ఉత్తర దక్షిణధ్రువముల గుండా పోయే ఇరుసుమీాద (Axis of rotation) పరిభ్రమిస్తూ అహర్నిశములు కలిగిస్తోంది. ఈ ఇరుసు ఉత్తరాగ్రం తిన్నగా ధ్రువనక్షత్రం ఉండడంవల్ల దానికి నిశ్చలత ప్రాపించింది. ఈ ఇరుసు నిశ్చలంగా వున్నట్లయితే, ధ్రువనక్షత్రం నిశ్చలంగా వుంటుంది; దానికి పదభ్రష్టత వుండదు. కాని, భూమి ఇరుసునకు రెండువిధములైన గమనములు వున్నాయి. సంవత్సరమున కొకమారు సూర్యుని చుట్టూ తిరుగుతోంది. ఇందువల్ల ప్రతినక్షత్రము చిన్నవృత్తముపై సంవత్సరమున కొకమారు తిరుగునట్లు కనుపిస్తుంది. (Aberration) ఇది మనప్రస్తుత విషయంలో గమనించవలసిన అవసరము లేదు. రెండవది (Precession) ప్రసిషను అనే గమనము. దీనినే చదువరులు శ్రద్ధతో పరిశీలించాలి.

బొంగరము తగినంత వేగంతో తిరుగుచున్న నిలబడి తిరుగుతుంది. కాని, వేగము తగ్గినకొలది వణకుట ప్రారంభిస్తుంది. ముల్లు నేలపై నాని, నిట్టనిలువుగా తిరుగునప్పుడు, దానిబరువు దానిని క్రిందపడవేయ ప్రయత్నిస్తుంది. అందువల్లనే అది వణికి, వణికి తుదకు పడిపోతుంది. ఈ వణకుటనే ప్రసిషను (Precession) అంటారు. బొంగరము తిరిగే వైపునకే వణుకుతుంది. (Precesses in the direction of its motion).

'సరదాగా భుజశక్తిఁ జూప నెపుడో త్మ్నానామకంబైన బొంగరమున్ ద్రిప్పి'నాఁడు సృష్టికర్త. బొంగరమువలెనే భూమికూడా వణుకుతోంది. అందువల్ల ఇరుసు శంకువు చుడుతోంది. (The axis is generating a cone) కాని, భూమికి ప్రిసిషను నిజభారం వల్లకాదు. భూమి గుండ్రని బంతివలెగాక, ధ్రువములవద్ద తక్కువ వ్యాసార్థము, భూమధ్యరేఖవద్ద ఎక్కువ వ్యాసార్థము కలిగివుంది. (Oblate speroid) అందువల్ల సూర్యచంద్రులు భూపరిభ్రమణాన్ని వణికింపఁ జేస్తున్నారు. (The sun and moon are exerting a disturbing couple on the earth), భూమి తనభారం వల్లకాక, సూర్యచంద్రులవల్ల వణకుటచే, తాను పరిభ్రమించు వైపునకుకాక, వెనుకకు ప్రిసెస్ అవుతోంది. (Retrograde precession) అనగా పశ్చిమమునుండి తిరుగుతూ, తూర్పునుండి పశ్చిమమునకు ప్రిసెస్ అవుతోంది.

ఈ భూప్రిసిషనువల్ల ఉత్తరధ్రువం ఎల్లప్పుడు ధ్రువనక్షత్రంవైపు తిరిగివుండదు. నక్షత్రగోళంమీాద వృత్తంచుడుతూ తిరుగుతుంది. ఈవృత్తం ప్రక్కపటంలో చూపఁబడివుంది. ప్రస్తుతం ఉత్తరధ్రువం ఆ వృత్తం మీాదవున్న ధ్రువనక్షత్రంవైపు తిరిగివుండుటవల్ల అది నిశ్చలంగావున్నట్లు కనుపిస్తోంది. కాని, ఈపదవి ధ్రువనక్షత్రానికి చాలా దినములక్రితమే ప్రాప్తించింది. దూరదర్శన యంత్రంలో పరిశీలించిన ధ్రువనక్షత్రం కూడా తిరుగుతూన్నట్లు తేటతెల్లమాతుంది.

ప్రిసిషను సంవత్సరమునకు ౫౦.౨ శకనులు వుంటుంది. ఒక వృత్తంలో 3౬౦ డిగ్రీలు వుంటాయి. ఒక డిగ్రీకి ౬౦ మినిటులు, మినిటునకు ౬౦ శకనులు కాబట్టి ఉత్తర ధ్రువం తిరిగి ధ్రువనక్షత్రంవద్దకు వచ్చేవరికి పట్టుకాలము: $\frac{౩౬౦ \times ౬౦ \times ౬౦}{౫౦.౨}$ సం॥ = ౨౫,౮౦౦ సం॥ = ౨౬,౦౦౦ సం॥ (దాదాపు.)




ఈ ప్రకృతి సిద్ధమైన భూ ప్రిసిషనును ఈశ్వరుఁడు కూడా వేరుచెయ్యలేఁడు. కాబట్టి ధ్రువుని ఘోరతపఃఫలితంగా ప్రకృతి రహస్యాన్ని మాత్రం వెల్లడించాఁడు. *

* [ఈ ప్రిసిషను గమనించకపోవడంవల్ల కలిగే నష్టాలు, పూర్వులు గమనించి తమ గణితసిద్ధాంతంలో చేసుకున్న మార్పులు అందులకు నిదర్శనాలు మరొక వ్యాసంలో మనవిచేస్తాను.]

# మేలుబాట

శ్రీ గుఱ్ఱప్పడియ ఆంజనేయులు

కాలకర్మానుబంధంబు గడువలేక
తప్పటడుగుల నిడినారు తాత లెపుడొ,
ముండ్లడొంకలఁ బడినావు ముందుఁగనక,
మరలి చనుదెమ్ము! కలదిటు మంచిత్రోవ.

కనుపట్ట దిందు కాల్గదలింపనీయక నేరంబులెన్ను పల్లేరుపొదలు,
వసియింప దిందు గోప్యముగ నెత్తురుఁ బీల్చి మర్మంబులేర్చు గోమారిగుంపు,
దరికి రా దిందు కత్తెరకోఱ లుబికించి తివ్వవఁ బైదూఁకు తేఁచుపెద్ద,
జనియింప దిందు మందునకైన తలవంచుకొనఁజేయు గచ్చలల్లిన వెదుల్లు,
చుట్టుకొన దిందు భీషణస్ఫురణతోడఁ
గుటిలజంఝానిలోచ్చలచ్ఛటాలరజము,
శశ్వదానందకంద మీ సత్పథంబు
పూజ్యపదవికి నిన్ను గొంపోవునోయి!

కులమత ద్వేషకాకోదరానీకంబు లుమియు దుర్విషవహ్ని కోర్చుకొనుచు,
తలకుఁ బాదములకు దాస్యవల్లికపెట్టు సంకెళ్ల బాధను సైచుకొనుచు,
నవనాగరికచోర నివహంబు గావించు నిలువుదోఁపులఁ జేయి నులుముకొనుచు,
ఉద్యోగమృగతృష్ణ యొదవించుమాయచేఁ దగనిపేరెమువారి దప్పిఁగొనుచు,
జీవితాశయసుమవల్లి చివికిపోవ
మానవాన్వయమర్యాద మాసిపోవ,
దీనదశ నొంది కానలఁ దిరుగనేల?
భానుసన్నిభునకు నీకు భారతీయ!

కమ్మని రాట్నగానమ్ము తేనియఁజిమ్మి వీనులవిందుఁ గావింపుచుండ,
శమదమలసదహింసా సత్యమూర్తులు సహావర్తులై సముత్సాహ మొసఁగ,
సామరస్యము సితచ్ఛత్రమ్ముచందాన నెమ్మేనితాపమ్ము వమ్మొనర్ప,
జాతీయభావనిర్ఝరధార లుప్పొంగి చలువపన్నీటిసోనలను జిలుక,

ఇంద్రియాతీతమోద నిస్తంద్రివగుచుఁ
బుణ్యపురుషోత్తములతోడఁ బొత్తునలిపి,
కదలిపొమ్మిదె మార్గంబు; కలుగు నచట
నాత్మసామ్రాజ్యలక్ష్మీసమాగమంబు.

శరదిందుప్రభ లీనుచున్న దదిగో! స్వాతంత్ర్యదేవాలయా
వరణోత్తుంగసమీరగోపురము; తద్ద్వారం బుదాత్తాశయో
త్తరగమ్యం; బట విశ్రమించి, విగతాంతఃఖేదివై యంబికా
చరణద్వంద్వము నాశ్రయింపు! మదెపో! సాఫల్య మీజన్మకున్.

భావుకులౌ మహాజనుల పాదపయోజరజఃకణమ్ములన్
బావనమైన దీతెరువు నాటికి నేటికి; తీర్థయాత్రగాఁ
బోవుచునున్నవారు నరపుంగవు లెందరొ; వారివెంబడిన్
నీవును బాటసారి వయి నిస్తులభోగము నందఁ జెల్లదే?

నిలు వెల్లన్ గరుణారసం బొలయఁ బాడన్ బూని మువ్వన్నె చి
న్నెల జెండా నిట మార్గదర్శకుఁడుగా నిల్పెన్ మహాత్ముండు; ప్రాఁ
బలుకుం జేడియ విప్పుచున్న యది శుంభద్దివ్యగీతార్థముల్ ;
కలిపీడాభయ మిందు గల్గదు సుమా! కల్యాణకృన్మైత్రి చేన్.

విసముఁ గోరి సుధను విడిచిన జడుపోల్కి
భంగపాటుఁ గనుట పాడిగాదు;
దిక్కు లేలఁ జాలు తెలుఁగు బిడ్డవు నీవు
మెట్టు! మింకనైన మేలుబాట.



# హిందూదేశంలోని వయోజనవిద్య

శ్రీ కొండేపూడి సుబ్బారావు

హిందూదేశంలోని ప్రజలు ౧౦౦ కి ౭౦ మంది నిరక్షరాస్యులుగా వున్నారు. అనగా వీళ్లకు చదువను వ్రాయను రాగన్న మాట. ఈ నిరక్షరాస్యతను పోగొట్టడానికి ముఖ్యంగా వయోజనవిద్య (Adult Education అభివృద్ధి చెయ్యాలి. వయోజనులు అంటే ౧౬ సం॥ మొదలు ౩౫ సం॥ వరకు వుండే ప్రజలన్నమాట. వీళ్లు, అటు పసివాళ్లు కాకుండా వుండి—యిటువృద్ధులు కాకుండా వుండీ—చదవటం వ్రాయటం రాకుండా, తమ రేదేశస్థులో తెలియక, తమ చుట్టుపట్ల యేమిం జరుగుతోందో తెలుసుకోకుండా కేవలం నిశాసీగాళ్లై వుండటం ఎంతో విచారకరమైన సంగతి.

అయితే ఈ వయోజనులకు అందరకు విద్యగరపటం ఎట్లాగ? వీళ్లందరకూ చదువు వస్తుందా? వీళ్లకు ఎటువంటివిద్య కావాలి? అని ప్రశ్నలు వేయవచ్చు. ఈ వయోజన విద్య అంటే యేమిటి ? అని గాంధీగారిని ప్రశ్నిస్తే, ఆయన, "వయోజనవిద్య అనగా యుక్తవయస్సువచ్చి, నిరక్షరాస్యులుగా వున్న ప్రజలకు చదవను, వ్రాయను చెప్పి, వారికి కొంచెం లోకజ్ఞానం అలవడేవిధానం నేర్పడమే వయోజనవిద్య" అని అన్నారు.

కనుక ముఖ్యంగా ఈ వయోజనవిద్యను వ్యాపింప జేయటానికి నిరక్షరాస్యతను లకు చదవటం వ్రాయటం నేర్పితే, మిగతా లోకజ్ఞానాన్ని వాళ్లే సంపాదించుకోగలరు. మన హిందూదేశంలో ౧౫ సం॥ వయస్సు పైగల వాళ్లలో ౧౦౦ కి ౭౦ మొదలు ౯౦ వరకుగల జనులు ఏవిధమయిన అక్షర జ్ఞానము లేకుండా వున్నారు. మన ప్రజలకు అక్షరజ్ఞానం కలుగజేసి, వోటిచ్చేజనుడు, పన్ను చెల్లించే ప్రతివ్యక్తి, చదవటం వ్రాయటం నేర్చుకుని, దినపత్రికలు చదివి, దేశకాల పరిస్థితులు అవగాహన చేసుకొని, తనవోటును దుర్వినియోగం చేయకుండా ఉపయోగించుకొనేటంతటి విద్య చెప్పితే ఈ వయోజనవిద్యాసమస్య పరిష్కార మాతుంది.

విదేశాలలో ఈ వయోజనవిద్యను అనేకవిధాలుగా అభివృద్ధి చేస్తున్నారు. ఇంగ్లండు, స్కాట్లండు, ఫ్రాంసు, స్వీడన్, కెనడా, దేశాలలో వయోజనవిద్యను పెంపొందించటానికి 'కంటిన్యుయేషన్ స్కూళ్లు' ను స్థాపించారు. ఆ పాఠశాలలలో చదవటం, వ్రాయటం నేర్పటమేకాకుండా, వివిధవృత్తులు చేసుకునే విధానాలు, వర్తకం చేసుకునే పద్ధతులుకూడా ఉచితంగా బోధిస్తారు. ఒక్కొక్కప్పుడు ఆ చుట్టుపట్ల గల పల్లెల్లో గల స్త్రీపురుషులు ఫలానావయస్సు గలవాళ్లు తప్పకుండా ఆ పాఠశాలలకు పోవాలని నిర్బంధిస్తారు కూడాను. (Compulsory Adult

డెన్మార్కు దేశంలో ఈ వయోజన విద్యను అభివృద్ధి చేయటానికి, అక్కడ 'ఫోక్ స్కూళ్లు' (Folk Schools) వున్నాయి. ఇవి విద్యాగంధంలేని కార్మిక, కర్షకులకు ఎక్కువ ఉపయోగపడుతున్నాయి. ఈ పాఠశాలలు, కర్షకులకు పనిలేనికాలంలో సం॥ నకు ౩ మాసములు మాత్రమే నడపబడుతూ, వాళ్లవృత్తులకు ఏ విధమైన ఆటంకము కలగకుండా, సాగింపబడుతున్నాయి. జపానుదేశంలో, ప్రభుత్వం, విశ్వవిద్యాలయాలు కూడా, ముఖ్యమైన ప్రదేశాలలో వయోజనవిద్యాపాఠశాలలను స్థాపించాయి. వీట్లలో స్త్రీ పురుషులకు ఎవళ్ల వృత్తులను బట్టి వాళ్లకు విద్య నేర్పుతారు.

మన హిందూదేశంలో మన ప్రభుత్వం వారు ఈ వయోజనవిద్యను గూర్చి యేమీ ఆలోచించలేదు. మెకాలే దొరగారు దేశంలో ధనంగల కొద్దిపాటి నాయకులకే ఉన్నతవిద్య నేర్పితే చాలనీ, వాళ్లద్వారా తక్కిన ప్రజలకు విద్యావ్యాప్తి కలుగుతుందనీ అభిప్రాయపడ్డారు. దీన్నే వడికట్టుసిద్ధాంతం (Filteration theory) అని అంటారు కూడాను. కాని ౨౦-వ శతాబ్దం నుంచీ, ముఖ్యంగా మహానుభావుడు ఘోఖలే (Ghokle) కాలంనుంచి, ఈ వయోజనవిద్యాసమస్య మన దేశంలో కూడా మొలకలెత్తటం ప్రారంభించింది. ఘోఖలేగారు, హిందూదేశంలో గల, బాలబాలికలందరకు నిర్బంధప్రాథమిక విద్య (Compulsory Primary Education) గరపవలసిందని ఒక అలజడిని లేవదీశారు. ఈ నిర్బంధప్రాథమికవిద్య హిందూదేశంలో ఒక్క బరోడా సంస్థానంలో జయప్రదంగా సాగుతోంది. మొన్న సాండూర్ (Sandur) సంస్థానాధిపతికూడా వయోజనవిద్యను తన సంస్థానంలో నిర్బంధిస్తున్నానని ప్రకటన చేశాడు.

౧౯౩౩-వ సం॥ లో మదరాసు విశ్వవిద్యాలయంవారు వయోజన విద్యావ్యాప్తికొరకు కొన్ని 'లెక్చర్లు' యిప్పించటానికి కొన్ని కొన్ని నిర్ణీతస్థలాలలో ఏర్పాటు చేశారు. కాని అక్షరజ్ఞానం లేనివాళ్లకు ఈ లెక్చర్లవల్ల ఆవగింజంతైనా ప్రయోజనం లేదు. మదరాసు యువజన క్రైస్తవసంఘం వారు, (Y. M. C. A) వయోజన విద్యావ్యాప్తికై, కొంత కృషిచేశారు. వీరు మత విషయాలపైన, చరిత్ర, ఆరోగ్య విషయాలపైన, చిన్న చిన్న కథలరూపంగా, సామాన్య ప్రజలకు అర్థమయ్యేటట్లు 'మ్యాజిక్ లాంతర్లు' సహాయంతోటి, బొమ్మలు చూపుతూ ప్రబోధంచేశారు. సుమారు ౪ సం॥ క్రితం, బొంబాయి ప్రభుత్వంవారు కూడా, వయోజనవిద్యకొరకు ఒకసంఘాన్ని స్థాపించారు. వారు వయోజనులలో విద్యావ్యాప్తికై తగుకృషిచేస్తున్నారు. బెంగాలు ప్రభుత్వం వారుకూడా, ఈ విషయంలో ఎక్కువ కృషి చేస్తున్నారు. అక్కడగల గ్రామ సబ్ రిజస్ట్రార్లను (Rural Sub-Registrars) వాళ్లకుగల తీరికకాలంలో వయోజనవిద్య గరపటానికి నియమించారు. వీరు అక్కడగల వయోజనులకు, వాళ్లకు నిత్యజీవనంలో ఉపయోగపడేవిద్యే చెప్తారు. అనగా వ్యవసాయాన్ని గురించి, పశువుల పోషణనుగూర్చి, పరిశుభ్రతను గూర్చి, సహకారాన్నిగూర్చి, వ్యవసాయపుసరుకు అమ్మే విధానము—యిత్యాదులు గ్రామీణులకు బోధిస్తారు. ఈ సబ్ రిజస్ట్రార్లు అప్పుడప్పుడు,

ప్రజలకు అర్థమయ్యే తేలికభాషలో, ప్రపంచ పరిస్థితులను గూర్చి, వార్తాపత్రికలు చదివి, చిన్నచిన్న ఉపన్యాసాలు కూడా యిస్తారు. గవర్నమెంటు ఉద్యోగీయులగు, ఆరోగ్య శాఖ అధికారి, పశువులశాఖ అధికారి, సహకారపు శాఖల అధికారులు కూడా, తమ తమ వంతులప్రకారం, వారి వారికి అనుగుణమైన విషయాలపై మాట్లాడుతూ వుంటారు. ఈ పనులకు ఏ విధమైన జీతభత్యాలూ లేవు. ఇదంతా గౌరవనీయమైన పనే!

౧౯౩౮-వ సం॥ వ మన దేశంలో హిందూదేశపు వయోజన విద్యాసంఘము స్థాపించబడింది. (Indian Adult Education Society) ఈ సంస్థ వయోజనులకు విద్యగరపటానికి-వారికి చదువనూ వ్రాయనూ నేర్పటానికి— రేడియో ప్రసంగాలద్వారా వారికి వ్యవసాయ పద్ధతులు నేర్పేటందుకు పూనుకుంటూ వున్నది. ఈ వ్యవసాయ పద్ధతులకు ప్రతిదినం ఒక అరగంట వినియోగిస్తూ వున్న మన మదరాసు రేడియో వారిని మనం అభినందించాలి! ఈ సంఘము జయప్రదంగా సాగటానికి డబ్బుకోసం చందాలకోసం తగు కృషి చేస్తున్నారు.

కనుక, ఇక ఈ వయోజన విద్యాసమస్యను ప్రభుత్వానికా, లేక ప్రజలకా, వదలివేయవలసింది? అనేసంగతి ఆలోచించాలి. ౧౯౨౮ సం॥ రాయల్ అగ్రికల్చరల్ కమీషనువారు ఈ వయోజనవిద్యా సమస్యను ప్రజలకే వదలివెయ్యాలని సూచించారు. ముఖ్యంగా దేశంలో ప్రాథమికవిద్య కావాలనీ, వయోజనవిద్య అంతగా అవసరం లేదనీ వారి అభిప్రాయం. వయోజనవిద్య అక్కరలేదని వారు కేవలం అనటంలేదు. వయోజనవిద్యకుకూడా ధనం వెచ్చిస్తే, ప్రాథమికవిద్యకు చాలదని సూచించారు. కాని, ఈవయోజనవిద్యను అభివృద్ధి చెయ్యాలంటే, ప్రభుత్వంకూడా తగినన్ని 'గ్రాంట్లు' యివ్వాలి. లేకపోతే ఈ సమస్య పరిష్కారం కాదు.

మన దేశానికి డెన్మార్కువారు ఫోక్ స్కూళ్లలో అవలంబిస్తూన్న ప్రణాళికనే మనము అవలంబించవచ్చు. ఎందుచేతనంటే డెన్మార్కు కూడా హిందూదేశానికి మల్లే వ్యవసాయదేశమే! పాఠశాలల్లో భూగోళాన్ని గురించి, చరిత్రను గురించి కొంచెం చెప్పి, వోటరుబాధ్యతలు కొంచెం తెలియపరచి, ఏదో ఒక చేతిపనిని ప్రధానంగా నేర్పాలి. ఇలా నేర్పితే యించుమించుగా, మహాత్ముడు స్థాపించిన వార్ధా విద్యావిధానానికి ఈ వయోజనవిద్య చేరువగా వుంటుందన్నమాట!

కనుక మన దేశంలో ౧౦౦ కి ౭౦ మొదలు ౯౦ వరకు అక్షరజ్ఞానం లేని ఈ వయోజనుల యొక్క నిరక్షరాస్యతను పోగొడితేనే కాని, మనదాస్య శృంఖలాలు మనను వీడవు సరిగదా మన కేవిధమైన ముక్తిలేదు. ఈ విషయమై ప్రభుత్వము-ప్రజలు-కూడా తగుకృషి చేస్తారని ఆశిస్తాను.

---

# గుండెజబ్బు

‘కిరణకుమార’

‘ఆడబోతే మాడబుద్ధీ, మాడబోతే ఆడబుద్ధీ’— అని వెనకటి కొకసామెత ఉండేది. నెలకు మూడు వందలరూపాయలు జీతంవచ్చే నిక్షేపంలాంటి తహశీల్‌దారుగిరీ చేస్తుండిన రోజుల్లో ఎందువల్లనో ఆ విరక్తి అర్థంగాదు. ఎప్పుడు రిటైరయి ఇంటి పట్టున హాయిగా విశ్రాంతి తీసుకొంటామా భగవంతుడా అని, జానకిరామయ్యగారు నిత్యమూ వెయ్యి దేవుళ్లకు మ్రొక్కుకొంటూ ఉండేవారు. చివరకు ఆ మనసూ తీరింది. తీరక, శాశ్వతంగా ఉట్టిగట్టుకొని ఉయ్యాలలూగే ఉద్యోగాలు గనకనా? ఏభై ఐదో సంవత్సరం వయస్సు పూర్తికావడంతోనే, ఆయన ప్రమేయం లేకుండానే, సర్కారువారే, ఇంక తమరు దయచేయ వచ్చునని ఆ పెద్దమనిషిని రిటైరుచేయించి, ఉద్యోగానికి స్వస్తిచెప్పారు.

మనస్సు చపలత్వానికి అర్థమేమిటి? రిటైరు కానంతసేపేకాని, తీరా రిటైరయి, తనకూ సర్కారు ఉద్యోగానికీ ఋణం తీరిపోయిందని ఆయనమనస్సుకు తోచిన క్షణం లగాయతు, ఇంకా సర్వీసులో ఉండి ఉద్యోగం చేస్తుండిన ఉద్యోగస్థుణ్ణి చూచినప్పుడల్లా ఆయన మనస్సు ఊ ఇదవుతూ ఉండేది. మళ్లా కొన్నాళ్లపాటు, కోటు తొడుక్కొని, నెత్తిన పాగా పెట్టుకొని, జవాన్లూ, నౌకర్లూ, చాకర్లూ వగైరా సిబ్బందితోటి, తహశీల్‌దారుఉద్యోగంచేస్తే బాగుండునని ఆయ నెంతో ముచ్చటపడుతూ ఉండేవాడు. కాని ఇదేమయినా కూరగాయలబేరమా ఏమిటి? ఉద్యోగాలకోసరం దేశంలో ఉండేపోటీ ఏమిటి, రిటైరుకావలసిన ఈడులో గూడ ఇంకా నౌకరీలో ఉంచడమేమిటి? తను బ్రాహ్మణుడుగాని, ఓహీనజాతికులస్థుడైనా కాడు. తనమాత్రపుపనివాడు దొరకరని సర్కారువారికి దిగులా, విచారమా? పాపం! ముప్ఫయ్యేళ్లు అస్థులూ చర్మమూ ధారవోసి చేసిననౌకరీ కాబట్టి, చిరకాల సహవాసంవల్ల మమకార మనేది అట్లా పీకుతూ ఉంటుంది — ఏంచేస్తాం?

దినములు గడిచినకొద్దీ అదే పరిపాటయిపోయి బాధ ఉపశమిస్తూ వచ్చింది. యుగంధరుల్లాంటి, ముగ్గురు కొడుకులు చేతికెక్కివచ్చి, పెద్దవాడు డెల్టా సూపరింటుగానూ, రెండోవాడు ప్లీడరుగానూ, మూడోవాడు డాక్టరుగానూ — గొప్ప గొప్ప ఉద్యోగాల్లో వుండి రెండు చేతులా సంపాదించుకొంటున్నారు. ఉన్న ఒక్కకూతురుకీ సలక్షణంగా పెళ్లిచేసి, ఇంత కలిగినసంసారంలోనే పడేసి ఆబరువు దించుకొన్నాడు తాను. తామరతంపరగా ఇంటినిండా కావలసినంతమంది పిల్లలూ, మనమలూ, భార్యా, పెద్దలోగిలీ, దొడ్డీ, మేడా,— తన కెందు కింకా సంపాదించి పోగుపెట్టాలని దొర్లాట? కృష్ణా రామా గోవిందా అనుకొంటూ కూర్చుంటే తనతనువు మహారాజులా వెళ్లిపోదూ? అని ఈవిధంగా భార్యా కొడుకులూ ఊ దిగలాగుతూ వచ్చారు.

జానకిరామయ్య సర్కారునౌకరీలో ఉండి, దాన్ని రోతగించుకొనే రోజుల్లో, ఎవ్వరికీ తెలియకుండా ఆయన మనస్సులో అతిరహస్యమైన ఒక కోరిక ఉండేది. తన జీవితంలో ఎప్పటికయినా— ఆఖరుకు ఒక్కరోజయినా సరే—సన్యాసం స్వీకరించి మరీ ప్రాణాలు విడిచిపెట్టవలెనని, ఆయనకు అదెందువల్లనో ఒకకోరిక ఉండేది. ఈ రహస్యం ఒక్క భార్యకుతప్ప ఇక రెండోకంటివాడెవ్వడికీ తెలియదు. మనిషిజన్మ ఎత్తినతర్వాత, జీవితంలో నిజమైన విశ్రాంతీ, ఆనందమూ అనుభవించాలంటే, సన్యాసాశ్రమం

తీసుకొంటేనేతప్ప మరోవిధంగా అది లంభించదని ఆయన కొకవిధమైన విశ్వాసం. అట్లాంటి విశ్వాసమూ, గౌరవమూ ఉండడానికయితే ఉండేదిగాని తనవంటి వాడు చటుక్కున కాషీవదండకమండలాలు స్వీక రించి, బుర్ర గొరగించుకొన్నట్టయితే, కత్తిమీద సాములాంటి ఆ ఆశ్రమం యథావిధిగా జరుపుకో గలమో లేమో అని, మళ్లా ఇంకోమూల జంకూ ఏర్ప డుతూ ఉండేది. బ్రతికి బాగుంటే రిటైరయి వార్ధక్యం వచ్చినతర్వాత ఇంటిదగ్గర వ్యవహారాలన్నీ కొడుకు లకూ, కూతురికీ, భార్యకూ అప్పగించి నిదానంమీద సన్యసిద్దామనుకొని పైకిమాత్రం ఎవ్వరితోనూ చెప్ప కుండా మనస్సులోనే దాచిపెట్టుకొని ఉన్నాడు.

రిటైరయిన రెండేళ్లకు, ఒకసారి దక్షిణాదినుండి కావేరీక్షేత్రాధిపతులు, స్వాములవారు సంచారంచేస్తూ ఆ వూరుకూడా వేంచేపు చేశారు. ఆ స్వాములవారి అట్టహాసం చూస్తే అనేక జమీందారీ అట్టహాసంగా ఉన్నదిగాని, సంసారంమీదా జీవితంమీదా రోతపుట్టి సన్యసించిన సన్యాసివ్యవహారంలాగా కనుపించలేదు. బ్రహ్మాండమైన ఓపెద్ద ఏనుగూ, నాలుగుగుర్రాలూ, గుర్రాలమీద పోలీసుయూనిఫారంవేసుకొని స్వారీచేసే ఆశ్వికులూ, చేత తుపాకులు ధరించినభటులూ, పసుపు పచ్చడవాలీల బంట్రోతులూ, ఢంకా నాబత్కా నాలూ, భేరీనినాదాలూ, తూతుబాకాలూ, వెండి దండాలూ, పగటిదివ్వెలూ, మేనాలూ, బోయీలూ, ఒంటెద్దుబళ్లూ, రెండెద్దులబళ్లూ,—ఒకటేమిటి, సిం హాసనంమీద కూర్చొని రాజ్యపరిపాలన చేసేరాజుకు ఉండవలసిన అంగాలలో రథమొక్కటి తప్ప మిగిలిన గజతురగపదాతులు వగైరా పరివారమంతా అట్టహాసం గా ఉన్నది. ఆ స్వాములవారెక్కడికి వెళ్లినా ఆయ నకు జరిగేపూజలు పూజలుగావు, భిక్షలు భిక్షలు గావు, సత్కారాలు సత్కారాలు గావు. నాటకం టిక్కెట్లు తరగతివారీ రేట్లు ఏ ప్రకారంగా నిర్ణయింప బడి ఉంటాయో, సర్కారు బందెలదొడ్లలో తోలే పశువులకు రకంవారీగా బందెరేట్లు ఏవిధంగా ఏర్పాటు చేసి బోర్డుమీద వ్రాసి బయట తగిలిస్తారో, ఆ విధంగానే ఆ స్వాములవారి సత్కారాలు,ఒక్కొక్క రకానికి ఒక్కొక్క రేటు ప్రకారం పెద్దబల్లమీద వ్రాసి వారిబసకు బయట తగిలించే ఉంచుతారు.

సంపూర్ణ భిక్షకు రెండువందల రూపాయలూ,
పీఠపూజకు నూటఏభయి రూపాయలూ,
పాదపూజకు నూరురూపాయలూ,
పాదుకలపూజకు డెబ్బయ్యయిదు రూపాయలూ,
పాదుకలకింది ధూళిపూజకు ఏభయిరూపాయలూ,
మంగళహారతికి పాతికరూపాయలూ,
గజపూజకు ఇరవై రూపాయలూ,
అశ్వపూజకు పదిరూపాయలూ.

ఈరకంవారీ పూజావిధానానికి రేట్లు ఏర్పాటు చేసి ఉంచారు. ప్రపంచంలో మనుష్యులందరూ ఒకే పూజచేసి పుట్టుతారా? వారి హెచ్చుతగ్గుల ననుస రించి, ఎవరి శక్త్యనుసారం వారు ఆయాపూజలు చేయిస్తూ ఉంటారు ఆస్వాములవారికి—

ఇంతకీ చెప్పవచ్చిం దేమంటే—ఆస్వాముల వారి రాచఠీవీ(పటాటోపమూ చూచేవరకు, చిరకాలం సర్కారు అధికారాన్ని చేతిలో పెట్టుకొని చలా యించినవాడవడంచేత, సన్యసించినప్పటికీ అటు వంటి పీఠాధిపత్యమే గనక లభించినట్టయితే తాను జీవితపర్యంతమూ అటువంటి అధికారంతోనూ, ఆటోపంతోనూ జరుపుకోడానికి అవకాశం ఉంటుంది గదా అని జానకిరామయ్యగారి కొక విధమైన ఆశ పుట్టింది మనస్సులో. దేనిమీద నయినా మమకార మనేది పుట్టకుండానే ఉండా లిగాని, పుట్టిం దంటే పిశాచంలాగా పట్టుకొని వద లదు! అదిగాక సర్కారుఉద్యోగంమీద ఒకవిధమైన ఏవగింపు ఉంటూఉండినప్పటికీ, తహశీల్దారీనుండి డిప్టీకలెక్టరు కాకపోతిమే అని ఇంకోరట్టు ఆయన వ్యసనపడుతూనే ఉండేవాడు. తనకంటె వెనక ప్రవే శించిన కుర్రకారంతా, తనకంటె ముందుగా డిప్టీకలె క్టర్లయి పైకి పోతుంటే, వాళ్లని చూడలేకా, చూచి ఓర్చుకోలేకా జానకిరామయ్య ఊ కుమిలిపోతుండే వాడు. చివరకు, డిప్టీకలెక్టరు అని అనిపించుకో కుండానే ఆయన రిటైరు కావలసివచ్చింది. ఆప్రాప్తం లేకుండానే పోయింది. పోనీ సాములవారిలాగు తాను

పీఠాధిపతి అయి అంత అధికారమూ చలాయించుకోడానికి లేకపోయినా, తాను సన్యసించి, ఆపీఠం స్వాములవారి కింద, అసిస్టెంటుగానో, లేక జూనియరు స్వాములవారుగానో, లేక డిప్టీస్వాములవారుగానో ప్రవేశించినట్టయితే, తనకూ కూడా, అంత పెద్దది గాకపోయినా, ఓ చిన్నరకం ఏనుగూ, చిన్న పట్నం జట్కాబళ్లలాగే గుర్రాలవంటివి — ఒకరకమైన రెండు గుర్రాలూ, రెండు తుపాకులూ, నలుగురు జవాన్లూ, పెద్ద స్వాముల వారిలాగు బోయీలూ, మేనా లేకపోయినా పెద్దతిరపతి కొండమీదికి తీసుకొని పోయేలాంటిది ఓ డోలీవాహనమూ — ఇట్లాంటివయినా లభిస్తాయేమోనని ఆశపడి, ఆ స్వాములవారి పీఠమేమిటో, ఆ సర్వీసు ఏమిటో, ఆ రూల్సేమిటో, ఆ వివరాలన్నీ జానకిరామయ్య పరస్పరంగా, అతిరహస్యంగా, విచారిస్తూ వచ్చాడు. ప్రయోజనం లేకపోయింది. పీఠాధిపతులయిన స్వాములవారి కొక్కరికి తప్ప, ఆ పీఠంకింద మరొకమనిషి అటువంటి లాంఛనాలతో బ్రదకడానికి ఆస్కారం లేదని ఆయనకు తెలిసింది. నిరాశచెంది నీళ్లు వదలుకొన్నాడు.

ఓ చెడ్డకోరిక అయినా, మంచికోరిక అయినా, నెరవేరి అనుభవిస్తూవస్తుంటే మనిషికి అనేకవిధమైన తృప్తీ వికాసమూనూ. కోరిక తీరకపోతేమాత్రం, అదొక వ్యసనంలాగా ఇంద్రియాలనూ మనస్సునూ పట్టి బాధిస్తూనే ఉంటుంది. చివరకదే ఒక మనోవ్యాధిలాగు కూడా మారుతూ ఉంటుంది. మరి అటువంటి మనోవ్యాధే పట్టుకున్నదో, లేక వార్ధక్యంవల్ల జరాగ్రస్త కళేబరానికి వ్యాధే అంకురించిందోగాని, ఒకరోజున జానకిరామయ్యగారికి హఠాత్తుగా జబ్బుచేసి స్మారకం లేకుండా పడిపోయాడు. టెలిగ్రాములమీద, కొడుకులూ, కోడళ్లూ, కూతురూ అల్లుళ్లూ అందరూ సమావేశమైనారు. ఏదో గుండె జబ్బు అని తీర్మానంచేశారు డాక్టర్లు. ఇక మనిషి బ్రతకడంటే బ్రతకడని నిశ్చయించుకొన్నారు. ఆయన మంచమెక్కి వారంరోజులయింది. ఇక రోజులమీదా గంటలమీదా ఉన్నదిగాని, ఆయనఘటం, అంతకుమించి ఆశ వదులుకోవలసిందని జిల్లా సర్జనుకూడా కడపటివార్నింగు ఇచ్చేసి వెళ్లిపోయాడు.

గుండెజబ్బువల్ల పడిపోయిన మనుష్యులు చివరంటా జాగ్రదవస్థలోనే ఉంటారట! మరణశయ్యమీద గంటలూ నిమిషాలూ ఎంచుకొనే జానకయ్యకు, పోయేవాళ్లం ఎట్లాగా పోతున్నాంకదా, సన్యాసం తీసుకొని ఆఖరు కొక గంట అయినా ఆ ఆశ్రమంలో ఉండి మరీ ప్రాణం విడిచిపెట్టుదామని ఒక ఆలోచన తట్టింది. భార్యనూ కొడుకులనూ పిలిచి బయటికి చెప్పేశాడు. అవసానకాలమందు తండ్రికోరిక నెరవేర్చడంకంటె ఉత్కృష్టమైన కార్యం ఆ కొడుకులకు మరొకటి ఉంటుందిగనకనా? అదిగాక ఆయన డబ్బూ, దస్కమూ, వస్తువూ వాహనమూ కోరడమే లేదు. అటువంటి వన్నీ విసర్జించి, ఇంతకాషాయమూ, దండమూ, కమండలమూ మాత్రమే ఇప్పించవలసినదని కోరుతున్నాడు — ఆతండ్రి. బంధుకోటి యావత్తూ సంతోషించారు. వెంటనే ఆ గ్రామంలో ఉండిన ఇతర స్వాములవారినీ, వారినీ వీరినీ పదిమందిని పిలిపించి, జరగవలసినతంతు అంతా జరిపి, సమారాధనలూ, పూజలూ పునస్కారాలూ చేయించి, మర్నాడు సాయంత్రానికల్లా ఆతండ్రికి బుర్రగొరిగించి సన్యాసం ఇప్పించారు పుత్రులు — ఆహా!

ఆరాత్రికే స్వాములవారికి జబ్బు మరీ ఎక్కువైంది. ఆరాత్రి గడవదన్నారు అందరూను. గుండెజబ్బుతప్ప శరీరంలో మరొకవిధమైన బాధగాని, ఆయాసంగాని, మరొకటీ మరొకటీగాని లేనందువల్ల, 'కీ' ఇవ్వని గడియారం నిలిచిపోయినట్టు గుండె టక్కున ఎప్పుడు నిలిచిపోతుందో ఏమోనని స్వాములవారికి దొడ్లోవసారాలో దర్భలు పరిచి భీష్ములవారిని అంపశయ్యమీద పరుండపెట్టినట్టు పరుండపెట్టారు. ఆ రాత్రి తెల్లవార్లూ ఇంటిల్లిపాదీ ఆయనచుట్టూ కూర్చునేవున్నారు. సూర్యోదయంవేళకు ప్రాణం ఎట్లాగా పోతుంది. మందూమాకూ వేసిమాత్రం ప్రయోజనమేమున్నది గనక అని ఎప్పుడయినా అడిగినపుడు ఇన్ని బార్లీనీళ్లో, గ్లూకోజునీళ్లో లేక ఇన్ని హార్లిక్సుపాలో గొంతుకలోపోస్తూ వచ్చారు. కాని ఆనీళ్లవల్లా పాలవల్లా గుండెకు బలమే చేరుకొన్నదో, లేక అసలు వ్యాధే తిరుగుముఖం పట్టిందో

అర్ధరాత్రిగడియలు గడిచి వేకువసమీపించిన కొద్దీ స్వాములవారిస్థితి చక్కబడుతూ లింగైక్య మందు తాననుకొన్నమనిషి తెల్లవారేవరకు, పెళ్లికొడుకు లాగు చక్కాలేచి కూర్చున్నాడు. ఎండబడినకొద్దీ మొఖం తేటతేలి కళకళలాడుతూ వచ్చింది. అంతకు పూర్వంలోజానే బుర్రగొరిగించుకొని సన్యాసంతీసుకొన్నాడేమో, చీడా, చెదారం పోయి శరీరం తేలిక అయి మనిషికి రెట్టింపు ఉత్సాహం కలిగింది.

బాగానే వున్నది. చస్తా డనుకొన్నజీవి బ్రదకడం సంతోషకరమైన విషయమే. కాని పూర్వపు జానకి రామయ్యమాత్రం కాదు ఇప్పుడు. ఇప్పు డాయన స్వాములవారు. పాతపేరు పోయి చిదానందస్వాముల వా రని కొత్తపేరు వచ్చింది. పూర్వంలాగా ఎవరితో అంటే వారితో మాట్లాడ్డానికిగాని, ఏదంటే అది తినడానికిగాని, ఎక్కడికంటే అక్కడికి చటుక్కున వెళ్లడానికిగాని వీల్లేదు. అసలు స్వగృహంలో ఉండడానికే వీల్లేదు. అన్నిటికంటె మిక్కిలీ పెద్దచిక్కేమిటంటే, ఎవరితోనయినా మాట్లాడవచ్చుగాని భార్యతో మాత్రం మాట్లాడ్డానికి వీల్లేదు. ఇతర నిషేధాలెన్నిఉన్నా ఆయన లెక్ఖపెట్టుకోలేదుగాని, ఈనిషేధమే ప్రాణానికి వచ్చింది. అందులో తాను రెండో వివాహం చేసుకొన్న భార్యకూడాను. ఇద్దరివయస్సుల్లోనూ ఓపాతికేళ్లయినా వ్యత్యాసం వున్నది. కొడుకులు ముగ్గురూ మొదటిభార్యవల్ల కలిగినా రెండో భార్యవల్ల కలిగినదే ఆ ఒక్క ఆడపిల్లాను. ఈమెకాపరానికి వచ్చినతర్వాత ఆయన మిక్కిలీ ప్రేమిస్తూ వచ్చిన వస్తువుల్లో మొదటిది భార్యా, రెండవది కూతురూను. కూతురు పెద్దమనిషయి కాపరానికి వెళ్లినప్పటి నుండీ ఆయన ప్రేమానురాగాలన్నీ పూర్తిగా భార్యమీదనే చాటుకొని వేళ్లు పాతుకుపోయినవి. అసలీభార్యా మూలకంగానే ఇంతకాలంవరకూ ఆయన సన్యసించకుండా, ఇంకా వార్ధక్యం రానీ, ఇంకా వార్ధక్యం రానీ చూతాం అని ముందుకు నెట్టుకొంటూ వచ్చాడు. పెద్దపెద్దచదువులు వెలగబెట్టి, గొప్పగొప్పడాక్టర్ల మనుకొనేవా రందరూ చేరి తాను చచ్చిపోవడమే ఖాయమని చెప్పినందువల్ల సన్యసించాడుగాని, తా నింకా భూమిమీద నూకలు రుణముండి, జీవించవలసి ఉంటుం దని ఏమాత్రం తెలిసిఉన్నా, కొత్త పెనకామందూ యోజించి మరీచేసేవాడు ఏపనయినా— అన్నా! ఎంతపని జరిగిందీ!

పాపం! భార్యసంగతే మరీ విచారకరంగా ఉన్నది. ఆ భర్తను చూచుకొని సంతోషించాలో, దుఃఖించాలో ఆయిల్లాలి కర్థం గావడం లేదు. క్రితం రాత్రిస్థితి చూచి ఆశ వదులుకొని, పోనీ లోకంలో పాటే అని గుండె రాయిచేసుకొన్నదిగాని — మరి ఇప్పుడో! బుర్రగొరిగించుకొన్న ఆసన్యాసిని పెట్టుకొని ఆమె ఏంచేయను? అసలు మాటలాడ్డానికయినా నోచుకోని గర్భశత్రువై పోయింది ఆయిల్లాలు. ఏంబుద్ధి!

భార్యకంటెనూ బాధపడుతున్నాడు — స్వాములవారు. దిక్కుమాలిన ఆయుర్దాయం — తన కెందుకు పోయాలీ దేవుడు? ఇంకా ఎంతకాలం బ్రతకాలో! ఇంత కాచిపోయడానికైనా లేకుండా భార్యకి చేతులారా నీళ్లు వదలుకోవలసివచ్చిందిగదా! కడుపునపుట్టినవాళ్లుంటేమాత్రం—ఎక్కడికొడుకులు, ఎక్కడికోడళ్లీకాలంలో!

పెనిమిటివంట్లో ఎట్లా ఉన్నదో విచారించాలని భార్యమనస్సు పీకుతోంది. ఆమెచేతితో ఇంత పథ్యం వండించుకొని తినాలని స్వాములవారి మనస్సు పెరుకుతోంది. బయటకువస్తే తనముఖం ఆయనకంట బడుతుందేమోనని ఇంట్లో కూర్చుని భార్యఏడుపూ, బయట కోసారి వచ్చినట్టయితే ఆమెముఖమైనా గోచరిస్తుందేమో చూతామని బయట తాటాకుల వసారాలో ఈయన ఏడుపూ.

దినములు గడిచిపోతున్నవి: శరీరంలోని రుగ్మత అయితే పూర్తిగా నయమయి దారుఢ్యం చేరుకొన్నదిగాని — పరిస్థితు లేమీ బాగులేవు. ఈమధ్య కూతురే తండ్రికి ఇంత పథ్యపానాదులు చేసి పెడుతూ వచ్చింది కాని, అల్లుడు ఎంతకాలం ఓపిక పట్టుతాడు? ఊరికి పోవా లని అతడు తొందరచేశాడు: స్వాములవారికి ఏడుపువచ్చింది. నాగతేమికానూ - భగవంతుడా అని, తలుపుచాటున

నిలబడి ఘోరున ఏడిచింది భార్య. ఆక్షణే యోజించి, అత్తగారిని అల్లుడు తనతోకూడా తీసుకొనిపోయేటట్టు న్నా, ఆమె జీవితపర్యంతమూ అల్లుడువద్దనే ఉండే టట్టున్నూ ఏర్పాటుచేసి, కూతురునీ, భార్యనీ అల్లుడితోకూడా పంపివేశారు స్వాములవారు.

ఇక తాను స్వగృహంలో ఎంతకాలమని ఆ విధంగా ఉండగలడూ? అట్లా ఉండడం చాలా దోష మన్నారు అందరూను. వెంటనే ఇల్లువిడిచి ఊరిబయట ఆంజనేయస్వామి దేవళంలో మకాం పెట్టుకొన్నాడు. వేళకు ఎవరయినా పిలిచి భిక్షచేసి ఇంత అన్నం పెట్టితే, ఒక్కపూటమాత్రం భోజనం చేసుకొని, రెండోపూట, ఇన్నిపాలో, పండో, ఫలమో తింటూ కాలక్షేపం చేస్తూవచ్చాడు.

కాని—నానాటికి జీవితం దుర్భరంగా ఉన్నది - స్వాములవారికి. ఆవూళ్లో ఉండడానికి కష్టమనిపించింది. కొంతకాలం దేశసంచారం చేసివద్దామని, ఒకరోజు ఉదయం ఎవరితోనూ చెప్పకుండా బయల్దేరి వెళ్లిపోయాడు. ఆ వెళ్లడంవెళ్లడం, గ్రామాలు, తాలూకాలు, జిల్లాలు దాటి నెలలతరబడి, సంవత్సరాలతరబడి కూడా సంచారంచేస్తూనే ఉన్నాడు— ఇల్లు బయల్దేరిన వేళావిశేషం మంచిదనే చెప్పాలి మరి: వెళ్లిన చోటనల్లా స్వాములవారికి ఎంతో గౌరవంగానూ, గొప్పగానూ భిక్షలూ సన్మానాలూ జరుగుతున్నవి: ఆయన ఇంగ్లీషు చదువుకొని, సర్కారులో గొప్ప ఉద్యోగంచేసి రిటైరయి వార్ధక్యంలో సన్యాసం తీసుకొన్న మహాజ్ఞానిఅని ఆయనమీద ప్రజలకు గౌరవమూ, భక్తీ హెచ్చు అవుతూవచ్చినవి. భిక్షచేసిన ప్రతీగ్రామం లోనూ సభలు చేసి వారికితోచిన వేదాంత విషయాలు ఉపన్యాసాలుగూడా చేస్తూవచ్చారు. అదివరకెన్నడూ వారి కావిషయంలో విశేషంకృషి లేకపోయినా, పరిస్థితులపటుత్వంవల్ల గాబోలు, నానాటికి వారికి అభ్యాసమై, ఉపన్యాసధోరణిలో పడ్డారంటే ఒళ్లుతెలియకుండా గంటలతరబడి అట్లా నోరు కట్టుపడనేపడదు. చిదానందస్వాములవారంటే కేవలం పరమశివుని అపరావతారులనీ, మహాజ్ఞానసంపన్నులనీ, వారు జోండెతోనే కైలాసం వేంచేస్తారనీ ప్రజలలో ఆయనమీద ఒకగొప్పనమ్మకమూ భక్తీ కుదిరింది. తన సన్యాసం శుక్రమహాదశ అందుకొని ప్రజ్వలించే రోజుల్లోనే, ఒకగ్రామంలో, ఒకానొక బ్రాహ్మణ బ్రహ్మచారి యువకుడొకడు జీవితంమీద రోతపుట్టి, సన్యసిస్తానని ఆయనకాళ్లమీద పడి, శుశ్రూష చేయడానికి ఆయనతోకూడా లేచి చక్కావెళ్లాడు. ఆ బ్రహ్మచారికి నిజంలో సన్యసించే యోగ్యత ఒంటిమీద ఉన్నా లేకపోయినా, వృద్ధాప్యంలో దేశాటనంచేసే తనకు కొంత చేదోడు వాదోడుగా ఉంటాడని అతన్ని దగ్గర చేరదీసి, భృంగి అని ప్రియమైన నామకరణం చేసుకొని అతన్నికూడా తీసుకొనిపోయారు స్వాములవారు...

## ౨

ఒకరోజున ఏమి జరిగిందంటే— ఆయన దక్షిణ దేశం సంచారంచేస్తూ ఒకపట్నంలో మకాం చేస్తున్నారు. ఆవూరు సబుజడ్జీగారు స్వాములవారిచిన్నతనంలో, కూడా చదువుకొన్న సహపాఠి. చిరకాలానికి కలుసుకొన్నందువల్ల సంతోషంకొద్దీ, ఆరోజు గొప్పభిక్షచేసి సాయంకాలం ఆంజనేయస్వామి దేవళంలో ఉపన్యాసం ఏర్పాటుచేశారు. అంతకు పూర్వంకూడా ఆ దేవళంలో ఉపన్యాసాలు చాలా జరిగినప్పటికీ, ఆరోజున సబుజడ్జీగారి ఉభయం కాబట్టి, ఆపట్నంలోగల ఇతర ఉద్యోగస్థులూ, ప్లీడర్లూ, ముఖ్యంగా ఆడా—జనమేమిటి కిటకిటలాడుతూ వచ్చారు. అసలు అప్పటికోవారం రోజులుగా స్వాములవారి ఆరోగ్యం బాగులేక పోయినా ఆరోజున ఉపన్యాసం తప్పనిసరి అయినందువల్ల అట్లాగే వచ్చి ఉపన్యసించారు—స్వాములవారు.

ఉపన్యాసం పూర్తి అయ్యేవరకు చీకటిపడింది. జనం తోసుకొంటున్నారు. మసకమసకసంజె చీకట్లో, తోసుకొనే ఆజనసమూహంలో ఎవరో ఒకకొత్తమనిషి —ఆడమనిషి— తిరుగుతున్నట్టు స్వాములవారిదృష్టికి గోచరించింది. అన్ని వందలమంది జనంలో స్వాములవారి కొకరు కొత్తేమిటి, మరొకరు పాతేమిటనవచ్చు గాని—ఆమనిషి అదివరకా గ్రామాని కెన్నడూరాక అదివరమే కొత్తగా వచ్చి తిరుగుతున్న...

యనకు తట్టింది. ఆతట్టడం కేవలం పొరపాటే కావచ్చు. అయినా పరిశీలించి చూద్దా మనుకొంటే, ఆకాశంలో తళుక్కున మెరిసే మెరుపునయినా పరిశీలించ వచ్చునేమోగాని, ఆ స్త్రీ ముఖబింబాన్ని మాత్రం పరిశీలించడానికి వీల్లేకుండా, ఇట్టే మెరిసి కళ్లుచీకట్లు కమ్మేటట్టు, ఆ జనసముద్రంలో అట్టే మాయమైపోయింది—ఆమనిషి. ఆమనిషి తన భార్యకాదుగదా అని సందేహం కలిగిం దాయనకు!...సందేహం కలిగీ కలగడంతోనే ఆయన హృదయం ఉడుకెత్తి శరీరంలోని నీరంతా నేత్రాలగుండా బయటికి ప్రవహించింది

శరీరం అలిసిపోయినందునే, విశ్రాంతి తీసుకోవాలని స్వాములవారు తొందరగా బసకు చేరుకొన్నారు. ఎవ్వరితోనూ పలక్కుండా వెంటనే గదిలో ప్రవేశించి, దర్భలు పరుచుకొని, తలుపులుబిగించి పండుకొన్నారు. మనస్సు పరిపరివిధాల పనిచేస్తున్నది. నిలకడ చిక్కడం లేదు. కడుపులో చెయ్యిపెట్టి కలిచినట్టు వికారంగా ఉన్నది. ఆ రాత్రి ఓపండయినా భుజించడానికి హితవు కలగలేదు. కన్ను మూర్కుదామంటే నిద్రపట్టదు. కళ్లవెంట ఒకటేధార—ప్రవాహం. తనభార్య అక్కడి కారోజున యెట్లా రాగలిగింది? తన వూ రెక్కడ? ఇల్లెక్కడ? తన ఉనికి ఎక్కడ? ఎన్నాళ్లయింది, తాను భార్యాబిడ్డలను విడిచివచ్చి! మరి ఇన్నాళ్లకు ఆ భార్య వెతుక్కుంటూ దేశంకానిదేశం ఇట్లా ఒంటరిగా వస్తుందా? వస్తే—కూడా రెండోమనిషి తోడయినా లేకుండా వస్తుందా? వచ్చిన తర్వాత తనకు అనుపించకుండా ఉండడాని క్కారణం! చెక్కిళ్ల మీదుగా కాలవలుకట్టి, పాయలై, వరదలై ముఖమంతా ముంచేస్తున్నది—కన్నీటిజలం.

చీకటికుహ్యరం. మాగన్నుగా తూగు వచ్చి కన్నుమూసిన స్వాములవారు ఉలిక్కిపడి లేచి పక్కమీద కూర్చున్నారు. గుండెలు మహావేగంగా కొట్టుకొంటున్నవి. శరీరం ముచ్చెమటలూ పోస్తున్నది. కళ్లు విప్పి చూచేసరికి తనగదిలో చీకటే తానూ తప్ప మరెవ్వరూ లేరు. దాహం అవుతున్నది. శిష్యుడు భృంగిని పిలిచి అడుగుదామని కోరిక, గాని గొంతుకు పెగలడం లేదు. అట్టే స్మృతికి తెచ్చుకోగా, ఏదో స్వప్నం ఆయన్ని నిద్ర లేవగొట్టింది. అందులో దుస్స్వప్నం కూడాను. ఇంటిదగ్గర యెవరెవరు యెట్లా ఉన్నారో! తలచుకొన్నకొద్దీ ఆయనశరీరం నీరు విడిచినట్టయిపోతోంది. నీరసం ఎక్కువైంది. అసలీమధ్య ఆయన శరీరస్థితి ఏమీ బాగులేదు. మళ్లా గుండెజబ్బో, మరే జబ్బో, మునుపటికంటె కూడా చాలా లొగపానుగా ఉన్నది ఆయనదేహస్థితి. నడుములూ, కాళ్లూ, చేతులూ ఊ తెగలాగుతున్నవి. ఇంత ఉపచారం చేసిపెట్టడానికి, భార్యరుణం లేకపోలేపోయింది, ఆ కూతురైనా దగ్గరలేకుండా పోయింది. కొత్త, కాలూ చెయ్యి పట్టుమని భృంగిగాణ్ణి ఎంత బతిమాలుకొన్నా, రాను రాను వాడు రుసరుసలాడుతూ మూతి బిగించుకొని చక్కాపోతున్నాడు. ఎక్కడి గురువు, యెక్కడి శిష్యులు!!!

మనిషి క్రుంగిపోతున్నాడు. ఏదో పెద్ద బెంగ అలుముకొనిపోయింది. చావంటే సంతోషమూ లేదు, భయమూ లేదు. అవసానకాలం మిక్కిలీ సమీపించిందని ఆయన కెవరో చెవి నిల్లుగట్టుకొని చెదిరిస్తున్నట్టు భయం. ఓసారి బయటికి రావలసివచ్చి, మూలుగుతూ ముక్కుతూ తలుపుతెరచుకొని బయటికివచ్చాడు. కన్నూ కన్నూ కనిపించడంలేదు. పడమటిపట్టు పొలంలోని తాటితోపు జీబురుమంటూ ప్రపంచంలో గల అంధకారాన్నంతా తనలోకే పోగుచేసుకొంటోంది. మినుకుమినుకుమనే మిణుగురుపురుగులు స్వాములవారి కళ్లకి కొరివిదయ్యాల్లాగు గోచరిస్తున్నవి. ఏమూలనుండో రెండు గుడ్లగూబలు ఉం, ఉం, ఉం మ్మని హూంకరిస్తున్నవి. బయటపొలాల్లో మొర్రోఅని ఏడిచే నక్కలగుంపుకి, వీధిలో తిరిగే కుక్కల్లు ఆ స్థాయిలోనే బదులు పలుకుతున్నాయి. సృష్టియావత్తూ తనమీద కత్తికట్టినట్టు భయంకరంగాఉన్నది—స్వామికి! తల పైకెత్తి చూచేవరకు ఆకాశంలో నక్షత్రాలన్నీ ఒక్కసారిగా పళ్లికిలించి ఆయన్ని వెక్కిరించడం మొదలుపెట్టాయి. ఎవరు పంపించారో తీతువుపిట్ట ఒకటి తరుముకొనివచ్చి ఆయన్ని ఇంట్లోకి పంపివేసింది—

లోపల హాల్లో తగిలించిన గోడగడియారం టంగుమని ఒక్కటేగంట కొట్టింది.

గుండెలమీద చేతులు పెట్టుకొని వెల్లికిలా పండుకొన్నారు స్వాములవారు. ఏమిటో దీర్ఘాలోచన. ఎందుకో జుగుప్స. ఎందుకో పరితాపం... తనభార్యని అల్లుడు సరిగా ఆదరిస్తున్నాడో లేదో! కూతు రెట్లా ఉన్నదో! కొడుకులకేం — పెద్దవాళ్లయి సంపాదించు కొంటున్నారు. పాపం! ఆడపిల్ల ఒక్కతే కూతురు. తండ్రిని క్షణం విడిచిపెట్టి ఉండేదిగాదు. అల్లుడు బుద్ధిమంతుడే మరి. ఇల్లువిడిచి వచ్చిన ఆరంభదశలో అప్పుడప్పుడు కొన్నాళ్లపాటు అల్లుడు దగ్గరనుండి ఉత్తరాలు వస్తూఉండేవి. ఇటీవల ఏణ్ణర్థంగా ఆ ఉత్తరమ్ముక్కా లేదు. ఇంటిదగ్గర అందరూ బాగున్నట్టేనా! కూతురు క్షేమయినా పిల్లకాయలా??? ఔరా! తహశీల్ దారీ — సన్యాసం! బొందెమాత్రం గదిలో పడివున్నది; మనస్సుమాత్రం దేశదేశాలూ సంచారం చేస్తున్నది.

"వీల్లేదు. ఇప్పుడు వెళ్లడానికి వీల్లేదు." అని పక్కగదిలో భృంగికంఠధ్వని.

పరధ్యానంలో పడివున్న మనిషిని చీమకుట్టినట్టు ఉలిక్కిపడ్డారు..స్వాములవారు.

"బాబుగారూ! నాయనగారూ! ఒక్కమాట మాట్లాడి మళ్లా ఇప్పుడే వస్తాను.".

అని రెండో మనిషి కంఠధ్వని. చూడగా ఆడమనిషిలా వున్నదే! స్వాములవారి గుండెలు దడదడమన్నవి.

"అర్ధరాత్రేమిటి, ఆడమనిషేమిటి, స్వాములవారితో ఒంటరిగా మాట్లాడడమేమిటి?" అంటున్నాడు — భృంగి. స్వాములవారి నడుములు కరేలుమన్నవి.

"నేను పరాయిదాన్ని గాను — నాయనా! తెల్లవారితే పదిమందీచూస్తుండగా ఆయనతో మాట్లాడ్డానికి వీలుండదని, ఇట్లావచ్చాను. నేను వచ్చానని తెలిస్తే, ఆయన కాదనరులే—" అంటున్నది ఆమనిషి.

కంఠధ్వనిమాత్రం స్వాములవారి కింకా పట్టు చిక్కడంలేదు. గొంతుకలు బిగించుకొని సన్నగా మాట్లాడుకొంటున్నారు.

"అసలు ఆయన ఆడవాళ్లతో నేరుగా మాట్లాడరమ్మా" అంటున్నాడు — భృంగి.

"అయినా తప్పనిసరి వస్తే ఏంచేస్తాం. పోనీ నిన్ను అడ్డంపెట్టుకొని మాట్లాడుతాలే. నేను నేరుగా ఆయన్ని పలకరించనులే." అంటున్నది ఆమనిషి.

పక్కమీద కూర్చున్న స్వాములవారు జేకొక్కొంటూ గోడదాకా జరిగి గోడకి చెవి ఆనించి వింటున్నారు.

"నావల్ల గా"దంటున్నాడు - భృంగి.

"అట్లా అనకు నాయనా! ఆడదాన్ని కాస్త కనికరించకుంటే ఎట్లా? ఆయనకోసం తిరిగితిరిగి అంత దేశంనుండి వెతుక్కొంటూ వచ్చాను. ఆ నారాయణ మూర్తి నాకు చావు పెట్టాడుకాదు. వల్లరాయి బద్దలైనట్టు బద్దలైపోయాడు అల్లుడు. పసికూన — ఆకూతురుకీ, నాకూ దిక్కు లేక ఇట్లాపడివచ్చాను..." అనికంట నీరుపెట్టుకొంటోంది ఆమనిషి.

భరించుకోలేని దుఃఖం అణచుకోలేక పైకి బావురుమని ఏడిచింది ఆ యిల్లాలు. ఆ యిల్లాలు తన యిల్లాలే అని తెలుసుకొన్నారు — స్వాములవారు.

క్రిందభూమి పాతాళంలోనికి దిం చు కొ ని పోతోంది. "శుభంమల్లె ఈ ఏడుపేమిటిదమ్మా — అర్ధరాత్రిపొద్దూ" — అంటున్నాడు — భృంగి.

"ఆస్తిలో భాగం పంచిపెట్టి, మాభాగంయిల్లు మాకుస్వాధీనపరిస్తే మేము ఇంతకాచుకొంటూ బ్రతుకుతామని కాళ్లావేళ్లాబడి ఏడిచినా, ముండామోసిన ఆడదానికి ఆస్తిలో భాగం ఎక్కడిది? మనవర్తిడబ్బులిస్తాం — బ్రతకండని, మెడబట్టి బయటికి నెట్టారు మమ్మల్ని, ఆపిల్ల అత్తింటివాళ్లు. ఎవరితో చెప్పుకోను నాయనా." అని ఏడుస్తోంది - భార్య.

"నాతో చెప్పుకొంటే నేను ఆర్చేవాణ్ణా, తీర్చేవాణ్ణా? ఆస్వామి నాశ్రయించి, సన్యాసం స్వీకరించాలని లేచివచ్చిన బ్రహ్మచారి ముండావాణ్ణి. నాకెందుకీ దిక్కుమాలినపోడు — " అంటున్నాడు భృంగి—

పైకిధ్వని కాకుండా జెరువచీర ముక్కు

"నిజమే నాయనా. కడుపార కన్నతండ్రి ఆయనకే లేకపోయిన తర్వాత పరాయివాళ్ల కేంకాబట్టింది? ఎవ రెట్లా పోతే ఆయన కెందుకు ? టింగురంగా అని సన్యాసం తీసుకొని పప్పుగప్పుళాలు భిక్షలు చేసుకొంటూ తిరుగుతున్నాడా పెద్దమనిషి..." అంటున్నది భార్య.

"ఆ! ఆ! అట్లా అనకూడదు. కళ్లు పోతాయి." అంటున్నాడు భృంగి.

"మా కిద్దరికీ ఇంతవిషం గొంతుకలో పోసి సన్యాసం తీసుకొంటే, ఆయనకీ మాకూగూడా ఈ తిప్పలు లేకుండా పోయేవి. ఎంతమంది ఉంటేమాత్రమేమి — సవతికొడుకులు సవతికొడుకులే —" అని ఏడుస్తూ చెపుతున్నది భార్య.

"నీవిట్లా ఏడవబోకమ్మ బయటకిపదు. నిండింట్లో ఏమి టీ ఏడుపు?" అని కసురుకొంటున్నాడు. — భృంగి.

స్వాములవారు గోడకి జేర్లబడి కొయ్య అయిపోయారు.

"అట్లా అనకు నాయనా! నాకంటె చిన్నవాడివైనా నీకు దణ్ణం పెట్టుకొంటా. కడుపులో బాధ ఆయనతో చెప్పుకుంటే సగం తీరుతుందని వెతుక్కుంటూ వచ్చాను. మాకేమో లోకులవల్ల కొన్ని బాకీలు రావలసి ఉన్నవని విన్నాను. అదస్తా వేజులూ, కాగితాలూ ఆయన ఎక్కడ దాచిపెట్టాడో ఎంత వెతికినా అగుపించనే లేదు. పసిబిడ్డ ఇరవై ఏళ్లయినా నిండకుండా తలచెడి ఇంట్లో పడిఉన్నది. పిల్లాపాపా లేరుగదా, ఆ పిల్లకి మళ్లా పెళ్లిచేసి పంపేస్తే, దానిమానాన అది సుఖంగా బ్రతుకుతుం దని, సవతి అన్నగార్లు పట్టుపట్టి కూర్చున్నారు. రాత్రింబగళ్లు, నాన్నో, నాన్నో అని కంటికీ మింటికీ ఏకధారగా ఏడుస్తూ కూర్చున్నది— ఆపిల్ల. ఒక్కసారి ఆయనకళ్లబడితేనేగాని దాని ప్రాణం నిలిచేటట్టు లేదు. ఏమి చెప్పుకోను నాయనా—నా సొద నీవు దయపుంచకపోతే..." అని భార్య ఏమిటో అనబోతూ ఉండేవరకు,

"భృంగీ!—" అని వెర్రికేక పెట్టాడు స్వాములవారు.

"స్వామీ" అని మనోజవం మారుతతుల్యవేగంతో ఎదుట చేతులు కట్టుకొని వ్రాలాడు భృంగి. చేతలాంతరు దీసుకొని అతనివెంటనే వచ్చినభార్య,

"నాకు భిక్ష పెట్టండి స్వామీ"

అని గోడకిజేర్లగిలబడి కూర్చున్న స్వాములవారి పాదాలమీద పడేవరకు, ఆయనదేహం ఆమె చేతులకు చల్లగా తగలడం, ఆకాశంలో ఓనక్షత్రం పవమటగా జర్రున జారిపోవడం, రెండూ ఏకకాలమందే జరిగిపోయినవి—

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః—



# రతివిలాపము

శ్రీ గుఱ్ఱం వెంకటసుబ్రహ్మణ్యం

అవల విమోహాపరాయణ
వివశాంగి సుమాస్త్రుకత్ని విధి తాఁ జేర్చెన్
నవవైధవ్యము నిర్భర
మవువేదన మామె కంత నాపాదింపన్.

నవజోణి తేఱి విచ్చెడు
కనులను హెచ్చరికగొల్పె గ్రహియింపదువో
తనివోవని యా కనులకుఁ
దనచెలువుం డతివిలుప్తదర్శనుఁ డౌటన్.

'జీవముతో నున్నావే
జీవేశా' యనుచు లేచి క్షితిపై నెదురన్
భావించెఁ బూరుషాకృతిఁ
గేవల మా హరరుషాగ్నికృతభస్మంబున్.

కడు బెగ్గిల్లుచు వెండియుఁ
బుడమిఁ గవుంగిలుటఁ జనులు బూడిదనొరయన్
విడివడ నలకలు, వనమున
కిడునా సమదఃఖ మనఁగ నిట్లని యేడ్చెన్:

ఎల్ల విలాసుల కుపమగఁ
జెల్లిన నీ మేని కిట్టి స్థితి గల్గె నయో!
పొల్లయ్యె నట్టి కాంతియు,
ఛెల్లిన నే వ్రయ్య, స్త్రీలు భిదుఃరకతోరల్.

నేతుంక్షతికృతి జలసం
ఘాతము నళిని నెటు లటుల క్షణభిన్నరతిన్,
నీ తోడిదె ప్రాణం బగు
నాతి నెటుల్ వైచి పఱచినావు ఝషాంకా.

నా కప్రియ మొనరింపవు
నీకును మఱి విప్రియమ్ము నే నొనరింపన్;
ఏకతము లేక యేలొకొ
యీ కుండెను దర్శనంబు నేడ్పెడు రతికిన్.

తలఁచెదవో నినుఁ గట్టుట
మొలనూళ్లన్ బేరుదప్పి మున్ ననుఁ బిలువన్?
తలఁతువొ చెవికలువల వ్రే
టులఁ బుప్పొడి నీకనులఁ బడుచు నొవిడుటల్

కాపుర మున్నా వెద నను
నీ పలు కది కైతవమ్ము, నిశ్చయ మగు నే
నీ పగిది నీ వనంగుఁడ
వేపాటును లేని రతియు నెటులుండు టగున్.

పరలోకమ్మున కిప్పుడె
తరలిన నీ పదవి యనుగతమ్మగు నాకున్;
స్మర! వంచించెను జనము
న్వారించి, దేహి సుఖయాట నీచేతఁ గదా.

రజనీతిమి రావృతపురి
విజనపథిన్ జలదనినదవిక్లబలను దో
యజనేత్రల నెవఁ డొపును
నిజరమణునివసతిఁ జేర్ప నీ వొకఁడు వినా.

అరుణాక్షులు సుడియఁగఁ ద
త్తరపడఁ బ్రమదలకుఁ బదపదమ్మున మాటల్
కర మొప్ప సురామద మను
[illegible]

ప్రియబంధుని నీవపు విటు
క్షయమయ్యెనటంచు దెలిసి, చంద్రుఁడు విఫలో
దయుఁడై, యింతకు బహుళము
వ్యయమయ్యు, ననంగ! యెట్లో వదలును
దనుతన్.

హరితారుణబంధనమై
వరపూరుషకోకిలాలపనసూచితమై
యరుదారు మావిక్రొన్నన
శర మెవ్వరి కిప్పుడొను స్మరియింపఁగ దే.

స్మర! పల్మఱు విలుగుణకృతి
నెరవేఱుచు నళులపంక్తి నీయది యిదిగో
కరుణాస్వనవిరుతమ్ముల
గురుశోకను నన్నుఁగూడుకొని యేడ్చు బలే.

ప్రియ, వెండి రమ్యవపువును
రయమునఁగైకొనుచు లేచి, రతిదౌత్యములన్
నియమింపు కోకిలాంగన
నయమధురాలాపనైజనైపుణ్యవతిన్.

నాయుడుగుల శిరసావహు
నీయాజ్ఞలు, వణఁకుతోడి నీకౌగిళులున్,
నీయా యేకాంతరతుల్,
కాయజ, స్మరియింప శాంతి గలుగదు నాకున్.

నామెయి నీ విరచించిన
యామనిపూలకయిసేత యలరారు నిదే,
కామకళాకోవిద నీ
యా మోహనవపుమాత్ర మగపడ
దయయో.

దేనిం గైసేయుటలో
ధ్యానింపంబడితొ క్రూరు లల విబుధులచే,

ఆనా యూవామపుఁబా
దానం బారాణిఁబూయ దయసేయఁగదే.

సురకామినీజనము దివి
సరసలు నిన్ను వలపింపఁ జాలకమున్నే
యరుదెంచి, ప్రియ, పతంగపు
సరణిన్ నీయంక మిపుడె శరణము గొనెదన్.

మదను విడిచి రతి బ్రతికెను
గద క్షణమాత్రమను నిందకాంతుఁడ! నాకున్
గుదురుకొనియె లోకములో
నిదె నిన్నే నిట్టు లనుగమించుచు నున్నన్.

పరలోకాంతరితునకును
జరమాలంకృతిని నీకు సవరింతు నెటుల్ ?
అరుదుగ నీ వవిచారత
శరీరజీవముల వెంట సమముగఁ గొనుటన్.

విలు నంకసీము నిడుకొని
యలుగున వంకలు దొలంచు చామనితో న
వ్వెలయఁగ భాషించెడు నీ
యల నయనాంతావలోక మాత్మఁ దలంతున్.

సూనాయోజితధను వౌ
నీ నేయుఁడు హృద్యుఁడామని, యతండెటనో?
కానఁడుగా చెలిగతినే
తానును ఖరరోషుఁడైన స్థాణునివలనన్.

తతవిలపనాక్షరము లవి
మతిఁగాడఁగ విషవిలిప్తమార్గణములు నా
రతి నాతుర నోదార్పఁగ
హితుఁడు మధుండంత తానె యెదురన్ దోచెన్

అతనిం గని బిట్టేడ్చుచు
రతికుచములు నొవఁగా నురము బాదుకొనెన్

వెతకుఁ వాఁకిలి దెఱచెదు
వితముగదా బంధుజనుని వీక్షించు టనన్.

పలవించె వెండి యి ట్లని—
వెలిమిడి గను చైత్ర! చెలిమి విల్చిన దిదియే
కలరవశబలము దీనిని
కలయఁగఁ బవనము పొడిపొడిగా విరజిమ్మెన్.

ఇమ్మెయి యిప్పుడు దర్శన
మిమ్మథుఁ డుత్కంఠితుండు హృదయజుఁ డా, ప్రే
మమ్ము ప్రియుల నస్థిరము, స్థి
రమ్మగదా సఖులయెడ ధరఁ బురుషులకున్.

అసురామరలోకము కై
వసమైనది, మదన! పార్శ్వవర్తి యితనిచే,
బిసతంతుగుణము పేలవ
కుసుమశరమునా త్వదీయకోదండమునన్.

అనిలాహతదీపమువలెఁ
జననేచనె మరలిరాఁడు సఖుఁ, డిరయుమ న
న్నా, నశక్యదుఃఖధూమ, న
తని వత్తిని, నిట్టు లున్నదాని, వసంతా.

నను వదలి కాము వధియిం
చినవిధిచే నగము కొలఁదె చేయంబడియెన్;
అనపాయిని సంశ్రయ మను
కొనువృక్షముఁ గూల్ప గజము, కూలదె
లతయున్.

కావునఁ జేయంగదవే
యావలి బంధుజనకృత్య మామనిరో, నా
కీవే హవ్యవహంబును,
వే వరుసంతికముఁ జేర్పవే నను విధురన్.

చందమామతోడఁ జనుఁగాదె వెన్నెల
మబ్బుతోడ మెఱపు మాయుఁగాదె

మగనియనుసరణమె మగువల కౌ నని
అల్పచేతనముల కైనఁ దెలియు.

నవురగు నీప్రియుగాత్రం
పువెలిమిడిని కుంకుమట్లుఁబూసి కుచములఁ
నవపల్లవతల్పముపైఁ
బవళించు వితానఁ జిచ్చుపైఁ గను వుంతున్.

నలుపవె మా కిరువురకును
బలుమఱు చెలికార మలరుపాన్పున, నిపుడం
జలి చేసి మ్రొక్కి వేఁడెద
నలయక చితి నాకుఁ జేర్పవయ్యా, సౌమ్యా!

ఆవెన్క దక్షిణానిలు
వీవుము, నామీఁదివహ్ని విరియింపు వెసన్;
నీ వెఱుఁగవె, క్షణ మోర్చునె
పూవిల్తుఁడు నేను చెంతఁ బొలువన యేనిన్.

జరిపి యిటు, జలాంజలి మా
కిరువురకొక్కటిగ నొసఁగుమీ, యాజలమున్
పరలోకమందు నీచెలి
హారువుగ ననుఁగూడి త్రావు నవిభక్తముగన్.

పరలోకవిధుల మాధవ!
మరునకుఁ జలపల్లవాగ్రమమంజరు లిమ్మా;
అరయుదె హేతువు, మామిడి
విరులుగదా నీదుచెలికిఁ బ్రియతమ మెన్నన్.

ఒడలు ద్యజింపఁగ నివ్విధిఁ
గడఁగిన రతి గగనవాణి కరుణించెఁ గడున్;
మడు గెండ స్రుక్కి జెడిన
పడఁతిని గరుణించు ప్రథమవర్షముకరణిన్.

కందర్పపత్ని, నీపతి

బొందెనో హరనయనానల
మందున శలభత్వమాత్రఁ, డయ్యెది వినుమా.

ఇంద్రియమ్ములఁ బ్రేరించి హృదయజుండు
వలపుగొలిపె స్వసుత సరస్వతిగుఱించి
అలప్రజాపతి, కతఁ డంత నావికార
మణఁచి శపియింప నీ ఫల మందె మరుఁడు.

పార్వతీతపమ్ము ప్రవణీకృతునిఁ జేయ
నామె నెపుడు పెండ్లి యాడు హరుఁడు
అపుడు సుఖవశాత్ముఁ డాతఁడు గూర్చెడు
మరుని వపువుతోడ మరల ననుచు.

స్మరునిశాపావసానమ్ము సరగఁ జెప్పె
బ్రహ్మదేవుండు ధర్మసంప్రార్థనమున;
పిడుగు వైవఁగ నమృతమ్ము నిడఁగఁ జాలు
నీరదము లెట్టులో జితేంద్రియులు నట్లె.

కావునఁ బ్రోవుము శోభన!
భావిప్రియసంగమంపుభాజన మగునీ
యీ వపువును, రవి జలమును
ద్రావఁగ నది వెల్లినిండదా మరలఁ బిజేన్.

ఆరతి మరణోద్యోగము
నీరీతి నదృశ్యభూత మేదో మాన్పెన్;
మారునిచెలికాఁడును నో
దారిచె నది నమ్మి హితపదమ్ముల నామెన్.

ఉరుదుఃఖకార్శ్య స్మరసతి
పరమోపప్లవసమాప్తిఁ బ్రతిపీక్షించెన్
గిరణాక్షయధూసరవా
సరశశితనురేఖ రాత్రిసమయమును బలెన్.

---

# ఆ రా ధ న

"జీవనప్రభాత"

## ఇందు వచ్చు పాత్రలు

| | | |
|---|---|---|
| సీమంతిని | — | దేవదాసి |
| శర్మ | — | పూజారి |
| హరినారాయణ | — | బ్రాహ్మణుడు |
| రామణి | — | బ్రాహ్మణి |
| శివగురుడు | — | శూద్రుడు |
| ఆత్మారాముడు | — | అంటరానివాడు |
| పద్మనాభుడు | — | వృద్ధపౌరుడు |
| మహమ్మదీయుడు | — | |
| క్రైస్తవుడు | — | |

### రంగము : ఒకటి

[ఆలయప్రాంగణము—ఆలయ ద్వారమువద్దకు సీమంతిని పూజాద్రవ్యములతో ప్రవేశించును:]

సీమం : హరినారాయణు డింకనూ రాలేదు, స్నాన సంధ్య లింకనూ పూర్తికాలేదు కాబోలు.... పూజారి పూజలో మునిగివున్నాడు. . .అదంతా ఒకరకమైన దీక్ష—దీక్షలో వున్నట్లు నటన—నటన కనువగు వేషము — వేషమునకు తగిన పాత్రత ! ... నే వచ్చినసంగతి తెలిసికూడ, కావలకు రాడు కదూ ? ......

(ప్రవేశము: హరినారాయణ)

.... ఆఁ - వస్తున్నారు. (కొంచెము ముందున కేగి) స్వామీ ! నమస్కారాలు దయచేయండి.

హరి : (చేయెత్తి) దీర్ఘసుమంగలీభవ !

సీమం : మీలాటి పెద్ద లిందరు సుఖులై యుండగా నాకేమి భయము ?—నా మాంగల్యాని కేమి భయము? ...ఏదో తమదయ వుండవలెను గాని!

(ఆమె లోనికి పోబోవుచుండ – ఆమె తల నుండి పువ్వు నొకటి నేల జారును.)

హరి : ఓహో ! సీమంతినీ ! ఆగు – ఆగు. పువ్వులు తలనుండి జారిపోతున్నాయి. పచ్చనిపువ్వులు నేల బడరాదు.

(ఆమె నిలచును. అతను ఆమెతలలో పువ్వులు ముడుచును.)

సీమం : పూజకు వేళ మీరింది. పూజాద్రవ్యములు అందించవలెను. అప్పుడే బాలభానుడు చెట్ల మాటునుండి గగనాని కెగబ్రాకుతున్నాడు – వేగము పోవలె.

(వెడలు చుండును.)

హరి : సీమంతినీ ! ఒక్కమాట – వెళ్లవచ్చునులే ! —అయ్యో ! నామాట వినవూ ? (మెల్లగా) నా ఆరాధన గైకొనవూ? ......నీకు పూజారి

శర్మ బాగా వచ్చేడు కాబోలు, వాడు పట్టి పసు వని నీకు ఇంకా. బాగా తెలియదు ... అబ్బ - సీమంతినీ ! ఇటు ఒక్కమాట — ! (ఆమె వచ్చును.) ఆఁ — అలాగ పిలిచి నప్పుడు రావాలి. ఇప్పుడు నవ్వంటే నా కెంతో ముద్దు - గౌరవమూను.

సీమం: అట్టే వాగకండి. శర్మగారు వినగలరు - ఆ ప్రక్కనే వున్నారు.

హరి : కొంపతీసి — వినలేదుకదా ?

సీమం : లేదు లెండి. వినగలరని ముందే చెప్పేను. ఇంక వెడతాను .... ఆరాధన వేళమీరింది. తర్వాత పావకాశంగా మాట్లాడుకోవచ్చును.

(నిష్క్రమణ.)

హరి : (ఆమెవైపే చూచుచూ...) ఎంతటి దానవే-! — జారిపోయింది — ఇంతకీ సమయం తప్పి పోయింది...సీమంతినీ! ఆ ఆరాధనకు వేళమీరు తుందా? నా ఆరాధన యింకెప్పు డంగీకరి స్తావూ? సరేనయ్యా — రేపు, ఉత్సవం నాటి రాత్రి నాకు నువ్వ దొరకనేదొరకవా? ఎలా గయినా — అదే మంచిసమయంలే!

(ప్రవేశము — పూజారిశర్మ)

...నమోనమః.

శర్మ : నమోనమః. సీమంతినీ! సీమంతినీ! ఆరాధనకు వేళ మీరింది... ఇది ఎక్కడకు పోయిందో!

హరి : ఎవరూ? — సీమంతినా? — ఇలాగ వెళ్లిందను కుంటాను; ఇందాకా వెళ్లిం దదేకాబోలు...

శర్మ : (సంశయంతో) ఇక్కడికి వచ్చిందేమిటి?

హరి : చిత్తం — అచ్చేరాలేదు...చిత్తం - దేవదాసీ జనం అంతా క్షేమమేకదా ?

శర్మ : వాళ్ల కేమండీ? — సాక్షాత్తూ దేవదేవుని సేవ చేసే దేవదాసీలు; వాళ్లు దేవునిపరంగా జన్మిం చినవాళ్లు — కళాదేవి అవతారాలు...వాళ్ల క్షేమాని కేమిలోపము?

హరి : ఏదో — తమ దయ వుండవలెనుగాని—

(శర్మ వినిపించుకోననట్లు నటిస్తూ వెళ్లిపోవును)

హరి: ఓరి! ఏంవేదాంతం చెబుతున్నావురా!!...చేసేవి శివపూజలు, దూరేవి దొమ్మర గుడిసెలు—! ఇంతకూ, నీ రాజ్యము సాగుతోంది - ఏలుకో! ఏలుకో!... ఈ దేవదాసీజనమునీది - ఈదేవా లయము నీది - ఆకనబడే సముద్రము నీది - ఈ లోకమే నీది...అన్నీనీవే!...దేవుడికంటే అధి కుడవు — పూజారీ! లోకాన్నుద్ధరించుటకూ, లోకానికీ దేవునికీ మధ్య రాయబారాలు జరుపుటకూ, లోకుల కష్టసుఖాలు వినయ విధేయతలతో వినుటకూ — ఈభువి నవతరిం చేవు!...నీకుపుట్టుకతో వచ్చిన ఆహోదాకు, తెచ్చిపెట్టుకున్న పాండిత్యగౌరవం అలంకార ప్రాయంగా వుంది...

[అడుగులు తడబడుతూవుండ, జడుపుతో నలు దెసలూ పరికించి చూస్తూ, ఆత్మారాముడు ప్రవేశం.]

గంట గణగణ మంటోంది, ఆరాధన ఆరంభ మయింది......నారాయణ — నారాయణ ! హరహర శంభో శంకర!!

(నిష్క్రమణ)

ఆత్మా : అమ్మయ్య! ఎంతదూరం! ఎన్నిక్రోసులు! ఇప్ప టికి — నాతండ్రి మందిరంలోనికి వచ్చేను - నారాజా — నాదేవుడు — అదుగో!

ఆ ఆలయంలో వున్నాడు...ఎన్నాళ్లకి నా స్వామిని సమీపించగలిగేను — వేలప్రజలు ఇక్కడికి వస్తారు—దర్శనం చేసుకుని వెడ తారు. వాళ్ల పాపాలు పోతాయి...నాదేవుడి పాదాలమీద యీ ప్రాణాలు వదులుతాను...

(ప్రవేశము : రామణి)

(ఆత్మారాముడు సహజభయముతో తొలగి నిలబడును.)

రామణి : ఎవరువోయీ ?

ఆత్మా : (తడబడును)

రామణి : (కోపముతో) ధంరాలుడా ! ఛీ ! ఛీ ! పో అవతలికి పో...పోవేమి? [illegible]

ఏరా — ఇటువంటి పవిత్రస్థలంలో అడుగు పెట్టడానికి ! నీ కేంపోయేకాలం వచ్చిందిరా ! అయ్యో ! అయ్యో ! ఎంతఖర్మమోయి దేవుడా!నీకెంతటి అవస్థపట్టిందోయి నాయనా!

ఆత్మ : అమ్మా ! (కంపితస్వరములో) అమ్మా !

రామణి : ఛీ ! పాపీ ! నన్ను అమ్మా అంటావురా ?— నీనోటి కేంవచ్చిందిరా...అయ్యో ! ఈపవిత్ర స్థలం అంతా మయిలపడిపోయింది, ఇంకెలాగ దేవుడా ?—ఓరి ! ఆలయంలోనికి వచ్చేవారికి ఆటంకంగా ఇంకా అక్కడ నిలబడతావేమిరా ? కదలివెళ్లు - లేదా గెంటింపిస్తాను...

(దారిపొడుగునా వీర్లు చిలుకరిస్తూ ఆలయములోనికి నిష్క్రమించును)

ఆత్మ : అయ్యో దేవుడా ! నాప్రభువు ఆలయంలోనికి ప్రవేశించడానికి నాకు అర్హతలేదా ? దేవుడా! నిన్ను చూద్దామని ఎన్నోవందల క్రోసులదూరంనుంచీ వచ్చేను—నిన్నునే చూడకూడదా?

(ప్రవేశము : హరినారాయణ)

హరి : ఓరీ !—ఎవ్వరా అది ? ఎవడవురానువ్వు ? ఆరాధనకు వచ్చేవారిని ఆటంకపరుస్తున్నావట— నీ కెవ డిచ్చేడురా అధికారం ?

ఆత్మ : (గజగజవణకుతూ—అమాయకముగా—) నా దేవుడు ... బాబయ్యా ! నాదేవుడు — అదుగో—!

(ప్రవేశము : శివగురుడు)

శివగురుడు :

రామాపతే—సీతాపతే,
గంగా జటా జూట - గౌరీపతే.

హరి : నీదేవుడా ! నీదేవు డెవడు ? నీకూ దేవుడేనా ? ఛండాలుడా ! నీకూ వీడే దేవుడైతే— ఈదేవుడుకూడా ఛండాలుడే అవుతాడు !

శివ : హరహర ! ఛండాలురు దేవాలయం ప్రవేశించేటందుకు ప్రయత్నిస్తున్నారా ? ఆహా ! కలికాలం !!

ఆత్మ : అన్నికులాలవారూ వస్తున్నారు. నాకేనా ఆటంకం ?

హరి : నీ ఛండాలకులానికే ఈగతి పట్టింది...త్వరగా దయచెయ్యి—

శివ : లేదా నేను చెయ్యి చేసుకోవలసి వస్తుంది. ఆ తరువాత స్నానమూ తప్పదు.

హరి : కదలు – కదలు – అదుగో అర్చకులవారు వస్తున్నారు. ఆ తరవాత నిందల పడగలవు — వెళ్లిపో—

ఆత్మ : అయ్యో ! నాదేవుడు—అయ్యన్ని చూడనీయండి—నాదేవుడిని చూడనీయండి – నాపాపాలను పోగొట్టుకోనీయండి.

(ప్రవేశము : పూజారి శర్మ)

శర్మ : పాపీ ! పాపం చేసుకున్నావు కాబట్టే ఈ జన్మలో ఈ పాప మనుభవించు. ఈ ఛండాల జన్మ నీకు విధి వ్రాశాడు. ఈ 'విధి వ్రాలు త్రిప్పగా నెవరితరము?'—ఆరాధనకై అనేకులు వస్తున్నారు. వారికందరకూ ఆటంకముగా నుండకు. ఆరాధనకు వచ్చువారి నాటంకపరచినందులకు ఆ దేవదేవునకు నీమీద ఆగ్రహము కలుగును. ఈసంగతి ప్రజలు మహారాజునకు విన్నవిస్తారు. వారు నీకు మరణదండన విధిస్తారు—

హరి : కాబట్టి — ఇక్కడ రాజదండనకూ, అక్కడ దైవదండనకూ గురి కాక రెంటినుండీ తప్పించుకో – వెడిపోకు. అదుగో బ్రాహ్మణులు వస్తున్నారు. ఎవరైనా ఈ సంగతి కన్నా, విన్నా మా గౌరవమేనా మాకు దక్కదు. మంచిగా ఇక్కడనుండి వెళ్లిపో—! మాకు మహోపకారము చేసినవాడ వవుతావు.

ఆత్మ : అయ్యా! మరి – నాదేవుడు? — నాదేవుడు? నే చూడవద్దా నా దేవుణ్ని ?

(ప్రవేశము: పద్మనాభుడు)

పద్మ : హరహర! శంభో! — ఎంతగతి! ఎంతటి దుర్దశ పట్టినది — ...

మసలుతూ వుండగనే — ఇంతటి చేటుకాలము కదా! — ఆశ్చర్యమేమిటి? కలికాలమోయీ! కలి - కలిమహిమ! ఏదిక్కున చూచినా కలి సముద్రము ముంచుకొని వస్తున్నది — ఈకలి రాజ్యములో ఆచారమూ, అనాచారమూ — అన్నీ ఒకటే!...నాయనా! తప్పుకో—తప్పుకోవోయీ— అలాగ వెర్రిగా - పాపం! అమాయకుడిలాగ చూస్తావేమిటి?...తప్పుకో! నన్ను లోనికి పోనియ్యి. ప్రాయశ్చిత్తానికికూడా వీలు లేకుండా — ప్రపంచమంతా — శెత్తైదుస్థలమయినా లేకుండా — చీడ పురుగులలాగ ప్రాకిపోయేరు మాలలు! మా కాలంలో ఆవడ దూరంలో నిలచుని వుండేవాడుమాల! మాలల కాలమోయీ! ఇది మాలల రాజ్యమోయీ!

(లోనికి పోవుచుండును.)

శర్మ : (కోపముతో) ఓరీ! నీవు కాదా తెలిపేది? బ్రాహ్మణుల కందరకూ - ఎంతటి ఆటంకం కలిగిస్తున్నావురా? ఇంకా పోవేమి? మిగిలి వున్నవారినికూడ మయిలపరచేవరకూ కదలవా యేమి?

హరి : వీళ్లకి శాస్త్రప్రకారముగా ప్రాయశ్చిత్తములు చేయించుకూ వుంటేనేగాని బుద్ధులు రావు స్వామీ! వాడిని దేశాన్నుంచి బహిష్కరించాలి. కులంవాళ్లచేత వెలివేయింపించాలి....

ఆత్మ : బాబూ! నే నేం తప్పుచేశాను? నే నెవ్వరినీ ఏమీ అనలేదే! ఇక్కడ దూరకే నిలచున్నానుకదా—

శర్మ : ఇక్కడ నువ్వు నిలవనేకూడదు. అసలు ఇక్కడకు నువ్వురానేకూడదు. అదే నీతప్పు.

ఆత్మ : అయ్యో! నేరానేకూడదా? నేనిక్కడనిలవనే కూడదా? నేనిక్కడుండుటేతప్పా?...... నే రానేకూడదా?—ఎందుచేత స్వామీ? నేను మాత్రము మీలాటి మానవుడనుకానా?

శర : మాలాటివాడ వెలా గవుతావు? మేము బ్రాహ్మణులము—మాది పవిత్రకులము; అగ్రజాతి. ఇది పూజామందిరము దేవుని నిలయము; పరమ పవిత్రస్థలము. నీజన్మ ఛండాలజన్మ—పరమ నీచుడవు. నీ వీ పవిత్రస్థలమును తాకనైననూ తాకకూడదు.

ఆత్మ : ఎందుచేత? నేను మాల నైనంతమాత్రాన నీచుడనా? అట్లయితే నే నీ మాలగా ఎందుకు జన్మించితిని?

శివ : ఓయి వాజమ్మ! వాగుడుపోటీకి రాక త్వరగా పో — నీవాగుడూ, నీధర్మసందేహాలూ వింటే నాకే నవ్వువస్తోంది. అయినా నీ పిచ్చి సంభాషణ వినడమువలన నాకు పుణ్యమా? పురుషార్థమా?

(నిష్క్రమణ.)

శర్మ : శాస్త్రములు చెప్పటను బట్టి— గత జన్మయందు నీ చేసిన కర్మమునుబట్టి, ఈ పాడు జన్మయందు పుట్టితివి. నువ్వు పాపివి. మీ కులమువారందరూ పాపులు కాబట్టే మీ కులము అంటరాని దయినది. వెనకటి పాపమునకు ప్రాయశ్చిత్త మనుభవించాలి—తప్పదు.

ఆత్మ : అయ్యో! తెలిసీ తెలియక వెనుకటి జన్మలో పాపమో పుణ్యమో చేశాము—ఆ పాపాలకు ప్రాయశ్చిత్తమా యిది? ఈ జన్మలోనైనా కొంచెము పుణ్యము చేసుకొననీయండి—దేవుని ప్రార్థించుకొననీయండి—వచ్చే జన్మలోనైనా —కొంచెము మంచికులములో పుట్టగలుగుతాను...మీరు చెప్పినట్లు అంటరానివాడనే— నా దేవుడిని పూజించుకొననీయండి.

శర్మ : నీకూ దేవుడికి సంబంధము ఏ మాత్రమూ లేదు. ఇక్కడ దేవుడిని ప్రార్థించకూడదు. వేదవాక్కు మీ చెవుల పడనేకూడదు, పూజ మీ కంట బడనేకూడదు ... ఇక్కడ నీకు దేవుడేమిటి? నీకు దేవుడేవుంటే—అధమపక్షం— శూద్రకులజుడవైనా అయ్యేవాడవు.

ఆత్మ : బాబూ! అన్యాయం చేసేడండి — దేవుడు నాకు అన్యాయం చేసేడండి.

(ప్రవేశము : సీమంతిని)

సీమం : దేవుడుకాద య్యా అన్యాయం చేస్త—దేవుడు వట్టి అమాయకుడయ్యా—ఆ అమాయక దేవుడిని సృష్టించిన మానవులయ్యా-నీకు అన్యాయం చేస్త—అన్నీ తెలిసికూడా తెలియనట్లు ఊరకుంటాడయ్యా దేవుడు!

శర్మ : (కోపముతో) సీమంతినీ!—నీకు దేవాలయ ప్రవేశము ఈజన్మలో లేదు. నీకు దేవుడు లేనట్లే—

హరి : ఊఁ—తెలిసిందా? నీకు దేవుడు లేనట్లే! దయచెయ్యి—నీకర్మ అనుభవించు!

ఆత్మ : నాకు దేవుడు లేడా? ఇందరు మానవులకు వుండి—నాకుమాత్రము దేవుడు లేడా?— నా కర్మ — నేను పాపిని.

(విచారముతో, దీనదృష్టులతో వెడలి పోవుచూ)

దేవుడా! నాకునువ్వు లేవని అందరూ అంటున్నా నామనస్సుకి నువ్వు వున్నావు. నిన్ను చూడలేకపోయినా - ఇక్కడనుంచే నీకు దణ్ణం పెడుతున్నాను—దేవుడా నువ్వు నాకున్నావు. నీపాదాలదగ్గర నాప్రాణాలు వున్నాయి.

(మెల్ల మెల్లగ నిష్క్రమణ)

హరి : శని వదలివది.

శర్మ : ఈ పాడుదెయ్యము వదలినట్లు కనపడదు.

సీమం : ఎంతగా ఏడుస్తున్నాడో! ఎంతటి భక్తుడో కదా! భక్తులహృదయాలను నొప్పించి ఎంతటి పాపము కట్టుకున్నారో! దైవభక్తికీ, కులముకూ - సంబంధ మేమిటో!

శర్మ : (నవ్వుచు) ఓహో! సీమంతినీ! నువ్వుకూడ ప్రవక్తగా తయారవుతున్నావు కాబోలు....

సీమం : మీలాంటి పండితులు శాస్త్రాలకు తీసే అర్థాలను విమర్శించేటందుకైనా తయారవాలి.

శర్మ : ఇంక శాస్త్రాలుకట్టిపెట్టి సరసాలలోకి దిగితే బాగుంటుంది.

హరి : (భయముతో) నే నుండగానే (వెనక్కు తగ్గుచుండును.)

సీమం : ఆభక్తుడికి పాదాలమీదపడితే చాలు మనకందరికీ పుణ్యము వస్తుంది.

(పోవుచుండును)

## రంగము : రెండు

[ఆలయములోపల : కోపముతో సీమంతిని ప్రవేశము]

సీమం : వ్యభిచారము - అన్యాయము — అసత్యము—దురహంకారము - ఈర్ష్య - కోపము...అన్నీ కలసిన కూడలి - ఈ దేవాలయము! ఏస్థానమైతే పరమపవిత్ర మయినదో — ఏ క్షేత్రము సన్మార్గమునకూ, సత్యమునకూ మార్గమో - అదిరే అన్ని దౌష్ట్యాలకూ నిలయము...పూజారి! పరమపూజ్యస్థానము వహించవలసిన పూజారి—జారుడు. దేవదాసీమనోహరుడు! ... ఇది దేవదాసి కాదు—పూజారిదాసి! దేవాలయ ప్రవేశికుల పాదదాసి!...అందువలననే — ఇంతటి చెడుప్రదేశ మిది కాబట్టే —అమాయకుడూ, భక్తుడూ ఇందులోనికి ప్రవేశింపనేరక పోయినాడు......పాపములకుట్టలకు దేవాలయమూ దేవుడూగాని, అమాయకునికి వేరే దేము డనవసరము- ఎవరదీ? - శివగురుడు! ఇదొక నిర్భాగ్యశవము! దౌర్భాగ్యుల కాలయ మగుచున్న దీదేవాలయము!

(ప్రవేశము : శివగురుడు.)

శివ : (నవ్వుతూ) ఆ మాలముండాకొడుకు ఇంకా సింహద్వారమువద్ద కాపలా కాస్తానే వున్నాడు.

సీమం : వాడు కాపలా కాయబట్టే మీరు కులుకుతున్నారు. వాడు లేనిరోజు మన్ను తినవలసినదే! మీ అందరికంటే వాడే నయం.

(ప్రవేశం : శర్మ)

శర్మ : ఎవరు బాబు! ఆ నయం?

శివ : మాల! మాలమీద కన్నుపడింది కాబోలు!

సీమం : నోరు ముయ్యి. ఎంతటి మానమర్యాదలు లేనిదాన్నయినా, హృదయమునేదికల మానిని అని మాత్రము తెలుసుకో. మంచిగా నోరురానియ్య

—ఈ ఒక్క ఉదాహరణమే చాలును; మాలలు మనకంటె మెరుగనే పామెత ఋజువుకు!

శర్మ: ఓయీ! నువ్వు వెళ్లి - ఆఘండాలుణ్ని అక్కడ నుంచి తరిమివెయ్యి.

(శివగురుడు నిష్క్రమించును.)

సీమం: పాపం! ప్రొద్దుటినుండీ ఉపవాస దీక్షతో తపస్సు చేస్తున్నాడు దేవుడికోసము.

శర్మ: నువ్వు ప్రత్యక్షమయి వరాలియ్యి. వేనకువేలు సంవత్సరాలు తపస్సులుచేసిన ఋషులకు ప్రత్యక్షమయిన దేవుడికిబదులునువ్వు చాలును.

సీమం: ఆహా! అమాయకులైన, నిజమైన భక్తులకు హృదయములేని సంఘమా రక్ష ? ఇట్టిసంఘానికి దీపస్తంభాలుకదా మీలాటి మహాపురుషులు!

శర్మ: అవును. వాలాటివారు ఏకొద్దిమందో ఉండుట చేతనే ఇంకనూ సనాతనమతము తన ధర్మముతోపాటు వాల్గుకాళ్లమీద నడచుచున్నది.

సీమం: ఏనాడైతే మీవంటి పరమపూజ్యులు నశించెదరో — ఆనాడే సత్యమతమైన హిందూమత ముద్ధరింపబడుతుంది. మీది హిందూమతము కాదు, ఒక పక్షపాతమతము, అనవసర వివాద మతము, నిజ మెరుగని అజ్ఞానతిమిరము ... ఆ ఆత్మారాముడే నిజమైనభక్తుడు—

శర్మ: అతనివంటిభక్తులు లక్షోపలక్షలు—

సీమం: కలరు—ఆ అమాయకులలో! కాని మీలోని వారంతా బూటకపుభక్తులు—

శర్మ: ఇందులో బూటక మేమాత్రమును లేదు. ఏది శాస్త్రబద్ధ మయినదో — అదియే నే నడచుచున్నది...నీలాటిచపలస్త్రీతో వాదోపవాదము లనవసరము నాకు.

(నిష్క్రమణ.)

సీమం: చపలస్త్రీ !—అవును. నేను చపలను. దేవదాసీపనికై నియోగింపబడిన నన్ను చెరిచిన వాడు చపలుడా — నేనా ?...నావిధికి తలవొగ్గి నిలవని—నాకు—రాబోవుజన్మ—? మూడు వంతులు, ఈ జన్మలోనివా పాపపరిహారార్థము, వచ్చేజన్మలో పూజారి నయ్యెద నేమో! ఓయి దేవుడా! అటువంటి పాపిష్ఠిజన్మమాత్రము నాకు వలదు.—ఘండాలజన్మ—నే కోరుకొనునది. ఈ పాడుసంఘముచేత చపల వని పిలువబడుచున్న — ఈస్త్రీ — మానవహృదయము కలిగియున్నదని నేడైననూ ప్రపంచము తెలుసుకొనగలదు. ఆ ఆత్మారాముని ఈపాడుపూజారి శనిగాడు ఏమిబాధలు పెట్టుచున్నాడోకదా!

(నిష్క్రమణ.)

## రంగము : మూడు

[ ఆలయ సింహద్వారము : ఆత్మారాముడు ప్రవేశించును.]

ఆత్మా: నాకు దేవుడు లేడు — పాపాలు పోయెడిదారి లేదు—నేను నీచుడను—ఘండాలుడను.

(ప్రవేశము : శివగురుడు)

శివ: ఘండాలుడుగారూ ! ఏమైనా తపము ఫలించినదా?

ఆత్మా: నాకు దేవుడు లేడు.

శివ: అవును — అందులో అబద్ధము అరవీస మైననూ లేదు—తమ తపస్సు—?

ఆత్మా: ఎందుకునూ పనికిరాని జీవిని. నాకూ దేవునికీ-ఏసంబంధమూ లేదు. నాకు దేవుడు లేడు.

శివ: ఆ వాగుడు మాను. ఇక్కడనుంచి కదులు. శనిగ్రహం—దారికాస్తూ కూర్చున్నావుగాని !

ఆత్మా: ఇక్కడనుంచి దేవుడిని చూడకుండా వెళ్లను. దేవుడి పాదాలదగ్గర ప్రాణాలు వదలుతాను.

శివ: నీతో నాకు వాద మెందుకూ—ఇంతకూ కదలనన్నమాట....ఈసంగతి యావత్తూ రాజభటులకు విన్నవిస్తాను.

(నిష్క్రమణ.)

ఆత్మా: పూర్వజన్మపాపఫలము !

(ప్రవేశము : శర్మ)

శర్మ : ఓరీ! దెయ్యమా! ఇంకా కదలవేమి? తిండి తినక ఇక్కడ చచ్చేదవా రేమి? నువ్వుచచ్చిన ఈ ఆలయపుగోడ లన్నీ మైలపడును. ఇంక క్షమించి రాగములోనికి రానీయకుము—

ఆత్మ: బాబయ్యా! దేవుడు లేకపోతే—నా పాపాలు పోయే మార్గమో?

శర్మ : నీకులములో చెయ్యవలసినవిధి నెరవేర్చుకో — నీకు ముందుముందు సుఖంకలిగేనిమిత్తము స్వస్తి వాచకములో అందరితోనూ నిన్నుగురించి కూడా ప్రత్యేకముగా చదువుతాను.

ఆత్మ: అయితే నే చెయ్యవలసినపనీ?

శర్మ : వినయవిధేయుడనై యుండు. సేద్యము చేసి —అవిధంగా అన్నదానఫలాన్ని పొందు. బ్రాహ్మణభక్తితో వారికి తొలగి బ్రతుకు. ఇది నువ్వు చెయ్యవలసిన విధి - పో.

ఆత్మ : అయితే దేవుడిని చూడనీయరా?

శర్మ : ఇంక వేరుమాటలేదు. వెడతావా, వెళ్లు; లేదా మహారాజునకు కబురంపెదను.

ఆత్మ : నా దేవుడు?

శర్మ : ఇంక నీఖర్మము. దేవుడూలేడు, దెయ్యమూ లేదు.

(నిష్క్రమణ.)

ఆత్మ : అయ్యో దేవుడా! కాళ్లరిగిపోయేలాగ తిరిగి తిరిగి నిన్ను గానలేకపోయేనుగదా. నువ్వు- నాకు - ఈపాపికి కనపడతావా?

నా పాపాలు ఎలాగు పోతాయి? ఇంక నాకు దారేది? నాకు దిక్కేది? నన్ను రక్షించే టందుకు దేవుడే లేడా?

(ప్రవేశము : మహమ్మదీయుడు)

మహ : లేకేమోయి — ఉన్నారదుగో ప్రవక్త మహమ్మదులవారు. స్వర్గపీఠమండి నిన్నాహ్వానిస్తున్నారు. ఆయనకౌగిలిలోనికి రా.

ఆత్మ : ఆఁ — నిజంగా? నాకూ దేవుడున్నాడా? నన్ను రమ్మంటున్నాడా?

మహ : మా దేవుడు అల్లా. అల్లాకు అందరూ సమానమే. పాపుల పాపాలను పోగొట్టి రక్షించును. నాయనా! రా - నాతోరా. ఆమసీదు ఆలయములో భక్తితో, మా అందరితో, దేవుని ప్రార్థింతువుగాని...

ఆత్మ : అమ్మయ్య... నా దేవునికి — నా రామునికి ఇన్నాళ్లకు దయ కలిగినది!

మహ : రాముడు కాదు — అల్లా.

(ప్రవేశము : క్రైస్తవుడు)

క్రైస్త : సోదరా! నిన్ను రక్షించువాడు ఏసుప్రభువొక్కడే. మిగిలిన మతము లన్నియు వట్టిబూటకములు. పవిత్ర గ్రంథములో "అందరు మానవులూ దేవుని ప్రేమకు పాత్రులు" అని వున్నది.

ఆత్మ : మీ రెవరూ? నన్ను సోదరా అంటున్నారు. నేను మాలను—

క్రైస్త : మాలో అంటరానివారు లేరు. అంతా సమానమే. ఏసుప్రభువే నిజమయిన దేవుడు. ఆయనను నీవు సదా నమ్ముము. నీ కోర్కెలన్నింటినీ తీర్చును. నీమనస్సు పవిత్రగ్రంథమును తెలుసుకొనిన వెంటనే పరిశుద్ధతను పొందును...ఏసు ఒక్కడే దేవుడు.

మహ : కాదు - అల్లా ఒక్కడే దైవము.

క్రైస్త : ఏసు దేవుడని మా బైబిలులో చెప్పబడివున్నది.

మహ : కాదు — అల్లాదైవమని మాఖురాన్‌లో చెప్పబడియున్నది.

(ప్రవేశము : సీమంతిని)

సీమం : మీ మతము లన్నిటికంటె హిందూమతమే గొప్పది. మా భగవద్గీతలోనూ పురాణాలలోను — ఓ, ఇంకా అనేక గొప్పగ్రంథాలలో వున్నది.

క్రైస్త : సోదరా! నిన్ను గొప్పగా చదివించెదము. సర్కారులో ఉద్యోగ మిప్పించెదము.

మహ : నిన్ను గొప్ప మతప్రచారకునిగా చేసి మక్కాపంపెదము.

సీమం : నాయనా! వీరిమాటలు నమ్మకు. నీమతమే మంచిది. నీరాముడే దేవుడు. నీమతములో నీకూ దేవ డున్నాడు

క్రైస్త: అటైన—సోదరా! నిన్ను మా మతము ఆలయము బయట నుండమని అంటరానివానిగ జేసిన దేమి?

సీమం: నాయనా! దేవుడు ప్రతిచోటా, ప్రతివస్తువులోనూ — అన్నిరూపాలలోనూ వున్నాడు. దేవుడు ఒక్కడే. నీలోనే వున్నాడు. ఆత్మారామా! రాముడు నీ ఆత్మలోనే వున్నాడు. కళ్లు దెరచి చూచుకో—ఈ ప్రపంచమంతా దేవుని ఆలయము. నీలాంటి స్వేచ్ఛాజీవులకు, అమాయకులకు, భక్తులకు, దేవుడు ఆకోవెలలో లేడు. ఆకోవెలలోనివాడు కృత్రిమస్వరూపుడు. దేవుని ఆలయవాసివి నీవుగాని, మేము కాము. ఆకోవెలలో తప్ప ప్రపంచమంతా నిండుకొని వున్న దేవునిలో లీనమగుము.

క్రైస్త: ఎవరో పిచ్చిది.

ఆత్మా: నాకు నారాము డున్నాడు.

మహా: దొంగా దొంగే. నా కెందుకూ.

(నిష్క్రమణ.)

క్రైస్త: ఇటువంటిపిచ్చివాళ్లు మామతములోనికి పనికి రారు.

(నిష్క్రమణ.)

ఆత్మా: అమ్మా! నే నెవరిని ఆరాధించను?

సీమం: ఈ పెద్దకోవాలయములోని దేవుని. ఆ దేవుడు విగ్రహస్వరూపుడు కాడు...ఆ చల్లనిగాలిలో ఆ సముద్రపుకెరటాలమరుగులలో — నిర్మలమయిన, నిశ్చలమనస్సులను ఆకర్షిస్తూవున్నాడు... నాయనా! ఆపాడుకోవెలలోనికి పోకుమీ. అందులో నుండేవా రెవరు? అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని—నిరాకార- నిరంజనుని నమ్మజాలనివారు. పాపులు. ప్రాపంచికపాపజాలముల నన్నిటినీ ప్రోగుచేసి పూజారిని జేసినాడు దేవుడు. ఆ పూజారికి దేవునిపరంగా అంకితముచేసిన దేవదాసీలు స్త్రీయలు. అటువంటివారిలో నేనొక నిర్భాగ్యురాలిని—నాయనా! మేము పాపులము. మాకు నరకమే శరణ్యము...నువ్వో — అమాయకుడవు - పుణ్యమూర్తివి...

ఆత్మా: మరి నా దేవుడు?

సీమం: విశ్వమంతటా—అదుగో — పశ్చిమమున— ఆ సముద్రము. ఆ కెరటాలమీద నాట్యమాడే సకలతేజోమయరాశిభానుడు — అస్తంగత భానుడు. సాగరతరంగాలను ఎంతఎత్తుగ ఆకర్షించుచున్నాడు. నీమనస్సుకూడ ఆకర్షింప గలడు...అదుగో! సంధ్యారాగముతో దిగంత మణివలె ప్రకాశించుచున్నాడు — నీప్రత్యక్షదైవము—అరుణకిరణుడు!— పో—పో! ఆ నిర్మలప్రదేశములో—ఆ నిర్మలవాయువులో- ఆ సచ్చిదానందునిలో లీనమువవోయీ! ఆ దేవుని ఆరాధించవోయీ! నీ ఆత్మలో కల రాముని కనవోయీ! ఆ దేవుని ఆలయము విడువకుమోయీ!

ఆత్మా: ఆఁ—నిజముగా! నా దేవుడేనా!
అతడే? అతడేనా—నా దేవుడు? (పరుగెత్తును) ఓయి దేవుడా — ఎన్నాళ్లకు నిన్ను కనుగొనగలిగేను. ఎంతటి నిర్మలంగా —ఎంతదూరాన నున్నావోయీ! ఆపెద్దకెరటము నీవద్దనుండి నాదగ్గరకు వస్తున్నది. అందుమీద నిలుచుని నీదగ్గరకు రాగలను. నీసన్నిధినుండి పోరెదను. నీలో లీనమయ్యెదను. ఇదుగో—వొస్తున్నా- పాపిని-రక్షించు- నా దేవుడా! (పరుగెత్తును)

సీమం: అయ్యో! అయ్యో! —— దేవునిలో లీనమయిపోయెను......... నేడు భారతజనని ఒకమహాపురుషుని గోల్పోయినది...

(అంధకారము)

"ఆరాధనకై కొనవా.
ఈదీనుని
ఆరాధన కై కొనవా!
ఆలయంబులో నుండేటి
ఓ ఆదిదేవుండ!"

# 'ఆలయరాజమా!'

శ్రీ సత్యదుర్గేశ్వరకవులు

ఇది ప్రస్తుతము నిజాం రాష్ట్రాంతర్గతమగు వరంగల్పట్టణమున గలదు. ఈపట్టణమునకు ఏకశిలానగరమనియు, ఓరుగల్లనియు, ఒంటిమెట్ట అనియు, నామాంతరములు కలవు. ఇప్పుడు నిజామాంధ్రరాష్ట్రమునంగల పట్టణములలో కెల్ల నిదియే పెద్దది. మంచివర్తకస్థానము. ఇది నేటికిని పూర్వమువలె ఒకమహా సామ్రాజ్యమునకు కేంద్రనగరము కాకపోయినను, మాండలికకేంద్రస్థానముగను, రాష్ట్రీయకేంద్రస్థానముగను, ఉండగల భాగ్యమునైనను సంపాదించుకొని మనతెనుగు వారికంటినీటిబొట్లను గొంతిమట్టుకునైన తుడువ గలుగుచున్నది. ఈపుర పరిసర ప్రాంతభూములందు నాటికాకతీయుల కట్టడము లింకను ఎన్నో కనబడును. కొందఱజ్ఞాను లీయాలయరాజమందలి సుందర శిలావిగ్రహములను గొన్నిటిని అంగవికలములు గావించి నానావిధముల బాధానరించుచుగాబోలు! పశ్చాదస్మదాదుల కిందు గాలిడినతోడనే మానసావ్యక్తమగు విచార ముబుకెత్తి రాబోవుచు డును. కాని ప్రస్తుతనిజాంప్రభుత్వము ఈదృశ్యరాజమును తమ సంరక్షణక్రిందకు గైకొని తిరిగి దీనికట్టి గండము లెవ్వియు లేకుండ నట్లొనర్చిరి; ధన్యవాదములు. మొత్తముమీద ఈసహస్ర స్తంభ శివాలయము నేటికి చాలమట్టుకు పాడైయున్నను, పశ్చాదాంధ్రమహాశయులకు — కాదు, కాదు, నిష్పాక్షికమైన మానవత్వముగల ప్రతిమానవునకును ఆనందజనకమై చిత్రవిచిత్రశిల్పరచనాచాతుర్యముతో నింపెసలారుచు పదమూడవశతాబ్దినాటి ఆంధ్రనాగరకత నేటి నాగరకతకంటె నెన్నోరెట్లు అగ్రిమమై, నిరుపమానమై, సదా స్పృహణీయమై వర్ధిల్లెనని నమ్మకలేని వారికైనను, దృఢవిశ్వాసము కలిగించుచున్నదో అన్నట్లు ఒక్కొక్కప్పుడు దృగ్గోళములకు గోచరించుచుండును. దీనినిర్మాత ప్రతాపరుద్రుడు. ఈయన పదమూడవ శతాబ్దమున సంపూర్ణస్వాతంత్ర్య ధర్మరక్తముతో ప్రజానురంజకుడై పాలించి మించిన అంత్య కాకతీయాంధ్ర మహాచక్రవర్తి. అంతతో ఆయన్వయ మంతరించినదని కాదు — కాని వారెవరును అంతటి ఉద్దండ ప్రముఖులు కాలేకపోయిరి. ఎట్లు విమర్శించి చూచినను నేటికి ఈదైవమందిరరాజముయొక్క వయస్సు దాదాపేడు వందల యేండ్లకు మించియుండనోపునని వ్యక్తమగుచున్నది.

కాలపరివర్తనమ్మున గలిగినట్టి
ఆత్మదురవస్థ గాంచి లో నటమటింతు
నా! శిథిలమయ్యు నిటుకొంచెమైనగంటి
కగపడుటజేసి హర్షింతునా! గృహాంబ.

మానవనాథచంద్రుడు ప్రమాదవశంబున దండినిన్ యమ
స్థానము జేర్చినట్టి యఘసంపుటి బాపుకొనంగ గాదె ని
ర్మాణ మొనర్చె గోట్లధనరాసులు వెచ్చ మొనర్చి నిన్ను? క
ట్టా! నరపాలు డప్డు నిను నారసి ఎంతగ సంతసించెనో!

లలినాంధ్రావను లన్నిటిం గలిపి సామ్రాజ్యంబుగా జేసి అ
వ్వల ఢిల్లీశ్వరు బ్రక్కబల్లెమయి దీవ్యత్సార్వభౌమాఖ్యనా
దల దా బూని రహించు నాంధ్రధరణీధౌరేయు సంతాన మి
ట్టులమెన్ గా! తుద కంచు మాదృశుల కెంతో దుఃఖ ముప్పొంగెడిన్.

అలఘని బాధ ఒక్క మనుజావళికే యని యింతదాక లో
దలచుచునుంటి; ఈ సకలధాత్రికె కాక సమస్తలోకమం
డలికి మహేశ్వరుం డగణితప్రతిభాన్వితు డాదిదేవు డా
నెలధరుమందిరంబయిన నీకును నయ్యది తప్పదయ్యెగా!

ఎంతద్రవ్యమ్మునైన వెచ్చించి నిన్ను
వంటి మఱియొకలలిత దేవాలయమ్ము
గట్టగలరే మొ ! అడుగుమీదిట్టలొక్క
రైన; అదినాటి ఆంధ్రరామాయణమ్ము.

రాజు ప్రతాపరుద్రుడు పరాళినృకేసరిమూర్తి తెల్గురా
రాజు; పవిత్రవస్త్రములు రంజిల దాల్చి సతమ్ము మందవి
భ్రాజితగామినులై సతులు బాడుచు నీమెడ కేగుదెంచునా
రోజులలో త్వదీయతనురూప మదెట్టిహొయల్ చెలంగెనో!

సకలసామంతభూస్వామిరత్నాంగుళీయకహస్తబంధుమర్యాదితములు
సర్వవిద్వత్కవీశానవాగ్ధోరణీలహరీవిహారవిలాసితములు
ఆంధ్రసంస్కృతకన్నడాదిభాషాసక్త నాంధ్రరాజేంద్రదృక్కేంద్రగములు
యవనప్రభృత్యన్యధవసముద్ఘాతదస్కరణాభిలాషాధికారణములు
హేమమణిమయద్వారమాళీంద్రకుడ్య
పాదసోపానవాతాయనాదికమ్ము
లన్ వెలుగునీవు నేటికాలానుగతికి
అకట! చిక్కితె యిట్లు దేవాలయంబ!

ఆయుగంధరుడేయున్న అజుడు నీను
దుట రచించిన ఈపాడుదుడుకవ్రాత
దొడరి ఉమ్మును దీసిపోదుడువకున్నె?
అకట! నేడామనీపి లేడాయెగాని.

నల్లరంగునువేసినట్టియద్దము లనన్ జెలువారు నలతాలపలక లిచట
దేవలోకమునుండి దిగివచ్చెగాబోలు ననిపించు నగిషీల పనులు నిచట
తుదమొదల్ కనరాక పొదలించు నెనలేని విస్మయం బంతరవీథు లిచట
లెక్కింప బుద్ధి జలింపజేసెడురీతి పనజిమ్ము వేయికంబమ్ము లిచట

తనివితీరదు నీదువిధానమెంత
చూచినన్‌గాని; అదియేమొ! చూచునప్పు
డాఁకలియు దప్పియుంగూడ అంతరంగ
మునకు దోచవు ప్రొద్దెంత ననినగాని.

ఆశలనెల్ల దీప్త లెగయన్ దళుకించిన నీకు; మాపురా
వేశితపాపకర్మమున పేదఱికం బరుదెంచెగా! సమ
స్తాశ లడంగ నేటికి ప్రశస్తపుటాంధ్రశిరంబులే కటా
ఆశనిగాని కాదుకొన నంకెనుబోలు! అమర్త్యహర్మ్యమా!

అటులు కాదేని దేశదేశాంతరముల
మలసిచెలగిన ఈ ఆంధ్రమాత నేడు;
దిక్కుచెడి మోముచెల్లక ఒక్కమూల
నణగి ఈరీతి కాలమ్ము ననుపునొక్కొ !

కళలన్ మించెడి నాటికాలమున గాకన్‌బోయినన్; సర్వశో
భలు గోల్పోయి ఇటుల్ కనంబడెడి ఈప్రాయంబునందైన ని
న్గలయన్ జూడగ గల్గినార మిక బైనన్ బుట్టువాం డాంధ్రవం
శ్యుల కీమాత్రమునైన గన్పడెదొ లేదో ఆలయశ్రేష్ఠమా !

రాజరాజుల నెల్ల నోజ డీకొని గెల్చినట్టిప్రతాపసామ్రాట్టుకాని
కవిరాజులకు నెల్ల గవిరాజుగా గ్రాలినట్టిశ్రీనాథతాతయ్యకాని
మగిడి తెలుంగుసామ్రాజ్యమ్ము స్థాపించినట్టిబుక్కయ హరిహరులుకాని
సచివమండలి కెల్ల సద్గురుం డనజాలు నట్టియుగంధరుం డైనగాని

కాలవశమునఁ బేదఱికమ్ముకలిగి
నేయవస్థను జూచుచు నేటిదనుక
బ్రతికియుండిన; ఇఁక వారి ప్రబలచింత
కలవియుండునె ? చెప్పుమ- దేవాలయంబ!

అరిగిరి కాకతీయనృపు లందఱు; వేరొకరైన సర్వమున్
జెరుపయి నామమాత్రముగ జెల్వెనలా రొకనీవు తక్క; ఏ
కరణి విరక్తి నెల్ల నడుగంటగజేసి. తదీయవంశ్యు లం
దఱ దరియింపజేసెదవొ; దైవగృహాంబ! తిలోదకాదులన్.

ఎన్నటికేనియున్ దిరిగి ఈ తెలుగమ్మ తదీయమహా పురా
భ్యున్నతు లెల్ల దా గొనకపోదు; తెలుంగుపతాక మవ్వ డా
కోన్నతసీమలన్ జెలగి ఉయ్యెల లూగకపోదు; నిర్గతా
భ్యున్నతు లొంది నాడు పొలుపొందకపోవు; నిలింపహర్మ్యమ ః

---

# బదరీనారాయణ యాత్ర

శ్రీ మంత్రిప్రగడ నరసింహం

(గతసంచిక తరువాయి)

శ్రీనగరం:

ఈరోడ్డుమీద నున్న గ్రామము లన్నిటిలోను పెద్దది. కంబళీవాలా ధర్మశాలలో విడిసితిమి. చీకటి గదులు. బాటసారు లందరును ఒకరిప్రక్క నొకరు పండుకొనవలెను. నేను భోజనము నాగదిలోనికి తెప్పించుకొని భుజించితిని. మేము వచ్చిన తర్వాత నొక పంజాబీ యాత్రికుల జట్టు, ౫౦, ౬౦ మంది వచ్చి సత్రం అంతటా నిండిరి. వసారాలలో నడచుటకైనను సందు లేదు. నాగదికి యెదురుగా వసారాలో పండుకొన్నవారిలో నొకడు ఉబ్బసపు రోగి, రాత్రి అంతయూ దగ్గుచూ, అక్కడనే ఉమ్మి వేయుచుండెను.

౭-౫-౩౯: తెల్లవారుజామున ౪ ఘంటలకే బయలుదేరితిమి. నడక అభ్యాస మగుచున్నందున శ్రమలేకయే ౭ మైళ్లు నడచి, భట్టిసారా ౮ ఘంటలకు చేరితిమి. కంబళీవాలా ధర్మశాల రోడ్డుప్రక్కనే యున్నది. చిన్నది, కాని, శుభ్రముగా నున్నది. సమీపముననే జలప్రవాహమున్నది. దానిలో స్నానముచేసి పితృతర్పణములు చేసుకొంటిని.

భోజనములో (౧) అడవిలో యేరిన మామిడి కాయల పచ్చడిబద్దలు, (౨) అడవి కరివేపాకు పచ్చడి, (౩) అడవి ములక్కాడల చారు బహు రుచిగా నుండెను!

మా పార్టీలో, చిత్తూరుసాహేబు నొకరుకూడా చేరెను. ఇతను, భోజనము లేక పస్తు వుంటూ, మేము బస చేసిన చట్టీలోనే బస చేయుచుండెను. భోజనము లేక నిరాహారిగా నున్నాడని విని, మా వంటలో భోజనము పెట్ట ప్రారంభించితిమి.

సాయంత్రం తిరిగీ ౩½ ఘంటలకు బయలుదేరితిమి. ఇక్కడనుండి రోడ్డు ౧½ మైళ్లవరకూ బహు కష్టము. పెద్దకొండ యెక్కవలెను. తర్వాత, కొండ వెనకవైపున ౧½ మైళ్లు దిగవలెను. అందరూ చాలా శ్రమపడిరి. సూర్యాస్తమయమునకు కంకారాచట్టీ చేరితిమి. ఇక్కడ యీగలబాధ దుర్భరము.

౯-౫-౩౯: ఉదయము ౪ ఘంటలకే బయలు దేరితిమి. ముందుమకాముకు లోపల రెండు కొండలు యెక్కి దిగవలెను. కాని, యివి వెనుకటి కొండయంత కష్ట మనిపించలేదు. రెండు కొండలకును నడుమ నారొక్కటచట్టీ యున్నది. రెండవ కొండ శిఖరమున బహు రమణీయమగు స్థలము కలదు. రోడ్డుప్రక్కనే ఒక చిన్న దుకాణమున్నూ, మంచినీటికొట్టమున్నూ కలవు. దుకాణమున కెదుట పెద్ద రావిచెట్టు కలదు. ఎదురుగా నొకదానివెనుక నొకటి తొంగి చూచు గొప్ప పర్వతశిఖరములును, ఆ కొండక్రిందనే ౫౦౦ అడుగుల దిగువను, కలకలధ్వనితో ప్రవహించు నదియు గల హిమవంతుని సొగసు కన్నులకు విందు గొల్పుచుండ, చల్లని మలయమారుతము చెమటలో తడిసిన మాదుస్తుల నారించుచుండ, హాయిగా నా రావి చెట్టుక్రింద నరఘంట కూర్చుంటిమి. దుకాణములో పాలు దొరకును. రాజంగారు, వారివెంట కాఫీపొడుము, పంచదార, ఓవల్టీను గొనివచ్చిరి. పాలుకొని, కాఫీ, ఓవల్టీను తయారుచేసి, రాజంగారు అందరకూ విందుచేసిరి. ఈ ప్రదేశమునకు పేరు పంచభయ ఖాల్ అని దుకాణదారు చెప్పెను. ఇక్కడ చట్టీ యుండినచో బసకు యెంతసౌఖ్యముగా నుండునోకదా యని తలంచితిని.

దారిలో, పొలములకు పోవుచున్న కొండజాతి స్త్రీలు కొందరు మమ్ములను కలసి, "సూయీ, తాగా, దో మహరాజ్" (సూదీ దారం యివ్వండి బాబూ) అని అడిగిరి. వారికి కొన్ని సూదులునూ, దారపువుండలును, చెమికీబొట్లునూ యివ్వగా, చాలా సంతోషించిరి. ఈ స్త్రీలు చక్కని విగ్రహములు గలిగి, ఆరోగ్యము మూర్తీభవించిన ట్లుండిరి. నాగరికతయొక్క వాతబడిన మనస్త్రీలు యెంతయో



౬. పర్వతములనడుమ రోడ్డు

యనారోగ్యముగాను, దుర్బలముగాను నుందురుగదా! పిత్తాశోకచిలుకలవంటి, మనయబలలు అబలలే!

౭½ గంటలకు రుద్రప్రయాగ చేరితిమి. చీకటి కొట్టువలెనున్న యొకగది దొరికినది. వండుకొనే ప్రదేశ మేమీ అనుకూలముగా లేదు. భోజన మైన తర్వాత ప్రయాగయొద్దకు పోయి చూడగా, నక్కడ, "రుద్రనాథకాళీమందిరం" అను పేరున నొక చక్కని మందిర మగుపడెను. దానియధిపతి, జాత్యంధులగు నొక వృద్ధస్వాములవారు. వారు మాకు బసకును, వండుకొనుటకునూ కూడా పరిశుభ్రమైన గదుల నిచ్చిరి. ఈగలబాధ యిక్కడ తక్కువ. ఈ బసకు మారిన తర్వాత, ప్రాణము హాయిగా నున్నది. కాని యెండ యంతయూ గదులలోనికి వచ్చుటచే, సాయంత్రం వేడిమి బహుతీక్ష్ణముగా నుండెను. రాత్రి యిక్కడనే యూగిపోతిమి.

మందాకినీ, యలకనందా సంగమప్రదేశమున, నా మిత్రులు రాజంగారు కొన్ని చక్కని ఫోటోలను తీసిరి.

మందాకినిలో స్వచ్ఛమగు నీరు పారుచుండెను. కాని, అలకనందలో బురదతోకూడిన వరదనీరు వచ్చుచుండెను. కొండలలోని మంచుకరిగి వరద వచ్చుచున్న దని చెప్పిరి.

స్వాములవారు కొంతసేపు మంచి వేదాంత ప్రసంగము చేసిరి. వారి ధర్మసంస్థలకు ౧౦ రూపాయిలు చందా యిచ్చితిని.

౧౦-౫-౩౭: తెల్లవారగట్ల ౪½ ఘంటలకే ప్రయాణము సాగించితిమి. ౭ మైళ్ల లోపున చట్టీ లేదు. రోడ్డు, కొన్నిచోట్ల ఎక్కుడు, దిగుడు కలిగి యుండినను, అంతకష్టము లేదు.

శివానంది: ఏడున్నర ఘంటలకు చేరితిమి. ఇది సామాన్యపుచట్టీ. కూరగాయ లేమియు దొరక లేదు. గ్రామములోని బాలికలు పుదీనా అమ్మకము నకు దెచ్చిరి. ("సూయీ, తాగా" సూదీ, దారము, "బిందు" (చెమికీబొట్టు) వాళ్లకు యివ్వగా సంతోషించిరి. ఈ ప్రాంతముల, బాటసారులు గ్రామము సమీపించువప్పటికి, పొలిమేరయొద్ద చిన్న బాలురు, బాలికలు రోడ్డుమీద వేచియుండి, కొందఱుపాడుచు, కొందఱు ఆడుచు, "పాయి పైసా" (దమ్మిడీ) యిమ్మని యడుగుదురు. ఒక్కొక్కరి కొక్క దమ్మిడీయిస్తే చాలా సంతోషించెదరు. ఇక్కడకూడా యెండ తీక్ష్ణముగానే యుండెను. సాయంత్రం 3 ఘంటలకు తిరిగీ బయలుదేరితిమి. చాలా యెండకొట్టినది. దైవానుగ్రహంవల్ల యెవ్వరికీ వడకొట్టలేదు. సాయంకాల ప్రయాణముకు, యింకా చల్లబడితేగాని బయలుదేర గూడదని తోచినది.

సూర్యాస్తమయము కాకముందే హరి ఆశ్రమము చేరితిమి. ఇది పరిశుభ్రమైన చట్టీ. దుకాణదారు శుచికలవాడు, వేదాంతం చదువుకున్న వాడునూ

దుకాణములో శాటసారుల నుపయోగించు చాలా సరుకులను పెట్టియుంచెను. చట్టీముందర చిన్న పువ్వులతోట, ద్రాక్షతీగ వేసి, యీబస యాహ్లాదకర మగునట్లు చేసెను. ఈ చట్టీయున్నూ, ఖమేరా చట్టీయున్నూ కలిసియున్నవనియే చెప్పవచ్చును. మధ్య రెండుమూడు ఫర్లాంగులుమాత్రమే యుండును.

మాజట్టులో యిద్దరికి జబ్బుచేసినది. పాలూరు కోమట్లలో నొకరికినీ, చిత్తూరు సాధువుకున్నూ రక్త గ్రహణి ప్రారంభించినది. కొండధారలలోని పచ్చినీరు త్రాగుటచే యీ వ్యాధి కలుగునని చెప్పుదురు. వీరిద్దరూ మార్గములో కొండధారలనీరు త్రాగుచుండిరి. సాధువు బహునీరసముగా నున్నందున అతనిని చట్టీలో దిగవిడిచి పోవలసివచ్చినది. ౯ మైళ్ల దూరముననున్న కర్ణప్రయాగలో ఆసుపత్రి కలదు. నెమ్మదిగా ఆసుపత్రి చేరుకొమ్మని యతనితో చెప్పి, కొంతడబ్బిచ్చి యతనిని విడచిపోతిమి. కోమటి, ఆగిపోవుట కిష్టము లేక నెమ్మదిగా మా వెనుక నడచివచ్చెను. రాజంగారు తమయొద్ద నున్న మందులను వారిద్దరికీ యిచ్చిరి.

ఇట్టి యరణ్యమున, గ్రామ మేదియు సమీపమున లేక, వైద్యసహాయ మేమియు లేనిచోట, మా పార్టీలో ముఖ్యుల కెవరికైనా జబ్బుచేసినచో యేమి జరుగగలదాయను తలంపు భయకంపరమును గలిగించినది. సమీపమున ఆసుపత్రికి గొనిపోవుటకు డోలీ లైనా దొరకవు. అట్టిచిక్కు రాకుండా కాపాడుటకు భగవంతునిదే భారము.

౧౧-౫-౩౯: తెల్లవారు ఝామున ౪ ఘంటలకే బయలుదేరితిమి. సూర్యోదయమునకు, వాయు విమానముల మకాంస్థలమగు గౌచార్ చేరితిమి. ఇక్కడ బసలకు వసతిలేదు. విమానములపై వచ్చు వారు ఇక్కడి నుండి కాలినడకను ౬౩ మైళ్లు పోవలసి యుండును. ౧౦ ఘంటలకు కర్ణప్రయాగ చేరితిమి. దారిలో, కొన్ని యత్యున్నతములగు పర్వతము లగుపడెను.

కర్ణప్రయాగ సుమారుగా పెద్ద గ్రామమే. చాలాదుకాణములు కలవు. కంబళీవాలా

విడిసితిమి. ఇది, శ్రీనగరం ధర్మశాలవలె అసంతృప్తిగా లేదు. జనసమ్మర్దమున్నూ బాగా తక్కువ. ఎందుచేతనంటే, చాలామంది యాత్రికులు, రుద్రప్రయాగ నుండి కేదారక్షేత్రమార్గమున బోయిరి.

సాయంత్రం ౪ ఘంటలకు బయలుదేరి సూర్యాస్తమయమునకు జయకండి చేరితిమి.

మే మిక్కడ నుండగా పెండ్లివారిపార్టీ యొకటి యీ మార్గమున బోయెను. పల్లకీ సరిగా వసంతసేన సముకలె నున్నది! దానిలో పెండ్లి కూతురు మాత్రమే కూర్చొనుటకు స్థల మున్నది. ఆమె యితరులకు కనబడకుండునట్లు నాల్గువైపులను ఆ వాహనమును గుడ్డలతో గప్పివేసిరి. పెండ్లికుమారుడు టోపీ పెట్టుకొని, యెండలేకపోయినను గొడుగు వేసుకొని, వాహనము ముందు నడచుచుండెను. వాద్యము ఒక్క ఢక్కా మాత్రమే వాయింపబడుచుండెను.

౧౨-౫-౩౯: ఉదయము ౬ ఘంటలకు బయలుదేరి ౧౦ గంటకు నందప్రయాగ చేరితిమి. దారిలో, లంగాసు అనే పెద్దచట్టీ గలదు. మార్గములో కొండలు, ఎక్కుడు దిగుడు గలవు.

నందప్రయాగ చాలా పెద్దగ్రామము. అనేక దుకాణములు, పోస్టు, టెలిగ్రాపు ఆఫీసులు కలవు. గదులు గలిగిన సదుపాయమగు చట్టీలుకలవు. మేము బసచేసిన చట్టీయెదుట, యింగ్లీషు తెలిసిన దుకాణదారుండెను. ఆయనతో ప్రసంగించితిమి. శ్రీమైసూరు మహారాజాగారు బదరీయాత్రకు వెళ్లినప్పుడు బదరీవరకును కాలినడకనే పోయిరనియు, ఈపురవాసులు వారికి స్వాగత మిచ్చి, సన్మానపత్రము (Address) సమర్పించిరనియు, మే మిప్పుడు బసచేసిన చట్టీలోనే వారున్నూ విడిసియుండిరనియు, చెప్పిరి. ఈచట్టీలలో మావంటి సామాన్యులకే కష్టముగా నుండగా, దివ్యభవనములలో నివసించుట కభ్యాసపడి, అడుగుతీసి యడుగు పెట్టుటకైనను, అవసరము లేక యుండెడు మహారాజాగారు ౧౨౫ మైళ్లు కాలినడకను బోవుటయు, యీ చట్టీలో బసచేయుటయు ఆశ్చర్యమును గలిగించినవి. ఇట్టి యాత్రలవలన ముఖ్య

సామాన్య మానవులతో కలియుటకును, వారిజీవిత మె ట్లుండునది, యెట్టి గృహములలో నివసించునది, ప్రత్య క్షానుభవము పొందుటకున్నూ, అవకాశము కలిగించు టయే ముఖ్యఫలితము.

సాయంత్రం ౪ఘ॥కు తిరిగీ ప్రయాణమైతిమి. ఎందుచేతనో కుడిమోకాలులో నొప్పి పారంభించినది. దానికి మందు రాసి, కాపడము పెట్టి, కొంచెము కుం టుతూ నడచిపోతిని. ౬ ఘంటలకు కోహాడ్ చట్టీ చేరి తిమి. మొదటి చట్టీకంటె, వంతెనదాటినతర్వాత, మంచి చట్టీ లున్నవి. సమీపముననే స్నానపానాదులకు సదు పాయముగు జలధార కలదు.

౧౩-౫-౩౮: ఉదయము నాలుగు ఘంటల పావుకు బయలుదేరితిమి. చమోలీయను పెద్దగ్రామము దాటి, సూర్యోదయమునకు మఠ్ చట్టీ చేరితిమి. ఇక్కడ వేడిపాలుకొని, రాజంగారి స్త్రీలు కాఫీ, ఓవల్ టీను తయారుచేసి యందరకూ యిచ్చిరి. ఈ చట్టీ బసలకు సదుపాయమైనదే. సమీపముననే అరటి, మామిడి, నారింజ, పీలకులు మొదలగు వృక్షములతో నిండిన రమ్యమగు తోటలుండుటచే, ఈ ప్రదేశము రమణీయ ముగాను, చూచుట కింపుగాను ఉండును. ఇప్పటికి ౪ మైళ్లే వచ్చితిమి గనుక, కాఫీ అయిన తర్వాత ముందుకు సాగిపోతిమి. దారిలో, గానము చేయునొక యాచకులజట్టు కనబడెను. ఒక పురుషుడు మద్దెల వాయించుచుండగా, యౌవనవతులగు నిరువురు స్త్రీలు, పాడుచు నృత్యము చేయుచుండిరి. వీరు, మార్గస్థులయొద్దనుండి, కాని, దమ్మిడీ యాచించుచుం డిరి. ఆ యిరువురు స్త్రీలలో నొకపిల్లయొక్క సౌం దర్యము వర్ణనాతీతముగా నుండెను. బంగారువలె, మిసమిసలాడు పచ్చని దేహచ్ఛాయ గలిగి, యౌవన లక్ష్మి మూర్తీభవించినదా యనున ట్లుండెను. సహజ సౌందర్యముచే ప్రకాశించు యీమెను, నాగరికతా పిశాచ మేమియు నంటలేదు. ఆభరణము లెట్టివో యీమె యెరుగదు. ముతకబొంతగుడ్డ లంగాయును, గొమ్మగాజులును మాత్రమే యీమె కాభరణములు. చీనిచీనాంబరము లెరుగదు, పొంకపాపిడులు, తోక జీరలు నెరుగదు. "పైసా దో మహారాజ్" అని

మోమున మందస్మిత మంకురింప, కలువలవంటివిశాల నేత్రములు త్రిప్పుచు, కోకిలస్వరముతో బలుకువచన ములే, గానమువలె నుండెను. "ఖూబ్ గావో, పైసా దూంగా" (బాగాపాడుతే డబ్బు యిస్తాను) అని నేను బదులు చెప్పగా, వికసించిన ముఖబింబమునుండి దర హాసచంద్రికలు నలుదిక్కులను గ్రమ్మ, సిగ్గునభినయిం చుచు, పికస్వరముతో గానముచేయుచు, యీమె చేసిన నాట్యము, మేనకా, రుక్మిణీ దేవుల నాట్యమును ధిక్కరించుచుండెను. ఈమెచక్కదన మంతయు, బెదరిన లేడిచూపులవంటి యాచూపులలో నుండెను. ఆ చూపులతో నిటు, నటు చూచుటయే, వేరే యభి నయ మక్కరలేకుండా, యభినయముగా నుండెను. మేమిచ్చు బహుమానము పుచ్చుకొనుటకు మా యొద్దకు నడచివచ్చిన యొయ్యారపునడకయే నృత్యము వలెనుండెను. ఈదివ్యసుందరవిగ్రహము మనుచరిత్ర యందు వర్ణింపబడిన హిమవత్పర్వత కన్యకవరూథినిని స్ఫురింపజేయుచుండెను. సహజసౌందర్యమున కలంకార ము లక్కరలేదనుట యీమెయందు ధృవమాయెను.

౭ ఘంటలకు పీయూసేన్ చేరితిమి. మఠ్ చట్టీ దాటి రెండుమైళ్లు వెళ్లినతర్వాత, నది, రెండున్నత ములగు పర్వతముల నడుమ ప్రవహించును. ఈరెండు పర్వతములును సుమారు ౩౦౦౦ యడుగులయెత్తుగలిగి యుండగా, వాటినడుమ రాతిపడకపై నతివేగముగ ప్రవహించు అలకనంద, తనమార్గమున కడ్డువచ్చిన హిమవంతునిపై నలిగి రవముచేయుచున్నదా యనున ట్లుండెను. ఇక్కడ, హిమవత్పర్వత సౌందర్యము వర్ణనాతీతము. ఈ ప్రకృతిసౌందర్యమును జూచుచు నడచునప్పుడు, మార్గాయాస మేమియు దోచదు. పీయూ సేన్‌లో శుభ్రమగుచట్టీలున్నూ, కొన్ని మంచిదుకాణ ములున్నూ, నీటివసతియు గలవు. మంచినీళ్లగొట్టము, యిక్కడకు ౩౨౦౦ అడుగుల దూరముననున్న కొండ బుగ్గనుంచి వేయబడినది.

సాయంత్రం ౪౼ ఘం॥కు ప్రయాణమైతిమి. హాట్ చట్టీ దాటినతర్వాత ఒకమైలువరకూ రోడ్డు యెక్కుడుగా నుండును. ఆకాశమున మేఘములు [illegible]

కాని, వర్ణించలేదు. సూర్యాస్తమయమునకు పీపల్‌కోటి చేరితిమి. ఇది పెద్దగ్రామము. చాలా దుకాణములు కలవు, కాని చట్టీలు యేమీ సదుపాయముగా లేవు. కంబళీవాలాధర్మశాల అసహ్యముగా, ముసాఫర్ ఖానాగా నుండెను. దుకాణములలో, కిరిడీమృగము మొదలగు మృగముల చర్మములునూ, చామరములునూ దొరుకును. కిరిడీమృగము, హిమవత్పర్వతములలోని యొక చిన్న జంతువు. దీని చర్మము కొండగొర్రె చర్మమువలె నుండును. శీతల దేశములలో యీ చర్మము పాన్పుమీద వేసుకొని పరుండినయెడల చాలా వెచ్చగా నుండి చలిబాధ తగ్గించును.

౧౪-౫-౩౯: ఉదయము ౪ ఘంటలకే పయనమైతిమి. కొంచెము చలిగా నున్నందున, ఉన్నము నిచ్చు ఉడుపులను తొడగవలసివచ్చినది. సూర్యోదయమునకు గరూర్‌గంగ (గరుడగంగ) చేరితిమి. తర్వాత రెండుమైళ్లలో తంగాణియొద్ద నామిత్రులు కాఫీ, ఓవల్‌టీనులు తయారుచేసిరి. ఇక్కడ గరుడ గంగకంటె మంచిచట్టీలు, ధర్మశాల కలవు. ఇక్కడ నుండి పాతాళగంగవరకూ రోడ్డు కష్టమున్నూ, అపాయకరమున్నూ. కొండ, మెత్తనిమట్టితో కూడియుండుటచే అప్పుడప్పుడు మన్ను, పెద్దరాళ్లు కొండనుండి రోడ్డుమీదికి జారును (Land Slips). పాతాళగంగ సమీపమున కొండ దిగు రోడ్డు కష్టముగా నుండును. ఈ రెండుమైళ్లు జాగరూకతతో పోవలయును.

పాతాళగంగ: ౭ ఘంటలకు చేరితిమి. ఇక్కడ చట్టీలు బహు అశుభ్రముగా నున్నవి. ఈగలబాధ చెప్ప తరముకాదు. పాతాళగంగానదిలో నీరు చల్లగా మంచువలె నుండెను. అయినప్పటికినీ, స్నానము చేసి పితృతర్పణములను చేసితిని. ఆ సమయములో నా మిత్రులు రాజంగారు అనేక ఫోటోగ్రాఫులు తీసిరి. ఇక్కడ సరకులధర చాలాయెక్కువ. సేరుబియ్యము అర్ధరూపాయి.

సాయంత్రం మూడున్నరకే బయలుదేరితిమి. గులాబ్‌కోటి దాటి, రాత్రిమకాముకు కుంభార్‌చట్టీ చేరితిమి.

ఈచట్టీ యాత్రికులతో కిటకిట లాడుచుండెను. బదరికి పోవువారును, యాత్ర ముగించుకొని బదరి నుండి తిరిగి వచ్చుచున్నవారును, యిచ్చట కలియుదురు. నేలంవా స్తవ్యులు మాధవరావు అనేవారు, యాత్ర ముగించుకొని యీసాయంత్రమునకే యిక్కడ చేరిరి. వారి దుస్తులు, ఆకారమును బట్టి మదరాసీయులుగా గ్రహించి, వారితో మాటలాడితిమి. వారు, బదరియాలయముతలుపులు తెరచుదినమునకు ముందే యక్కడకు చేరితి మనియు, సీళ్లు పగులగొట్టి తలుపులు తెరచునప్పటికి జ్యోతి వెలుగుచుండుట చూడగా తనకు శరీరము పరవశమయ్యెననియు, వర్ణించి చెప్పిరి.

౧౫-౫-౩౯: శీతలప్రదేశమగుటచేత, ఉదయము ౫ ఘంటలకు లోపల బయలుదేరలేకపోతిమి. ఉన్ని దుస్తులు ధరించి బయలుదేరితిమి. సూర్యోదయమైన తర్వాత, మాకు యెడమపైపున కొద్దిదూరమున, వెండివలె స్వచ్ఛమైన, తెల్లని మంచుతో గప్పబడిన పర్వతశిఖరములు కానవచ్చెను. మంచుకొండల దర్శనమున కిదియే ప్రథమము. సూర్యకాంతిలో తళతళలాడుచు, కొండలమీద పల్లపుప్రదేశములలో పాదరసము నిలచియుండిన ట్లగుపడుచుండెను.

ఎనుబదియేండ్లవయస్సుగల యొకవృద్ధసాధువు-జాత్యంధుడు - ఇంకొకసాధువు సహాయముచే నడచుచు, మా కెదురుగా వచ్చెను. వీరు యాత్ర పూర్తి చేసుకొని వచ్చుచుండిరి. ఇట్టి యంధవృద్ధుడు, ఇంత కష్టమగుయాత్ర కాలినడకను పూర్తిచేసుకొనుట చాలా ఆశ్చర్యమును కలిగించి, ఆయనతో ముచ్చటించితిమి. రాజంగారు ఆయనకు ఫొటో తీసిరి.

జోషీమఠము సమీపించునపుడు, మార్గమున అడవి, తెల్లగులాబీపొదలతో నిండియుండెను. పుష్పములు వికసించి, యడవియంతయు మనోహరముగా నుండెను. సింగధారచట్టీలు గడచి, జోషీమఠము ౭ ఘం॥కు చేరితిమి. మారాక తెలియజేయుచు, శ్రీరావల్‌సాహెబుగారికి, దేవళం మేనేజరుగారికి తంతివార్తల నంపితిని.

జోషీమఠము బస్తీప్రదేశము. చట్టీలు, కంబళీ

శ్రీరావల్ సాహేబుగారి యతిథిగృహములో బస యిచ్చిరి. ఇది రెండు పెద్దగదులును, స్నానపుగది, పెద్దవసారాగల దివ్యభవనము. మురికిచట్టీలలో బస చేసివచ్చిన మాకు, యీ బంగాళా స్వర్గతుల్యముగా కనుపడెను. "హరిద్వారము వదలినతర్వాత యిట్టి బస యెరుగము" అని, రాజంగారి స్త్రీలు ప్రశంసించిరి. బంగాళాచుట్టూ బహురమణీయమగు గులాబీ తోట కలదు. అనేకరంగులు గలిగి, కొన్ని పుష్పములు అరచేతియంత పరిమాణముగలిగి యుండెను. ఈపూవు మొక్కలనడుమ కూర్చుండబెట్టి, రాజంగారు వారిన్నీ, వారి స్త్రీలకున్నూ, రావల్ గారి కుమార్తెకున్నూ, ఫోటోలు తీసిరి. సాయంకాలపు ప్రయాణము మానివేసి, యిక్కడ రాత్రి హాయిగా విశ్రమించితిమి.

౧౬-౫-౩౯: ఉదయమున ౫ ఘం॥కు బయలుదేరితిమి. రెండుమైళ్ల దూరమునున్న విష్ణుప్రయాగ వరకూ, ఒక్క వరుసను కొండ దిగుట. విష్ణుప్రయాగ చట్టీలు మురికిగా నుండెను. ఘాట్‌చట్టీయొద్ద నా మిత్రులు కాఫీచేసుకొని త్రాగిరి. నది బహుసమీపమున నున్నది. మంచుకరిగి వరదవచ్చుచున్నందున, నీరు మడ్డిగాను, మంచువలె శీతలముగాను నుండెను. ఘాట్ చట్టీకిన్నీ, విష్ణుప్రయాగకున్నూ, నడుమ రెండు పెద్ద పర్వతములనడుమ నది ప్రవహించుచున్నది. ఇక్కడ హిమవంతుడు భయంకరాకృతితోగూడిన చక్కదనము గలిగి యుండెను.

మార్గము బహుకష్టముగా నుండెను. అందరమూ పూర్తిగా అలసిపోయి, ౯౼ ఘంటలకు పాండుకేశ్వరము చేరితిమి.

పాండుకేశ్వరము: పూర్వము పాండవులు స్వర్గారోహణమునకు బోవుచు, నిచ్చట యాగము చేసిరని చెప్పుదురు. చూడదగిన యాలయ మొకటి కలదు. ఇది పాండవుల ప్రతిష్ఠయని చెప్పుదురు. పీకి గ్రామము. చాలా దుకాణములు, సదుపాయమైన చట్టీలు గలవు.

సాయంత్రం ౩ ఘంటలకే బయలుదేరి ౭౼ ఘంటలకు లంబఘర్ చట్టీ చేరితిమి. చలి యెక్కువగా నుండెను. చట్టీకి, ఒకవైపున గోడలేనందున, చలిగాలి రాకుండా వెదురుతడికె లడ్డుపెట్టుకొంటిమి.

౧౭-౫-౩౯: ఉదయము ౫౼ కు బయలుదేరి ౭౼ ఘంటలకు హనుమాన్‌చట్టీ (౩ మైళ్లు) చేరితిమి. ఉన్నతప్రదేశములకు బోవునపు డాయాసముగా నుండునని చెప్పుదురు. ఇది మా కనుభవమునకు వచ్చినది. ఈ లక్షణము, మాయందరికంటె యెక్కువగా సోమన్నకు (వంటబ్రాహ్మణుడు) తటస్థించినది. కొంచెము నడచునప్పటికి ఆయాసము, వగ్గు వచ్చి నడువజాలక చాలాకష్టపడిపోయినాడు. ఒక గుర్రపుకట్టు కుదర్చెదను, దానిపై కూర్చొనమని యెన్నివిధములు జెప్పిననూ అంగీకరించలేదు. తనయజమాని నడచుచుండగా తాను గుర్రమునెక్కి వచ్చుట యితనికి మనస్కరించలేదు.

శ్రీ రావల్ సాహేబుగారు, మాకు సహాయార్థమై యిచ్చుటకు మాకెదురుగా జవానును బంపిరి.

ఇక్కడ నాలుగైదు పెంపుడు చమరీమృగములను జూచితిమి. చమరీమృగముల తోకలనుండి చామరములు చేయుదురు. ఇవి గోజాతిలోని మృగములు. గేదలయొక్క పోలికకూడా కలిసియుండును. వీటి పాలను ఆవుపాలవలె నుపయోగింతురు. ఇక్కడ మేము చూచినవి శ్రీ రావల్ గారికి జెందినవని వింటిని. వాటిప్రక్కను నన్ను నిలువబెట్టి, రాజంగారు కొన్ని ఫోటోలను తీసిరి.

శీతలప్రదేశ మగుటచే యెండబాధ లేనందునను, ఇక్కడనుంచి బదరికి చాలాకష్టమైనందునను మధ్యాహ్నము ౧౨ ఘంటలకే బయలుదేరితిమి. ఈరెండు మైళ్లును బహుకష్టమనిన్నీ, మంచుపైని నడువవలసి యుండుననిన్నీ కొందరు భయపెట్టిరి; కాని మేము చాలాఖులాసాగా నడువగలిగితిమి. రాజంగారు తడి మంచును బంతులుగా చేసి, యితరులపై వాటిని రువ్వుచూ హెచ్చరికను, వినోదమును గలిగించెను. మంచుమీద నడక అంతకష్ట మనిపించలేదు. కాళ్లు జారకుండా కొంచెము జాగ్రత్తగా మాత్రము నడువవలసి యుండును.

అలకనందానది కొన్నిచోట్ల పూర్తిగా మంచుచే కప్పబడి, మంచుగడ్డకు అడుగున ప్రవహించుచున్నట్లు చప్పుడుమాత్రము వినబడుచుండును.

ఒకచోట మంచు, గుహావలె యేర్పడినది, మూడువైపుల గోడలు పెట్టినట్లు మంచుగోడలును, రెండువైపున ఆర్చి (Arch) కట్టినట్లును ఉండెను. ఆగుహాద్వారమందు మేమందరమును నిలచియుండగా, రాజంగారు ఫోటో తీసిరి.

బదరి ఒకమైలుదూరమున్నదనగా, ఆలయము దృగ్గోచరమైనపుడు, యింకొకక్షణమునకే గమ్యస్థానము చేరితిమిగదా యని, మాయందరకును అపరిమితానందము గలిగినది. గ్రామముచేరి, పోస్టాఫీసులో మాకై వేచియున్న టెలిగ్రాములు, జాబులు, న్యూసు పేపర్లు తీసుకొంటిమి. హరిద్వారము వదిలినదిమొదలు, న్యూసు పేపర్లు లేనందున, పదిరోజులు ప్రపంచముతో సంబంధమేలేక, యెక్కడ నేమి జరుగుచున్నదీ తెలియని స్థితిలో నుంటిమి.



౪. బదరీనాథము - నరనారాయణపర్వతములు

మాకు యేర్పరచబడిన బసకు పోవుమార్గములో శ్రీరావల్ సాహేబుగారు మమ్ములను కలుసుకొని కుశలప్రశ్న చేసి సన్మానించిరి. వారు చేసినయేర్పాట్లకు కృతజ్ఞత దెలిపి బసకు చేరితిమి. నేపాల్ మహారాణీగారి ధర్మశాల పూర్తిగా మాకుబస యివ్వబడినది. ఇది సదుపాయమైన చక్కని రెండంతస్తుల బంగాళా. మం



౫. బదరీనాథాలయము

చుచే కప్పబడినప్పుడు కలిగిన నష్టమునకు, తలుపులు కిటికీలకు ఇంకా మరమ్మత్తులు చేయుచున్నారు. బంగాళాకు మూడువైపుల పెద్దగోడలు పెట్టినట్లు మంచు గోడలవలె నిలచియుండెను.

ఆలయమునకు సమీపమున నున్న ఉష్ణకుండమునకుబోయి, దానిలో మునిగి స్నానము చేసితిమి. ఉష్ణోదకస్నానము కలిగించిన యానందము చెప్పనలవి కాదు. శ్రమయంతయు నివారణమై, దేహమునకు స్వస్థత వచ్చినది. దేవళం మేనేజరు విజయరామ డిమ్రీగారు మమ్ములను కలుసుకొని, కావలసిన యేర్పాట్లు చేసి, పోకజవానును తైనాతీ యిచ్చిరి.

రాత్రి పూజాసమయమునకు ఆలయమునకు బోయి స్వామిదర్శనము చేసుకొంటిమి. యాత్రికుల సంఖ్య వందలకొలది యున్నందున, స్వామిదర్శనమునకు తోపులాడుచుండిరి. అలంకారము, పూజ, పురాణశ్రవణము రాత్రి పదివరకు జరిగినవి.

ఈరోజున చలియంత విస్తారము లేదు. ఊటీలో నున్నట్లున్నది.

౧౭-౫-౩౯: నేడు మధ్యాహ్నము బ్రహ్మకపా



౯. బ్రహ్మకపాలములో పిండములువేయుట

ములు తృప్తికరముగానే చెప్పెను. ఇది ముగించుకొని బసకు వచ్చినవెంటనే మబ్బు, చల్లనిగాలి ప్రారంభించి, వర్షము పడి, టెంపరేచర్ (Temperature) అయిదారు డిగ్రీలు తగ్గిపోయి శీతలము దుర్భర మాయెను. గదులలో దూరి, తలుపులు మూసుకొని లోపల గోడపొయ్యిలో అగ్నిజ్వాలకూడా పెట్టుకొన వలసి వచ్చినది. రాత్రి కొండలమీద విస్తారము మంచు పడినందున తెల్లవారుసరికి నరనారాయణ పర్వతములు మంచుతోనిండి పాదరసపు కొండలవలె తళతళ లాడుచుండెను.

౧౯-౫-౩౯: ఈరోజున రూ. ౧౦౧/ ల ఖర్చుతో స్వామికి అభిషేకము, అర్చన చేయించితిని. మాకు స్వామికి దగ్గరగనంత సమీపమున, కూర్చునుటకు స్థలము యేర్పాటుచేయబడెను. రావల్ సాహేబు గారు స్వయముగా బహు ఓపికతో అభిషేకము, అలంకారము, అర్చనచేసి కర్పూరహారతితో అన్ని విగ్రహములు బాగుగా దర్శనము చేయించి, వర్ణించి చెప్పిరి. తెల్లి మొదలు ౧౧ ఘంటలవరకూ కడుతృప్తికరముగా స్వామిసేవలో మగ్నులమై, దేహము మరచి యుంటిమి. ప్రభో! నీయనుగ్రహముచే యాత్ర సఫలమైనది!

సాయంత్రము తిరిగీ వర్షము పడనారంభించెను. సాయంత్రం ౩ ఘంటలకు రావల్ సాహెబుగారి దర్శనమునకు వెళ్లి వారితో నొక ఘంటపైగా ముచ్చటించితిమి. వారు మాకు స్వామిధరించిన పట్టుబట్టలు, ప్రసాదము ఆశీర్వచనపూర్వకముగా నిచ్చిరి.

౨౦-౫-౩౯: ఉదయమున శీఘ్రముగా భోజనములు చేసి, తొమ్మిదిఘంటలపావుకు బదరి వదలి తిరుగుప్రయాణము ప్రారంభించితిమి. దారిలో శ్రీ బదరీనాథుని దర్శనము తిరిగీ చేసుకొని పునర్దర్శన మెన్నటికైననూ ప్రాప్తియున్నదో లేదోయని చింతించుచు వెడలిపోతిమి.

సాయంత్రం పాండుకేశ్వరముచేరి శ్రీరావల్ గారి గృహములో బసచేసితిమి. చట్టీలకంటె యిది చాలా సదుపాయమైన బస.

౨౧-౫-౩౯: ఉదయము ౫ ఘం॥కు బయలు దేరి ౯ ఘం॥కు జోషీమఠము చేరితిమి. విష్ణుప్రయాగ నుండి జోషీమఠమువరకు ౨ మైళ్లొక్కవరుసనుకొండ యెక్కుట చాలా కష్టముగాను, ఆయాసముగాను ఉండెను.

శ్రీరావల్ గారి అతిథిగృహమున బసచేసితిమి. శ్రీబదరినాథ్ యొక్కయు, శ్రీనరసింహస్వామి యొక్కయు దేవాలయములు దర్శించితిమి. బదరీనాథ్‌కు యిక్కడ ౧౨ మాసములూ పూజ జరుగును. బదరిలో ఆరుమాసములే జరుగును. శ్రీ నృసింహస్వామి ఆలయములో విశేష మేమనగా పెద్దసాలిగ్రామము నృసింహాకృతినున్నది. ఇట్టిబాణములు అరుదని చెప్పిరి. ఈ యాలయపు పూజారి, తంజావూరు జిల్లానుంచి వచ్చిన తమిళబ్రాహ్మణుడు. ఈయన ౫ సం॥ క్రింద యిక్కడకు వచ్చి, యీ ప్రాంతముల స్త్రీని వివాహమాడి యిక్కడ శాశ్వత వాస్తవ్యులయిరి. అంతదూరమునుండి హిమవత్పర్వత మధ్యస్థమునకు కాపురమునకు వచ్చుట తమిళసోదరులకే తగును గాని, మనయాంధ్రు లిట్టి సాహసములు చేయజాలరు గదా!

సాయంత్రము మబ్బుపట్టి కొంచెము తుషారము పడుచుండెను. అయినప్పటికీ బయలుదేరి రాత్రికి

కుంభార్‌చట్టీ చేరితిమి. ఇది బాటసారులతో నిండి కిటకిటలాడుచుండెను.

౨౨-౫-౩౯ : ఉదయమున బయలుదేరి ౯ ఘంటలకు గరూర్‌గంగ (గరుడగంగ) చేరితిమి. చట్టీలలో యీగలబాధ దుర్భరము. చట్టీలో వైరాగులమధ్యస్థమున వంట. కంబళివాలాధర్మశాలలో బస చేసితిమి. గరుడగంగలో స్నానం చేసితిని. సాయంత్రమునకు పీయూసేన్ చేరితిమి.

౨౩-౫-౩౯ : ఉదయపు వంటకు కోహెడ్ చేరి మామూలు చట్టీలో దిగితిమి. సమీపమున కొండధారలో స్నానముచేసితిని. ఆహ్లాదకరముగానుండెను. మాచట్టీక్రింది అంతేస్తులో బెజవాడ గుడివాడపార్టీ ౩౦ మంది స్త్రీలునూ, పురుషులునూ విడిసిరి.

సాయంత్రమునకు నందప్రయాగ మామూలుబస. షాహుకారు మాకు పచ్చిమామిడికాయలు గుమ్మడికాయనుక్క పప్లయిచేసెను.

౨౪-౫-౩౯ : ఉదయం మకాం జయకండి; సాయంత్రమునకు కర్ణప్రయాగ. ఇక్కడ ఆయుర్వేద డాక్టరు గోవిందరాం మాకు చాలా సహాయము చేసెను.

౨౫-౫-౩౯ : ఉదయం హరిఆశ్రమం చేరితిమి. దారిలో చిన్నవింత జరిగెను. డెబ్బది యేళ్ల వయస్సుగల వృద్ధురాలగు నుత్తరదేశస్త్రీ రోడ్డుమీదకూర్చొని యేడ్చుచుండెను. ఆమె ప్రక్కనొక "ఖండీ" పడియుండెను. "ఎందుకు యేడ్చుచున్నావమాయీ" యని యడుగగా, ఖండీలో యీమె ప్రయాణము చేయుచుండె ననియు ఖండీవాలా యజాగ్రత్తచే నీమెను క్రింద పడవేసె ననియు చెప్పెను. ఆమెవంటి పైమన్ను బూడిద తుడిచి యోదార్చి ఖండీవాలాను చీవాట్లు వేసితిమి. ఆమె మోకాలు, మణికట్టు వద్ద, పగిలి రక్తము కారుచుండెను. ఇట్టి ప్రమాదముల కుపయోగించుటకు యెప్పుడూ నా జేబులో జాంబక్ (Zambuk) డబ్బా ఉంచుకొనుచుంటిని. ఆమె గాయములకు జాంబక్ రాసి, మా యొద్దనున్న అరటిపండ్లు కొన్ని యామె కివ్వబోగా యంగీకరించినదికాదు. తాను తీర్థయాత్రలకై యిల్లువెడలి యెనిమిదిమాసము లాయె ననియు యింతకాలమునుండి తిరుగుచుంటి ననియూ చెప్పి తన చేతిలో నొక చిన్న పటము కృష్ణవిగ్రహము కళ్ల కద్దుకొనుచు తిరిగీ యేడ్వ నారంభించెను. "నాకు తగిలిన దెబ్బలకు యేడ్చుట లేదు. కాని, ప్రేమతో జూచుకొనుచున్న యీ పటము అద్దము పగిలిపోయినందుకు యేడ్చుచున్నా" నని పలికెను. ఏమీ! యీమె భక్తి! పురుషులు భక్తి స్త్రీలయొద్ద నేర్చుకొనవలసియున్నది.

సాయంత్రమునకు శివానంది చేరితిమి. తిరిగీ యుష్ణప్రదేశములోనికి వచ్చితిమి. వేడి చాలా యెక్కువగా నుండెను. రాత్రి ౮ ఘంటలకుకూడా వేడిగాలి వీచుచుండెను. చట్టీలు యాత్రికులతో నిండియున్నవి. మాచట్టీలో యింకొకపార్టీ అయిదుగురు మాప్రక్కనే బసచేసిరి. వారూ మేమూ కలిసి పరుండవలసివచ్చెను.

సాలూరుకోమట్లలో నొకరికి వాంతులు, భేదులు ప్రారంభించినవి. రాజంగా రతని కేదో మందిచ్చిరి. ఆస్థితిలోనే అతను మర్నాడుదయము కాలినడకను బయలుదేరవలసి వచ్చినది.

౨౬-౫-౩౯ : ఉదయమునకు గులాబ్ రాయి మకాం. సాయంత్రమునకు కంకారా.

గులాబ్ రాయికి నార్‌కోటకు మధ్యను ౧౨ మైళ్లు కొండ యెక్కుడు. వేడిమి యెక్కువగానున్నందున కొండ యెక్కుట చాలా కష్ట మాయెను. తర్వాత కొండ దిగుట. తర్వాత యింకొక కొండ యెక్కి దిగి కంకారా చేరితిమి. దారిలో ౭౦ సం. వయస్సు గల వృద్ధ యాత్రికురాలిని కలిసితిమి. ఆమె నడుము పూర్తిగా వంగిపోయి, నడుమువద్ద సమకోణముగా వంగి కర్రపై యానుకొని నడచును. ఈమె యాత్రయంతయూ నడచియే చేయుచుండెను. కూడా సామానులు మోసుకొనివచ్చు కూలీమాత్ర మొకడు ఉండెను. ఇంత వృద్ధురా లెట్లు నడచుచున్నదో యని యాశ్చర్యము గలిగి యామెను పలుకరించితిమి.

"మాయీ! బదరీ గయీ థీ" (అమ్మా! బదరీ వెళ్లినావా?"

"గయా" (వెళ్లినాను.)

"కేదార్‌నాథ్ గయా?"

"గయా"

"గంగోత్రీభీ గయా?" (గంగోత్రీకూడా వెళ్లితివా?)

"గయా." (వెళ్లితిని.)

ఆమె ధైర్యమునకు దృఢసంకల్పమునకు మేము సిగ్గుపడి తల వంచుకుని వెడలిపోయితిమి. ఉష్ణ మధికముగా నుండుటచే కంకారాచట్టీప్రక్క నున్న జలప్రవాహములో ముఖము కడుగుకొనుటకుఁ బోవుచు, రాళ్లమీద కాలు జారి, అడవి దూలగొండిపై బడితిని. చేతులకు దూలగొండి తగిలెను. చేతులు దురదయేకాక తిమ్మిరియెక్కెను. దూలగొండి యొక్క ప్రభావ మొకపూట బాధించినది.

౨౬-౫-౩౯: ఉదయము సుకృతచట్టీలో మకాం. దారిలో నొక కొండయెక్కి దిగితిమి. అంత కష్టముగా లేదు.

ఇది యొక దౌర్భాగ్యమగు చిన్నచట్టీ. దీనిని చేరి, చీకటికొట్టువంటి మట్టిగోడల పూరిగది యొకటి కలదు. ఇది మదరాసులో మే ముపయోగించు మరుగు దొడ్లయంత రంజకముగానైనా లేదు. ఈగదికొరకు నాకును యింకా కొందరు తీర్థవాసులకును పోటీ పడినది. దుకాణదారుచేతిలో నొకపావలా పెట్టి అందరికంటెను ముందు నేను దాని నాక్రమించితిని. దానిలో పరుండియుండ, చిత్రమైన మనోభావములు కలిగినవి. దివ్యభవనములను కలక్టరు బంగాళాలలో నివసించినవాడను యిట్టిదీనమగు చీకటికొట్టునకై పోటీపడవలసివచ్చినదికదా! ఇక్కడ యీచీకటిగదే దివ్యభవనముగా నున్నది. అహంభావము పోయి యెట్టి పరిస్థితులకైనను మనస్సు సరిపుచ్చుకొనుట యిట్టి తీర్థయాత్రలకు ఫలము.

సాయంత్రమునకు శ్రీనగరము. వేడిమి బహు తీక్ష్ణముగా నుండెను. దీపాలవేళకుకూడా చల్లబడలేదు దీనికితోడు చుట్టూకొండలపై కారుచిచ్చులు, పెద్ద జ్యోతులవలె కన్పట్టుచు, ప్రచండవాయువుచే ప్రజ్వరిల్లి, అగ్నిహోత్రుడు తన జాలుకలతో సమీప వృక్షములనందుకొని భక్షించుచు వేడిమి నింకయును హెచ్చించుచుండెను.

౨౭-౫-౩౯: ఉదయమునకు రామాపురము; సాయంత్రమునకు రాణీబాగ్. ఎందుచేతనో ఆకలి చాలా మందగించెను.

౨౮-౫-౩౯: ఉదయము ౮౼ ఘంటలకు దేవప్రయాగ. ఇప్పటితో నడక పూర్తియైనది. పగలు నడక, సాయంత్రం నడక. రోజూ నడకతో ప్రాణం విసిగి పోయినది!

ఆకలి బాగా మందగించినది. ఏకాదశి దినమునే అలకనందలో స్నానముచేసి ఉపవాసము చేసితిని.

౩౦-౫-౩౯: మాకును, రాజంగారిపార్టీకిని కలిసి, ఆరుసీట్లుగల ప్రైవేటు టాక్సి (Taxi) హృషీకేశమునకు యేర్పరుచుకొని, ఉదయము ౫-౧౫ కు బయలు దేరితిమి. కొండలలో ప్రయాణములు ముగిసి దేశములోనికి వచ్చుచుంటిమి గదా యని అందరకును చాలా ఉత్సాహముగా నుండెను. ౯ ఘంటలకు లక్ష్మణఝూలాచేరి, నొకఘంట యిక్కడ గడిపితిమి. గంగాస్నానము బహు ఆనందకరముగా నుండెను. స్నానమైనవెనుక నది యొడ్డున తెల్లటి యిసుక తిన్నెలపై గూరుచుండి, మా వెంటగొని వచ్చిన పెరుగు సాదం కొళంబుసాదము భుజించితిమి. ఎండ బహు తీక్ష్ణముగా నుండెను. నదియొడ్డునుండి మోటారువద్దకు మూడు ఫర్లాంగులు యెండలో నడచుటచే వొడగొట్టినట్లు సొమ్మసిలి హృషీకేశము చేరినతోడనే, మంచు గడ్డ చేర్చిన లిమనేడుబుడ్లు త్రాగేవరకూ ప్రాణము తెప్పిరిల్లలేదు. తొమ్మండుగుర మొక ప్రత్యేకపు బస్సుకుదుర్చుకొని ౧౧ ౼ కు హరిద్వారము చేరితిమి. స్వగృహము చేరిన ట్లానందము గలిగెను.

ఇక్కడనుండి ౩-వ తేదీని ప్రారంభించిన యాత్ర, శ్రీబదరీనాథుని కృపచే నేడు సురక్షితముగా ముగిసెను.

"సర్వేజనా స్సుఖినో భవంతు"

# "కృషితో నాస్తి దుర్భిక్షమ్"

శ్రీ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి

శ్రీరమ్యంబగు రాజతాచలమునన్ జెన్నారు గంగానదీ
తీరస్థాయి విశాలవృక్షముల నెంతే దట్టమై పొల్చు వి
స్తారామోదద మా లతాగృహమునన్ దాక్షాయణిన్ గూడి లో
కారాధ్యుండగు చంద్రశేఖరుఁడు బ్రహ్మానందమున్ బొందుచోన్.

ఒకసమయంబునన్ వినయయుక్తి భవాని మహేశుతోడ నిం
చుక దరిఁ జేరి యిట్లనె విశుద్ధచరిత్ర! ప్రసంగవైఖరిన్
బకపక నవ్వి "నీమగఁడు భైక్షుకవృత్తిఁ జరించు" నంచుఁ జం
కక నెకసక్కెముల్ సలిపి క్రమ్మఱ నిందిర వల్కె నివ్విధిన్.

రమణీ! కోపము జెందవేని హితమున్ రవ్వంత యాలింపు ని
క్కము దాపన్ బనియేటికిన్ "భవతి భిక్షాం దేహి యంచున్ గపా
లముఁ గేలన్ ధరియించి భైక్షుకునిలీలన్ శూలి యింటింటికిన్
భ్రమణంబున్ దగ సల్పు"నంచుఁ బలుకన్ వారించి సావేశనై.

అరవిందోద్భవుఁ గాంచి యి ట్లనితి నీ యాత్మేశుఁ డస్మన్మనో
హరునిన్ మించినవాఁడు గాదె యిఁక నీహాస్యంబులున్ జెల్లునే
"హరయే సంప్రదదే నమే" యనుచుఁ దా నర్పింపఁడే భూమి నీ
హరి కానాఁడు నభన్ బలీంద్రుఁ డనినన్ వ్యాజోక్తి నిట్లాడెఁ దాన్.

సిరిగలవాని కేదియును, జెల్లదె దానముగాని హేయపుం
దిరిపెముఁ గాని, దానికయి తీవ్రతఁ దాల్చి వివాద మివ్విధిన్
దరుణి యొనర్ప నేటికి యథార్థము జెప్పెద "నాదిభిక్షువన్"
బిరుదము శూలికే పొసఁగె! నీ వది కాదని యన్నఁ బోవునే!

అని యాభార్గవి దెల్ప సిగ్గిలితి దేవా! యాదిభిక్షుండ వం
చని నిన్ లోకులు వల్కనోర్తునెటు కుయ్యాలించి సేద్య మ్మిఁకన్
నను మన్నించి యొనర్పలేరె! "కృషితో నహ్యాస్తి దుర్భిక్ష" మం
చను నార్యోక్తి నెఱుంగరే యన; భవుం డాయింతితో నిట్లనున్.

"వచ్చినవాఁడు నెప్పటికి వమ్మయిపో"దనునట్టి సామెతన్
మచ్చునకేని వింటివె, ప్రమాదము వచ్చిన వచ్చుఁగాక నీ
ముచ్చటఁ దీర్తుఁ; "ద్రాఁడు మతి బొంగర"మింతకు లేనినాఁడు నీ
వెచ్చటినుండి తెత్తు కృషి కింపగు సాధన మన్న నవ్వుచున్.

హరికడ భూమిఁ గోరుము; దదగ్రజు వేఁడి హాలమ్ముఁ గొమ్ము; నీ
వరసఖుఁ డిచ్చు బీజములు; వాహన ముండె; యముండు దున్న నే
మర కిడు; శూల మున్నది; కుమారుఁడు గాపరి; కూడు దేర నే
నిరవుగ నుంటిఁగాఁ బశుపతీ! కృషి సల్పు మనంగ గౌరినిన్

భవుఁ డంతన్ మది మెచ్చి; యట్టులె జగద్భద్రానుసంధాయి నా
ట; వృథా భైక్షుకవృత్తి మానకయె రెంటన్ దేవి! వర్తింతు నం
చు విశేషజ్ఞుఁడు గొఁగిటన్ దనిపె నచ్చో గౌరి లాలింపుచున్
భువి నెందేని సతుల్ మనోవిభుల సమ్మోహాబ్ధిఁ దేలింపరే!

---

# పండ్లవ్యాపార పరిశీలన*

శ్రీ "ఉపాధ్యాయ" వి. సి.

వ్యాపారాభివృద్ధిశాఖ ౧౯౩౪-వ సం॥లో ఏర్పడింది. ఆ సంవత్సరంలో జరిగిన 'రాష్ట్రీయ ఆర్థిక సమావేశము' (**Provincial Economic Conference**) వ్యాపారాభివృద్ధికి సదుపాయము చేయడానికి ప్రత్యేక శాఖను నియమింపజేసింది.

ఈ శాఖవారు ప్రతిగ్రామానికి వెళ్లడం, అక్కడ ఉత్పత్తిఅయ్యే ముఖ్యపంటలనుగూర్చి రైతుల దగ్గర్నుంచి, వర్తకుల దగ్గర్నుంచి, ఎగుమతి దిగుమతిదార్ల దగ్గర్నుంచి, మధ్యవర్తుల దగ్గర్నుంచి, వ్యాపార సంబంధమైన విషయాలను సంగ్రహించి, అందులోని లోటుపాట్లను ప్రకటిస్తూ అభివృద్ధివిధానాలను సూచించడం - వీరి ముఖ్యమైనపని. గత నాలుగుసంవత్సరాలలో యిరవై అయిదు ముఖ్య పంటలయొక్క వ్యాపార పరిశీలన పూర్తిగా చేశారు. ప్రస్తుతం ఫలముల వ్యాపారమునుగూర్చి సమగ్రంగా తెలియజేస్తాను.

ప్రస్తుతపు వ్యవసాయ విధానంలో రైతుకు ఏకొంచెమో లాభం వచ్చిందీ, అంటే అది పండ్లతోటల మూలాన్నే అని చెప్పవచ్చు. పండ్లు మనిషియొక్క ఆరోగ్యానికి ఎక్కువగా అవసర మవడంచేత వీటికి చెలామణీ చాలా ఎక్కువ. మనరాజధాని - ముఖ్యంగా మన ఆంధ్రదేశంలో పండ్లను విరివిగా పండించేందుకు ప్రకృతిసిద్ధమైన సదుపాయాలు ఎన్నో వున్నాయి కాని యింతవరకు దూరపు ప్రాంతాలకు వాటిని ఎగుమతిచేసే సదుపాయాలు తక్కువ కావడంచేత, పండించిన ప్రదేశంలో వెల చాలాతక్కువ అవడంచేత, ఈ పరిశ్రమ మనదేశంలో తల ఎత్తుకో లేకపోయింది.

హిందూదేశంలో వున్న వివిధరాష్ట్రాల్లోకీ చెన్నరాజధాని పండ్ల ఉత్పత్తిలో ప్రథమస్థానాన్ని ఆక్రమిస్తుంది. ఆంధ్రరాష్ట్రమే వేరుపడడం తటస్థిస్తే ఈ స్థానాన్ని ఆంధ్రరాష్ట్రం ఆక్రమించగలదు. ఆ సంగతి ముందుముందు గ్రహించవచ్చు. మనరాజధానిలో పండే పండ్లలో మామిడి, నారింజ, నిమ్మ, ద్రాక్ష, అనాస, అరటి, ఏపిలు, బేరి-పండ్ల పరిశీలన పూర్తిగా జరిగింది.

ఈ పరిశీలన రైతులకూ-ముఖ్యంగా పండ్ల తోటలు గలవారికి—వర్తకులకూ, పరిశ్రమలు స్థాపించే ఉత్సాహమున్న యువకులకూ అమూల్యమైనదని చెప్పవచ్చు.

ప్రథమంలో ఏ ఏజాతులు, ఎన్నెన్ని ఎకరాల భూముల్లో పండించబడు తున్నాయో, ఎగుమతి దిగుమతులు ఎలావున్నాయో తెలుసుకునేందుకు రాబోవు పుటలో పట్టిక సహాయపడుతుంది.

వివిధఫలవ్యాపారాలను ప్రత్యేకంగా పరిశీలన చేద్దాం.

**౧. మామిడిపండ్లు :—**

ఎక్కువగా ఉత్పత్తిఅయ్యే జిల్లాలు క్రమంగా:-

౧. విశాఖపట్నంజిల్లా
౨. తూ॥ గో॥ జిల్లా
౩. కడపజిల్లా
౪. చిత్తూరుజిల్లా
(౧-౪: ఆంధ్రరాష్ట్రంలోనివి)

౫. ఉత్తరఆర్కాటు&మలబారు(చెన్నరాష్ట్రంలోనివి)

ఈ ప్రదేశాలు మొత్తం - ప్రతిసంవత్సరమూ-౪,౦౦,౦౦౦ రైల్వే మణుగులపండ్లను ఎగుమతి చేస్తున్నాయి.

* "Marketing Survey of Fruits

దిగుమసంఖ్యలు వేల రైల్వేమణుగులలో యివ్వబడినవి.

| ఫలము పేరు | విస్తీర్ణం ఎకరాల్లో | వ్యాపారానికి పనికొచ్చే ఉత్పత్తి. | దిగుమతి | ఎగుమతి | మొత్తం |
|---|---|---|---|---|---|
| అరటిపండ్లు ... | ౧,౩౨,౭౭౭ | ౩౩,౨౯౧ | ... | ౨౦౬ | ౩౩,౦౮౫ |
| మామిడి ... | ౨,౪౪,౯౪౫ | ౨౦,౦౦౦ | ... | ౪౦౦ | ౧౯,౬౦౦ |
| నిమ్మపండ్లు ... | ౮,౫౦౦ | ౧,౨౧౫ | ౫ | ౧౧౭ | ౧,౧౦౩ |
| నారింజలు ... | ౧౩,౦౦౦ | ౪౪౭ | ౧౩౪ | ౨౦ | ౫౬౧ |
| బేరిపండ్లు (Pears)... | ౫౦౦ | ౨౧౫ | ... | ౯ | ౨౦౬ |
| అనాస ... | ౩౩౦ | ౪౫ | ౪ | ... | ౪౯ |
| ద్రాక్ష ... | ౨౫౦ | ౧౮ | ౭ | ౧ | ౨౪ |
| ఏపిలు ... | ... | ౧ | ౧౩ | ... | ౧౩ |

| ముఖ్యంగా దిగుమతి చేసుకొనేరాష్ట్రాలు | రైల్వేమణుగులలో |
|---|---|
| ౧. మధ్యపరగణాలు | ౮౩,౦౦౦ |
| ౨. బొంబాయి | ౫౫,౦౦౦ |
| ౩. పంజాబు | ౫౨,౦౦౦ |
| ౪. హైదరాబాదు | ౫౧,౦౦౦ |
| ౫. బెంగాలు | ౪౧,౦౦౦ |
| ౬. సరిహద్దు ప్రాంతాలు | ౨౨,౦౦౦ |
| ౭. బీహారు, ఒరిస్సాలు | ౩౨,౦౦౦ |
| ౮. బర్మా | ౨౬,౦౦౦ |
| ౯. ఢిల్లీ | ౧౯,౦౦౦ |
| ౧౦. ఇండోరు | ౮,౦౦౦ |

ఒక్క మలబారు తప్పించితే మిగతాజిల్లాలన్నీ మామిడిపండ్లను ఒకేకాలంలో ఉత్పత్తి చేస్తున్నాయి. అందుచేత ఎగుమతిదార్లకు, వర్తకులకు పంట ప్రదేశాల్లోనూ, దిగుమతిరాష్ట్రాల్లోనూ కూడా, విపరీతమైన పోటీ ఏర్పడి, కష్టంకలుగుతూంది. చాలాసార్లు వర్తకులకు ఆఖరికి రైలుచార్జీలు కూడా కిట్టక ఎంతో నష్టం భరింపవలసిన అగత్యం ఏర్పడుతూంది. అందుచేత ఈక్రింది సలహాలను మామిడితోటలు గల రైతులు గమనించాలి.

౧. మామిడితోటలను యింకా ఎక్కువగా విస్తరింపజేసే ప్రయత్నాలను బాగా తగ్గించాలి.

౨. మామిడితోటలను వేయదలచుకుంటే, మంచిజాతులను అరుదైన వాట్లను ఎంచి పెంచడం లాభదాయకం.

౩. అకాలంలో కాపు కాచే రకాలన్నీ ఎక్కువగా పెంచాలి. ఈలాంటితోటలు మనరాజధానిలో టిన్నవెల్లి, కోయంబత్తూరు, తంజావూరు, సర్కారు ప్రాంతాల్లో వున్నాయి.

౪. పండ్లతోటలు గలరైతులు సంఘాలక్రింద ఏర్పడి వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోవాలి.

ఈలాంటి 'పండ్ల ఉత్పత్తిదారుల సంఘాలు' ఈమధ్యనే, విజయనగరంలోనూ, పుత్తూరు (చిత్తూరు జిల్లా), కోడూరు (కడపజిల్లా)లలోనూ ఎగుమతిని వృద్ధి చేయడానికి స్థాపింపబడ్డాయి.

ప్రస్తుతం వున్న అమ్మకపుకష్టాలు విదేశాలకు పంపే ఏర్పాటుచేస్తే పూర్తిగా తగ్గిపోతాయి. విదేశాల ఎగుమతికి — ఎంతో అవకాశం వుంది. ఎంచేతంటే మామిడిపండ్లు ఆదేశాల్లో చాలాఅరుదు. ఒక్క మెక్సికో, పెరూ, ఈజిప్టు తప్ప మిగతదేశాల్లో ఈ పంట లేదు. ఈ పైవిధానపు ఎగుమతికి మూడువిషయాలు చాలా ముఖ్యం.

౧. ప్రభుత్వ సహాయం

౨. పండ్ల ఉత్పత్తిదారుల సంఘీభావం.

౩. **'Cold storage'** — మంచుతో నిలవచేసి ఎక్కువకాలందాకా పండ్లను కాపాడు మార్గాన్ని అమలులో పెట్టటం.

అన్ని సదుపాయాలూ రెండవ విషయం— సంఘీభావం—మీద ఆధారపడి వున్నాయి.

౨. అరటిపండ్లు:—

అరటిపండ్ల యెగుమతి వ్యాపారము రెండవ స్థానాన్ని ఆక్రమిస్తుంది. ౧౯౩౬-౩౭-వ సం॥లో మనరాష్ట్రంనుండి యితర రాష్ట్రాలకు ౨,౦౬,౦౦౦ రైల్వే మణుగుల ఎగుమతి చేయబడింది. ఈ సరుకును దిగువ పేర్కొన్న రాష్ట్రాలు క్రమంగా దిగుమతి చేసుకున్నాయి.

| | | |
|---|---|---|
| ౧ మైసూరు | ౯౦,౦౦౦ | రైల్వేమణుగులు |
| ౨ బీహారు - ఒరిస్సా | ౪౬,౦౦౦ | " |
| ౩ నైజాము రాష్ట్రము | ౪౦,౦౦౦ | " |
| ౪ ఢెల్లీ | ౧౧,౦౦౦ | " |
| ౫ మధ్యపరగణాలు | ౧౧,౦౦౦ | " |
| ౬ వంగరాష్ట్రము | ౫,౦౦౦ | " |
| ౭ పంజాబు | ౩,౦౦౦ | " |

(ఉత్తర హిందూస్థానానికి పోయే పండ్లు ముఖ్యంగా గోదావరి, కావేరి డెల్టాభూముల్లో ఉత్పన్న మయినవే.)

ఈమధ్యనే అరటితోటలను మైసూరు రాష్ట్రములో ఎక్కువగా పెంచడం ఆరంభించారు. దానితో మన జిల్లాలనుంచి రవాణా చాలావరకు తగ్గిపోయింది. ౧౯౩౪-౩౫ సంవత్సరాల్లో మైసూరుకు ౧,౩౦,౦౦౦ రైల్వేమణుగుల ఎగుమతి అయింది మనరాష్ట్రంనుంచి. కాని పైన చెప్పబడ్డ కారణంచేత ౧౯౩౬-౩౭-వ సంవత్సరంనాటికి ౯౦,౦౦౦ రైల్వే మణుగులలోకి దిగింది.(౪౦,౦౦౦రై॥మణుగుల ఎగుమతిపడిపోయింది.)

వ్యవసాయ శాఖవారి సిఫార్సువల్ల గోదావరీ ప్రాంతంనుంచి ఢిల్లీ, లాహోరు, ప్రాంతాలకు అరటి పండ్లను పంపించడంలో రైల్వేవారు చాలా సదుపాయాలు చేశారు. రైలు ఎగుమతి ఛార్జీలను తగ్గించారు. దూరప్రాంతాలకు పోయే 'వేగను' పెట్టెలకు కిటికీలను పెట్టించారు. దీనిమూలంగా, సూర్యరశ్మి' గాలీ పండ్లకు తగలడంచేత చాలారోజులు నిలవ వుండ గలుగుతాయి.

గోదావరీప్రాంతంనుంచి ఉత్తరహిందూస్థానానికి పండ్లను ఎగుమతి చెయ్యడం కావేరీప్రాంతంనుంచి పంపడం కన్న చాలసులభం. ఒకవేగనుకు రూ. ౪౦౦ తక్కువ కావడం, పండ్లు కొంచెం కాలంలోనే చేరుకోవడంచేత తక్కువధరకు కూడ అమ్మవచ్చు. మచ్చుకు గోదావరినుంచి ఎగుమతి చేసిన ఒకవేగను అరటిపండ్లసంగతి—అంటే వాటిని పండించినరైతుకు, అమ్మినవర్తకుడికి, ఎగుమతి చేసిన మధ్యవర్తికి, ఎంతెంత లాభాలు వస్తాయో ఉదాహరిస్తున్నాను.

"గోదావరి డెల్టా రైతుకు రెండు ఎకరాల అరటితోట వుందనుకోండి. అరటి మొక్కల్ని 'అరదుగులు' మొక్కకూ మొక్కకూ, ఎడంపెట్టి పాతుతాడు. ఆప్రకారం రెండెకరాల్లోను ౨౪౦౦ మొక్కలు వెయ్యవచ్చు. ఎకరానికి మొక్కనాటినది మొదలు పంటపండేవరకు అయే 'సాగుబడిఖర్చు' ౨౦౦ రూ. అందుచేత రెండు ఎకరాలకి సగటున ౪౦౦ రూ. సాగుబడి ఖర్చు అవుతుంది. సంవత్సరం ఆఖర్న పరిస్థితులు సమంగా వుంటే, చెట్టుకు ఒక గెల చొప్పున ౨౪౦౦ గెలల అరటి పండ్లు దిగుతాయి.

ఈరైతు గెల ఒక్కంటికి ౪ అణాలు చొ. ౨౪౦౦ గెలలను } ౬౦౦ రు.లకుఅమ్ముతున్నాడు.

| | |
|---|---|
| ఇతనికైన సాగుబడి ఖర్చు | ౪౦౦ రూ. |
| రైతుకు వొచ్చే లాభం రెండెకరాలమీద | ౨౦౦ రూ. |
| ఎకరానికి | ౧౦౦ రూ. |

ఎగుమతిదారునికయ్యే ఖర్చులు—

| | |
|---|---|
| పండ్లకొనుబడి | ౬౦౦ రూ. |
| రైల్వేఛార్జీ వేగనుకు (ఢిల్లీవరకు) | ౭౦౦ రూ. |
| ఇతర అవసరపు ఖర్చులు | ౩౦౦ రూ. |
| అంచనావేసుకున్న లాభం | ౧౫౦ రూ. |
| మొత్తం. | ౧౭౫౦ రూ. |

| | |
|---|---|
| దిగుమతిదారుని కొనుబడివెల | ౧౮౫౦ రూ. |
| దిగుమతిదారుని అంచనాలాభం | ౧౫౦ రూ. |
| చిల్లరవర్తకుని కొనుబడి ధర | ౨౦౦౦ రూ. |
| ,, లాభం | ౧౫౦ రూ. |
| ,, అమ్మకపు ధర | ౨౧౫౦ రూ. |

ఉత్పత్తి చేసే రైతుకు గెల ఒక్కంటికి నాలు గణాలు కిట్టినాయి. తినేవాళ్లకు గెలఒక్కంటికి పదహారణాలు చొ. కిట్టింది. ఉత్పత్తి చేసేరైతుకు ఒకగెల మీద ఒక అణా నాలుగుపైసలు మాత్రం లాభంవుంది. మిగతా దంతా మధ్యవర్తులపాలు. కొనుబడిదారు **(Consumer)** దగ్గరకు వెళ్లేప్పటికి ఖర్చు అమితంగా అయిపోతూంది.

పండ్లను పండించేవారు సంఘాలని స్థాపించుకొని మధ్యవర్తుల అవసరం లేకుండా ఎగుమతి వ్యాపారం నడిపించితే వాళ్లకు యింకా ఎంతలాభం వస్తుందో ఈపై ఉదాహరణ తెలియ జేస్తుంది.

ప్రపంచంలో అరటిపండ్లను దిగుమతి చేసుకొనే దేశాలు:—

౧. అమెరికా సంయుక్తరాష్ట్రాలు.

౨. ఫ్రెంచిదేశము, మొదలయినవి.

ఎగుమతిచేసే దేశాలపేర్లు:—

జమైకా, మెక్సికో, పెనామా, క్వాటిమాలా.

మనరాష్ట్రానికి ముఖ్యపట్నమైన చెన్నపట్నం సంవత్సరానికి,౨,౫౦,౦౦౦ రై. మణుగులఅరటిపండ్లను ఖర్చుచేస్తుంది. ముఖ్యంగా కావేరీ ప్రాంతంనుంచి వచ్చిన రసథాళీ, పూవన్ అనేరకాలు ౬౦,౦౦౦ మణుగులుదాక ఖర్చుపడుతున్నాయి. మిగతావి యితర ప్రదేశాల్నుంచి వస్తున్నాయి.

### ౩. నిమ్మ, నారింజజాతులు:—

ఈ పదిసంవత్సరాల్లోనూ నారింజతోటల విస్తీర్ణం బాగా ఎక్కువయింది. ౧౯౩౧-౩౨-వ సం॥లో ౧౦,౦౦౦ల ఎకరాల్లో నారింజతోట లుంటే— ౧౯౩౮-౩౯ నాటికి ౨౨,౦౦౦ల ఎకరాలవరకు హెచ్చింది. మొత్తం ౧౨వేల ఎకరాల విస్తీర్ణం పది సం॥ల్లో హెచ్చింది.

౧౦౦-కి ౬౫ నారింజతోటలు మనరాజధానిలో కాపుకు రాలేదు. (లేతవి)

ఇంకామనరాజధాని నారింజల్ని యితరప్రదేశాల్నుంచి దిగుమతి చేస్తూంది:

మధ్యపరగణాల్నుంచి సాంత్రారకము— ౭౪,౦౦౦ రై॥మణుగులు.

కూర్గునుంచి కమలారకం — ౬౦,౦౦౦ రై॥మ.

ఈ విస్తారపు దిగుమతిసంఖ్యచూస్తే నారింజలకు ఎక్కువఖర్చు వుందనీ, మనరాష్ట్రంలో యింకా నారింజతోటలు వేసి పెంపొందించడానికి అవకాశముందనీ స్పష్టపడుతూంది.

చెన్నరాజధాని ఉత్పత్తి — రకముల వారీగా:—

| | | |
|---|---|---|
| సాతుగుడి నారింజలు | ౯౬,౦౦౦ | రై॥ మణుగులు |
| బత్తాయినారింజలు | ౯౯,౦౦౦ | ,, |
| పుల్లనారింజలు | ౧,౩౦,౦౦౦ | ,, |
| ఇతరజాతులు | ౧,౩౯,౦౦౦ | ,, |

ప్రపంచం అంతలోకి అమెరికా, మధ్యధరా సముద్ర ప్రాంతాలు ఎక్కువగా నారింజల్ని ఉత్పత్తి చేస్తాయి.

ప్రపంచపు మొత్తంపంట ౫౩ లక్షల టన్నులు.

అమెరికామాత్రం ౧౭ లక్షల టన్నులు.

'సర్కారుల' ప్రాంతాల్లో కమలాఫలాల్ని ఎక్కువగా పండించేందుకు మంచి అవకాశాలు వున్నాయి. నారింజతోటల వ్యవసాయంలో 'అంటు' పద్ధతిపై తోటలు పెంచడం ముఖ్యమైనది.

నారింజల వ్యాపారానికి కోడూరులో 'పండ్ల ఉత్పత్తిదారుల సంఘం' ఈమధ్యనే ఓటి స్థాపించబడింది.

పుత్తూరులోకూడా యింకో సంఘం —సాతుగుడి నారింజలను ఉత్తరాదికి పంపడానికి ఏర్పడింది.

చెన్నపట్నంలో నారింజలఖర్చు మొత్తంసం॥లో లక్ష మణుగులపైగా ఉంది. అందులో—

సాంత్రా — ౫౨,౦౦౦ రై॥ మణుగులు
సాతుగుడి — ౩౩,౦౦౦ రై॥ ”
కమలా - బత్తాయి — ౧౯,౦౦౦ రై॥ ”

నిమ్మలకుకూడా ఎగుమతివ్యాపారంలో ఉన్నత స్థానం వుంది. ౧౯౩౬-౩౭లో ౧,౧౭,౦౦౦ రైల్వే మణుగుల నిమ్మలు ఎగుమతి అయాయి. ఇందులో నూటికి ౮౦పాళ్లు కలకత్తాకుమాత్రమే. చెన్నపట్నంలో ౩౨,౦౦౦ రై॥ మ॥ ఖర్చు అవుతుంది.

## ౪. ద్రాక్షపండ్లు:—

ముఖ్యంగా కొడైకెనాలు, క్రిష్ణగిరులలో సం॥రానికి — ౧౯,౦౦౦, రై॥మ॥ మొత్తపుపంట.

అందులో ౯,౦౦ రై॥మ॥ మాత్రం ఉత్తరానికి ఎగుమతి.

ద్రాక్షపండ్ల వ్యాపారాభివృద్ధికి ముఖ్యంగా గమనింపవలసిన విషయాలు:

ప్రశస్తమైన జాతులను ఈప్రాంతాల్లో పెంచడం, దూర దేశాలకు తక్కువధరలతో ఎగుమతి చేయడం.

ప్రపంచపు ఉత్పత్తి ౨.౮౨ లక్షల టన్నులు. ఇటలీ, స్పెయిను, దక్షిణ ఆఫ్రికా ముఖ్యంగా పండిస్తాయి.

మధురజిల్లాలో ద్రాక్షపండ్ల తోటలవాళ్లు కలిసి ఒక సంఘం ఏర్పరచుకున్నారు వ్యాపార సదుపాయంకోసం. సంఘం ఏర్పడ్డ ప్రథమ సంవత్సరంలో ౭,౦౦౦ గంపల ద్రాక్ష(గంపకు ౨౫ పౌనులు)పండ్లను చెన్నపట్నం ఎగుమతిచేసి చాలా లాభం పొందినట్లు తెలుస్తుంది.

## ౫. అనాసపండ్లు:—

మలబారు, విశాఖపట్నంజిల్లాలలో మాత్రమే పండించబడుతున్నాయి. ఉత్పత్తి అప్పుడే ఖర్చుకన్న ఎక్కువవుతూన్నట్లు ఈక్రింది సంఖ్యలవల్ల తెలుస్తుంది.

| | | | |
|---|---|---|---|
| క్యూఅనాసలు | ౨౨,౦౦౦ | రైల్వే | మణుగులు |
| మారిషసు | ౫,౦౦౦ | ” | ” |
| సాధా అనాసలు | ౧౫,౦౦౦ | ” | ” |

వీట్ల ధరలు పౌను ఒక్కంటికి ౯ పైసలు మొదలు (గ్రామాల్లో) అణావరకు (పట్నాల్లో) వుంటుంది.

## ౬. ఏపిలుపండ్లు:—

ముఖ్యంగా దిగుమతి చేయబడే పండ్లు. మన రాష్ట్రపు శీతోష్ణస్థితి వీటికి అనుగుణం కాకపోవడంచేత మనరాష్ట్రంలో చాలా తక్కువగా పెంచబడుతున్నాయి. అందుచేతనే విస్తారం దిగుమతి చేసుకుంటున్నాం. ఈ పండ్లను పెంచుటకు ఎక్కువగా పరిశోధన అవసరం. ఈక్రిందిసంఖ్యలు ఎగుమతి దిగుమతులను తెలుపుతవి.

మనరాజధానిలో పంట మొత్తం ౭౦ రైల్వే మణుగులు.

పై దేశాల్నించి దిగుమతి (౧౯౩౬-౩౭)లో ౯,౫౦౦ రైల్వే మణుగులు.

దిగుమతి ఖరీదు ౯౧౮౦ రూ.

మనరాష్ట్రానికి దిగుమతిచేసే ముఖ్యదేశాలు:—

| | | | |
|---|---|---|---|
| జపాను | ౨,౬౫౦ | రై. | మణుగులు |
| ఆఫ్రికా | ౧,౯౨౯ | ” | ” |
| అమెరికా | ౧,౨౧౫ | ” | ” |
| ఆస్ట్రేలియా | ౨,౪౧౮ | ” | ” |
| ఉత్తరహిందూస్థానం | ౩౭,౮౦౦ | ” | ” |

## ౭. డబ్బాలలో నిలువచేసినపండ్లు:—

మనరాష్ట్రం ప్రతీఏటా ౨.౫ లక్షల రూ. విలువగల నిలవపండ్లను దిగుమతి చేసుకుంటూంది.

ఇది నిజంగా దారుణమైన విషయం.

పండ్లను నిలువచేసి ఎగుమతి చేసేపని ఒక పెద్ద 'పరిశ్రమగా' చేయడానికి మన రాష్ట్రానికి వున్నంత అవకాశం ఈ దేశంలో మరి ఎక్కడా లేదు.

రెండుమూడుమాసాల పరిమితిలో మామిడిపండ్లు అన్నీ ఒక్కసారిగా తయారవుతాయి. సహజంగా వీటిధర తక్కువగా వుంటుంది. వీట్లని 'నిలువచేయగల్గి' యితరకాలాల్లో అమ్మితే ఎంతోలాభం పొందవచ్చు.

ఈ విధంగానే మిగత పండ్లుకూడ. మనరాజధానిలో మామిడిపండ్ల ఉత్పత్తి సంవత్సరానికి ౫ లక్షల టన్నులు

| | | |
|---|---|---|
| చేరిపండ్లు | ౮,౦౦౦ | ,, |
| అనాసలు | ౧,౮౦౦ | ,, |
| { నారింజలు | ౫౦,౦౦౦ | ,, |
| { సంటూరు (పుల్లనారింజ) | ౫,౦౦౦ | ,, |

వీట్లను నిలువచేసే విధానంమీద ఎంత త్వరలో ప్రభుత్వందృష్టీ, ప్రజలశ్రద్ధా మరలితే అంతశ్రేయస్కరం. ముఖ్యంగా నారింజరసం శరీరానికి అమితమైన ఆరోగ్యాన్ని యిస్తుంది. ఆ రసాన్ని నిలువచేసి పన్నెండునెలలూ అమ్మ గలిగితే ఎంతో ప్రయోజనం వుంటుంది. ప్రజల ఆరోగ్యం బాగుపడుతుంది. రైతులకు వెట్బ్యావస్తుంది.

పండ్లతోటలను గురించి ప్రత్యేక పరిశోధనలు చాలా అవసరం. పండ్ల ఎగుమతులకు యింకా ఎన్నో సదుపాయాలు చేయవలసి వున్నాయి. అతిగా పండించబడేపండ్లను తగ్గించడానికి ప్రయత్నాలు చేయాలి.

అన్నింటికి ముందు పండ్లను ఉత్పత్తిచేసేవారు 'సంఘాలు'గా ఏర్పడి తమ అవసరాలను ప్రభుత్వానికి తెలియజేసి ఒత్తిడిచేయాలి.

అప్పుడే పండ్ల పరిశ్రమ తలయెత్త గలుగుతుంది.

---

# స్త్రీసాహసము

శ్రీ వక్కలంక శ్రీనివాసరావు

విధివిరామవికీర్ణ కేశము
  వెడల ముగుదలు వేణిభరమున
  వీథులం దద్భుతముగా వడి
      వెదుకుచుండంగా—

ఆర్తిరవములు నభము నంటగ
  సర్వజన మతి సరభసంబున
  ఉవిదలంబడి నగరు వెడలిరి
      యురక నేమిటికో—

విజయసింహప్రతాపుమరణము
  వినగవచ్చెనో లేదో, నగరున
  వెనుకదొడగిరి కాంత లాతని
      విజయకాయంబున్—

పాలనిచెంతకుఁ బోవుజనులకు
  పోరుమాట తెలియకుండను
  మంచిచెడ్డల నెఱుగజాలని
      మగువలను గాంచన్—

మేలిముసుగున మెఱపుతీఁ గన
  మేదురార్భాటంబుతో నొక
  మేదినీవిభురాణి వడిగా
      మెరపిణిని వచ్చెన్

ఆమె గాంచిన యబల లెల్లరు
  భూమి సీనిన భంగి చుట్టును
  కామినీమణి కండగా వడి
      గాగ నిలువంగ—

రాణి, రేణుపరాగబద్ధయి
  వీనులను నిక్కించి ధైర్యము
  పూని జనులను సైనికుల గని
      పోరపురికోల్పన్—

ఇనుఁడు పశ్చిమదిశను గ్రుంకగ
  జనులు దేవికి మ్రొక్కి వెడలిరి,
  పనుల జూచెడితమిని దేవియుఁ
      బాసె నచ్చోటున్—

౨

రేయినెల్లను బగరఁ దలచుచు
  రెచ్చగొట్టెడి పౌరుషంబున
  మానినీమణి రాజ్ఞి సేనను
      మరలగాఁజేసెన్—

సుప్రభాతం బగుడు, శూరులు
  వైరికోటిని వెడలనడచిరి,
  సంకులంబున నెన్ని ప్రాణులో
      సాగె సీపుడమిన్—

మగుడ కలవర మన్ని దిశలను
  మనుజకంఠా లన్ని యెడలను
  మాఱుమ్రోగగ, రాణి వాజితో
      మఱలె కదనముకున్—

చేతిఖడ్గము, జాతిక్షత్రియ
  సూతియను నా వీరమాతకు
  జ్ఞాతియనఁదగు రామసింగుఁడు
      [illegible]

అంత, బవరము వింతగతులను
ఎంతో ముదమున జెలగుచుండగ
పంతముననా రాణి బాకుతో
గ్రుంతె రామునిపై—

సావకాశ మొకింత యీయక
సమరభూమిని రామసింగుని
రాణి పొడిచెను బాకు వ్రేటున
రంజిలింగ పతుల్—

మెచ్చి రెండలో రాణిచేతల
నచ్చెరువుతోఁ బాగడదొడగిరి,
నచ్చరిత్రను రాణి దుర్గను
"సాహసీ" యన్చున్—

విజయనాద మెలార్చ రణమున
వేగ వాజిని ద్రిప్పుకొనుచును
నారి జనగా వెంట నడిచెను
నాదతూర్యంబుల్—

మేలు మేలని స్త్రీలసాహస
మెంతకని కొనియాడదగు నని
విజయపురమున బ్రజలు నుతులన్
వేగఁ బాడంగా—

రాణి వెలువడి, రాచకృత్యము
రాజ్యరమకుం దగిననృత్యము
భోజ్యమాదన పట్లటంచును
బాగడెఁ దనప్రజలన్—

---

# పతివ్రత?

శ్రీ ఆంజనేయశాస్త్రి

"నెత్తురుకూడా పడ్డదే, నిన్న రాత్రి దగ్గినప్పుడు..." అన్నాడు భర్త, నీరసంగా భయపుచూపులు చూస్తూ భార్యతో. ఆ విషయం భర్తకు తెలీకుండా వుంచటానికని, ఆయన మొహాని కడ్డంగా నుంచుని, తాను మనస్సులో పడుతున్న అమితమైన ఆందోళనను పైకి కనపడనీయకుండా రాత్రి ఆయన ఉమ్మేసిన స్థలం చకచకా బాగుచేస్తున్న భార్య గుండె లామాటలు వినేటప్పటికి ఝల్లుమన్నాయి. అప్పుడే ఎక్కడ చూశాడో? దీపం దూరంగానే పెట్టిందికూడాను. ఒక్క నిముషం ఏమీ సమాధానం చెప్పలేక వినిపించుకోనట్టూరుకుంది. "కిందటినెల, పోలేదూ? మా దుకాణంలో వుండే రెండో గుమాస్తా? ఆయనక్కూడా యిల్లాగే నెత్తురు పడ్డదట చివరిరోజుల్లో..." అన్నాడు మళ్లా భర్తే. వినిపించికూడా, వినిపించనట్టూరుకుందని అతనికి తెలుసు.

"...ఛీ... నెత్తురు కాదండీ అబ్బె, నే నిప్పుడేగా బాగుచేస్తుంటేను? ఎర్ర సిరా మొన్న యిక్కడ ఒలకలేదూ?... అదీ..." అని రెండు నెలలకిందటే సరైన పోషణలేక నీరసించి చచ్చిపోయిన తన కొడుకుమాట గుర్తొచ్చి మాట సాంతం చెయ్యకుండానే ఛప్పున ఆగిపోయింది. కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. "సిరాబుడ్డి ఒరగతోసేవా ళ్లెవరున్నారూ యిప్పుడు ...ఛీ...ఆ మాట గుర్తు చేశానేం? యిప్పుడు దిక్కుమాలిన దాన్ని..." అని తన్ను తాను తిట్టుకొని మనస్సులో, కన్నీళ్లు కళ్లతోనే మింగేసి భర్తతో ఏదో చెప్పబోతుంటే, ఆయనే అందుకుని..."అది చూసి నెత్తురనుకున్నాననా నీ ఉద్దేశం?...అయినా సిరా ఎవరు ఒలకపోస్తారూ?..." అన్నాడు, బిక్కమొహం వేసి. అనుకున్నంతా జరిగింది. "...ఊ-హూఁ అది కాదు...వైద్యుడు చెప్పనే చెప్పాడుగా తగ్గుమొహంలో కొచ్చిందనీ? అదీ కాక మొహంకూడా తేటగానే కనిపిస్తోంది మూడు రోజుల నుంచీని ..." అంది భార్య, మాట తప్పించటానికి. రోగి కొంచెంగా దగ్గి "...పిచ్చిదానా, నేను భయపడుతానని తప్పించేస్తున్నావా? గుబగుబా కొట్టుకొంటున్న నీ గుండెలు వీపుమీదిక్కూడా కనిపిస్తునే వున్నాయి ... నాకు తెలుసు ... నేనిహ బతకను...చిట్టిబాబు సగంప్రాణాలు తీసికెళ్ళాడు ...ఈరోగ..." ...తరవాత బాగా దగ్గొచ్చింది. మాట్లాడ లేకపోయాడు. భార్య ఒళ్లు ముచ్చెమటలు పోసింది. ధైర్యంఎలాగో చిక్కబట్టుకొంటూ లేచి, మొహంతుడుచుకొని, భర్తవేపు తిరక్కుండానే ... ... "ఇదిగో ... ఇల్లాంటిమాట లంటేనే!... డాక్టరుగారు చెప్పలేదూ? భయపడవద్దనీ, భయపడితే ఎక్కువౌతుందనీ జబ్బు?...

లేనికోపం తెప్పించుకొని కాస్త గంభీరంగా, కసిరినట్టు మాట్లాడింది. మాటలుమట్టుకు అంది, తప్పితే ఒళ్లంతా ఒణికిపోతోంది. పెదిమెలు అదురుతున్నాయి. దగ్గిదగ్గి రోగి ఉమ్మేశాడు. రక్తం స్పష్టంగా కనిపించింది. సార్థకంగా చూశాడు, భార్యకేసి. ఇందాకటినుంచీ ఆమెమొహంలో అణువణువునుంచీ ఉబుకుకొస్తున్న భయాన్నీ, దుఃఖాన్నీ పాపం ఆమె నిర్బలహృదయం, ఇహ ఆపలేకపోయింది, కుప్పైన కూలబడిపోయి మంచంపట్టెకి తలాన్చి ఎక్కెక్కిడవడం మొదలెట్టింది. తనస్థితిని చూచుకొని కాకపోయినా, తానుపోయింతర్వాత భార్యయొక్క స్థితిని గ్రహించుకుని భర్తకూడా బాగా బిక్కమొహం పెట్టాడు. ఎండిపోయిన వేళ్ల ఎముకల్తో భార్యజుట్టు సవిరిస్తూ తలెత్తి...

"ఇంతేనా మరి? వెఱ్ఱిపిల్లా... మొన్న మందు మార్చింతర్వాత నాకూడా బాగా యిదిగానేవుంది ... ఏమంటావో నువ్వని అన్నాగానీ, తప్పకుండా నయమౌతుందిగా ..." అన్నాడు. తాను అబద్ధమాడుతున్నట్టు అతనికీ తెలుసు. నయమవటం అసంభవమని ఆవిడకీ తెలుసు—పరుపంచూ మంచంపట్టె తడిసిపోయాయి—

౨

విశ్రాంతి తీసుకోమని సలహా యిచ్చారు వైద్యులు. ఎన్నిరోజులని విశ్రాంతి తీసుకుంటాడు పని మానేసి? పని చెయ్యలేకపోయినా జీత మిస్తారుగనకనా? అసలా దుకాణంలో ప్రవేశించినదగ్గిర్నుంచే పట్టుకుంది రోగం. అనటం గుమాస్తాపనేఅయినా, కొట్లల్లో రాస్తూరాస్తూ మగ్గిపోతుంటే ఆరోగ్యం చెడిందంటే చెడదూ మరి? మొదట్లో, రాత్రిళ్లు యింటికెళ్లేవేళకు కాస్త పులకరం తగుల్తూవచ్చింది. రెండు మెతుకులు నోట్లో వేసుకొని పడుంటే ఏఅర్ధరాత్రివేళకో తగ్గిపోయేదో ఏమో తెల్లారేసరికి మామూలుగానే వుండేది. అంతమాత్రానికే పని మానేస్తే బతికేదెల్లా? తరవాత పొడిదగ్గొస్తూవచ్చింది. దానికీ అట్టే లక్ష్యంచెయ్యక ఏపటికబెల్లమ్ముక్కో దవడ నేసుకుని గడిపేనేవాడు. "ఎదన్నా మందు పుచ్చుకోరాదుటండీ? శరీరం మరీ బలహీన మైపోతో"దని అంటూ వచ్చేది భార్య అప్పుడప్పుడు. "మందుల కూడా డబ్బెక్కడ మిగులుతుంది నాసంపాదనలో? మూడున్నర చెప్పాడు మొన్నీమధ్య కనుక్కుంటే సీసా ..." అనేవాడు నిస్పృహతో. తర్వాత, తర్వాత ... "క్షయవ్యా"ధని స్పష్టంగానే చెప్పేశారు వైద్యులు. అప్పుడు తప్పనిసరిగా ఏదో మందు పుచ్చుకోవాలి వొచ్చింది. అప్పటికీ లొంగకపోతే, "మందులవల్ల లాభంలేదు. పూర్తిగా విశ్రాంతి అవుసరం ..." అన్నారు. ఏంవిశ్రాంతి? పొద్దాకులూ పనిచేస్తేనేగాని నాలుగు రాళ్లు చేతులో పడవమ్యె. ఆనాలుగురాళ్లూ వుంటేనేగాని పొయిలో పిల్లి లేవదు. ఇహ ఓటే విశ్రాంతి! శాశ్వతమైంది!! అదైనా వెంటనే ఒస్తే బాగానే వుండును!

మరీ ఉద్ధృతంగా వున్నప్పుడు నాలుగు రోజులు పనిమానేసేవాడు. కాస్త ఉపశాంతిగా వుండగానే, తప్పనిసరి కావటం చేత మళ్లీ పనిలోకిపోవటం. వారంరోజులు ఆ కూపంలో పడి కొట్టుకోపోగానే మళ్లీ

అంటూ మధ్య మధ్య మానేసినా, జీతం డబ్బులు విరక్కోసు కొనేవాడు కాని పనిలోకి గానివ్వసనే వాడుమాత్రం కాదు. ఇదివరకు నెత్తురుపడేది కాదు. ఇప్పుడదికూడా సంపూర్తయింది...ఇహ యిక్కడ లాభం లేదు ... ఆరోగ్యాశ్రమానికెక్కడి కన్నా పొమ్మన్నారు వైద్యులు. అలాంటి చోటికెళ్లాలన్నా, వెళ్లి నాలుగు నెల్ల పాటుండా లన్నా వందలతో పని, తప్పితే, వీళ్ల వల్ల య్యేదా ఏమన్నా నా? ఒంటిమీదుండే ఓటి రెండువస్తువులూ యిదివరకే అమ్మేసింది భార్య, శలవుపెట్టినరోజుల్లో భుక్తికీ, సలహాలు చెప్పిన వైద్యులకట్నాలికీని—ఆయనకోనా' అనేవాళ్లు లేరు. తనవాళ్లా? ఎక్కడో దూర దేశంలో వున్నారు. అయినా వాళ్లుమాత్రం వందలు, ఎక్కడ పంపిస్తారు? లక్షాధికార్లు గనకనా? మొన్నీమధ్య తనచివరికూతురి పెళ్లికిగాను తల తాకట్టుపెట్టి తెచ్చినబాకీ తీర్చలేక మెులలోతుల్లో దిగబడున్నాడు ఆఁడనాన్న. పోనీ షావుకారును ఏమన్నా అడుగుతే? ఈ ఉద్దేశం బాగుం దనుకుంది భార్య. అవునూ, అన్నేళ్లనుంచీ తనదగ్గిర పనిచేస్తున్నాయనకి కష్టసమయంలో ఆ మాత్రం సహాయం చెయ్యడూ? నయమైం తర్వాత క్రమంగా తీరుస్తారూ అప్పు... భర్తతో ఓరోజు ప్రస్తావించిం దీవిషయం. "...లాభంలేదే?...ఇవ్వడాయన...ఏంచూసిస్తాడూ? ... ఓవేళ యిస్తాడనుకో ... ఇచ్చినా శవంకోసం ఎందుకీఖర్చు? ... నే నెలాగూ బతకను..." అన్నాడు నిరాశగా భర్త. ఇలాంటి అపశకునపుమాటల కావిడ క్రమంగా అలవాటుపడ్డది.

"...మీ మాటలకేం కానీండి, ఓఉత్తరమ్మొక్క రాసి చూడరాదూ, అయినా?... సానుభూతిగా మాట్లాడుతూండేవా డన్నారయ్యే...ఆమాత్రం సహాయం చెయ్యకపోతాడూ?..."అని బలవంతపెట్టింది. తనకేమాత్రం ఆశలేకపోయినా, భార్యని తృప్తిపరచటానిగ్గాను... "నేను చావుబతుకుల్లో ఉన్నా...ఆరోగ్యాశ్రమం వెళ్లాలని వైద్యులే లన్నారు. నే నడగలేకపోతున్నా...నాఆస్తి ఏంచూసి ఇవ్వమనగలనూ?...అయిదువందలవుతాయిట, రైలు ఖర్చులకూ అక్కడ నాలుగునెలల పాటుండటానికీని ... బతికితే ఆజన్మాంతం మీదగ్గిరే పనిచేస్తూ తీర్చుకుంటా..." అని ఓఉత్తరం రాశాడు.

3

కాగిత మ్మొక్కన్నా రాయించుకోకుండా షావుకా రయిదువందలూ చేతిలో పోసినందు, కతని కెక్కడలేని ఆశ్చర్యం వేసింది. మనస్సులో శతవిధాల అతనికి ధన్యవాదా లర్పించుకొంటూ అతని గుణగణాలను తలుచుకోటం మొదలెట్టాడు...నిజాని కాయన ధర్మమూర్తి. తను మధ్యమధ్య పని మానేసినా ఏమీ అనేవాడుకాదు. అడిగాక "ఏదన్నా మందు పుచ్చుకోరాదుటండీ" అంటూ సానుభూతిగా మాట్లాడుతూ ... "పాపం, యింట్లో వంటరిగాళ్లు కామా"లని జాలిపడేవాడు కూడాను.

"ఆయనచేసిన దానధర్మాలకు లెక్కే లేదు. మహా జాలిగుండె కలవాడు. మొన్నీ మధ్యేకదూ పడమటివీధిలో సత్రం వేయించిందీ?...ఆ రోజు అనాథాలయానికి చందా

రూపాయ లిచ్చింది? వెధవ అయిదువంద లాయనకో లెక్కేమిటి? ఒక్క నెలలో యిలాంటి అయిదువందలు తొంభై ఒస్తా యాయనకి!!..."

ఇన్ని సుగుణాల పోగైన ఆయన్ని మొదట్లో తాను కఠోరుడుగా అనుకున్నం దుకు మహా నొచ్చుకున్నాడు రోగి. తన పశ్చాత్తాపాన్నీ, కృతజ్ఞతనీ సూచిస్తూ ఇంకో ఉత్తరం రాసి పంపించాడు...అది చూసి షాహుకా రేమనుకున్నాడో!...

౪

"సరీగ్గా యివాలిటికి కేడా దైంది. నీకు గుర్తుందో లేదో...మా ఊళ్లో పెద్ద పెంకు టింట్లో మామిడిచెట్టున్న వేపుగదిలో... లేతమామిడి చిగుళ్లల్లోంచి ఒడపోసిన వెన్నెల దక్షిణం వేపు కిటికీలోంచి పరుపు మీదికి పడుతుంటే...మన మసలా రాత్రి నిద్రే పోలేదు..." అన్నాడు భర్త.

భార్య మాట్లాడలేదు. మంచంమీద బోర్లపడుకుని కిటికీలోంచి, శూన్యంలోకి చూస్తోంది. భర్త మరింత దగ్గిరిగా జరిగి కూర్చుని మెడపక్కని భుజపు ఎముకల గుంటల్లో తన మునివేళ్లతో చక్కిలిగిలి పెడుతూ... "అప్పు డనుకున్నాం ... అటు వంటి సంతోషపు ఘడియలు మళ్లీ రావ టానికి పొడుగాటి సంవత్సరం అడ్డం ఒస్తుం దని?..." అని ఒంగి భార్యతల్లో ఉన్న గులాబీపువ్వు వాసనచూసే నెపంతో ఘుమ ఘుమలాడే నల్లజుట్టుని ముద్దెట్టుకో పోయా డు. ఆవిడ, చేత్తో అడ్డం పెట్టి దీర్ఘమైన నిట్టూర్పు విడిచింది. ఆ నిట్టూర్పుకి, వంపులు

తిలకిస్తూన్న భర్త, ఉత్సాహంతో పొంగి పోయి, వెనకనుంచే భార్యని కౌగలించుకొని లేవనెత్తి ఆమెమొహాన్ని తనవేపుకు తిప్పు కుంటానికి ప్రయత్నిస్తూ..."...ఏ మంటా వు?..." అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

ఆమె తప్పించుకుని మొహం అటు తిప్పుకునే..."...మరి నేనోమా టడుగుతా కాని..." అని అర్థోక్తిలోనే ఆపేసింది.

"...సొంతం చెప్పు మరి ..." అన్నాడు భర్త చేతు లక్కడే వుంచి.

"...ఉండండి మరి చెపుతా...ఓ భార్యా భర్తా వుంటారు...మిక్కిలి అనురాగంగా ..." అంది ఆపి ఆపి.

"మనం లేమూ?..." అని ప్రశ్నిం చాడు జవాబుగా భర్త.

"భర్తని భార్య తన ప్రాణంకంటె ఎక్కు వగా ప్రేమిస్తుంది." అంది కొంచెం దూకు డుగా.

"...భర్తో మరి?..." అన్నాడాయ నాధోరణిలోనే.

"భర్త క్షేమంకోసం భార్య అష్టకష్టా లూ పడుతుంది. తప్పా?..."అంది అదోవిధ మైన ఊపుతో.

"ఎవ రంటారు?..." అన్నా డాయన. అతనికి విషయ మేమీ అర్థం కాలేదు.

"తను ప్రాణప్రదంగా కాపాడుకునే వస్తువు లన్నిటినీ భర్తసౌఖ్యంకోసం ధార పోస్తుంది...తప్పా?" అంది మరీ దూకుడుగా, ఆ దూకుడులో మాటలు తడబడ్డాయికూ న్న.

"...ఔతే ఏమంటావు? ఇంతకీ..." అన్నాడు భర్త కాస్త ఆలోచనా పూర్వకంగా.

"అది కాదండీ... తనసౌఖ్యం, ధనం, మానం ... అర్పిస్తుంది భర్తసౌఖ్యంకోసం ...అలాంటిదా న్నేం చెయ్యాలి?..."అంది కాస్త గుక్కతిప్పుకొని ..."ప్రాణప్రదాయిని గా ఎంచుకొని... "అని భర్త ఏదో చెప్పబోతుంటేనే భార్య అందుకుని..."ఛీ...చంపెయ్యొద్దంటండీ...?..."అంది అని లేచింది. మొహం గంభీరంగా వుంది. ఊపిరి బరువుగానూ త్వరత్వరగానూ విడుస్తోంది. అదురుతున్న గుండెలు తొలిగిపోయిన వస్త్రాల్లోంచి బాగా కనిపిస్తున్నాయి. పెదిమెలు ఒణుకుతున్నాయి. అతని కేమీ బోధపడలేదీవాలకం.

"చచ్చిపోవద్దంటండీ? ... ..." అంది మళ్లీ ఆవిడే, భర్తమొహంలోకి తీక్షణంగా చూస్తూను.

"ఆ...ఆఁ నిజమే — సానుభూతిలేని భర్త ... ఏం అలా చూస్తావేం?" అన్నాడాయన.

"ప్రాణంకంటే ఎక్కువది ... కూడా ధారపోసినా?" అంది...

"ఆఁ ... పూజించాలి నెత్తిన పెట్టుకొని ... దాస్యంచెయ్యాలి ఆ జన్మమూను" ... అన్నాడు గంభీరంగా లీలగా అతనికాస్త ఏమిటో అర్థం అవుతున్నట్టుంది.

"నిజంగా అంటున్నారా?..." అంది యీడుస్తూను. కళ్లు తేలిపోతున్నాయి. చిరునవ్వు పెదిమెలచివర కాస్త తొంగి చూసి వెళ్లిపోయింది. వెన్నెలకాయిస్తున్న చంద్రుడిని నల్లమబ్బులు కప్పేశాయి—

"ఏమి టిదీ?..." అన్నాడు భర్త ఆదుర్దాగా. ఆవిడమొహంలో వివర్ణత ఏర్పడింది. కళ్లు బాగా మూసుకుపోతున్నాయి.

"కాసిని మంచినీ ళ్లిస్తారూ?"... అంది అస్పష్టంగా. భర్త వికలత పొందాడు.

"అలా మాట్లాడుతున్నావేం?... నిద్ర రాస్తోందా?" అంటూ నీళ్లందించాడు మరీ భయపడుతూ. నీళ్లు కాసిని తాగి గ్లాసు జారవిడిచింది. భర్త గాభరాపడిపోతూ ... "అయ్యో తలవేలాడేశావేం? ...అరే? ... చూస్తూచూస్తుండగానే ఏమిటీప్రళయం?... చూడూ... డాక్టర్ని పిలుస్తున్నా..."నంటూ కంగారుగా మంచందిగాడు. భర్త చెయ్యి పట్టుకుని ఆపి బాగా యీడుస్తున్న నంగి మాటల్తో..."డాక్టరొద్దు...నన్ను...క్షమించారు...కదూ?... ప్రాణంకంటె మానం గొప్పది..."అంది కళ్లు మూసుకునే.

భర్తకి మరీ అగమ్యగోచరమైంది. కళ్లు గిర్రున తిరిగాయి. ఒణికిపోతూ ... "నా గుండెలు పగిలిపోతున్నాయి ... ఇంతలోనే యిలా ముంచుకొచ్చిందేం? ... నన్నెవరు క్షమిస్తారూ... ఇహ? ..." అన్నాడు గద్గద కంఠంతో. మళ్లీ మంచినీళ్లకి సంజ్ఞచేసిందావిడ. అందిచ్చాడు బిగ్గరిగా బాగా ఏడుస్తూనే.

నీళ్లు కాసిని తాగి కళ్లు తెరవటానికి ప్రయత్నిస్తూ "...అదేమిటీ?...నా దగ్గిరికి రండీ... నేను చేసింది తప్పుకాదు...ఈ శరీరం మీద మీకు హక్కుపోయింది..." అంది తూలుడుగా...

"నేను మాత్రం ఏం తప్పు చేశాను? ...నన్ను నట్టేట్లో ముంచేశావేం? ... అయ్యో ... వైద్యుడిని పిలవనియ్యి ..." అంటూ చెయ్యి విడిపించుకోటానికి ప్రయత్నించాడు...

"ఒద్దు... ఈ చివరి రెండు నిముషాలు నా దగ్గిరిగా వుండరూ?..." అని భర్తతల తన గుండెలమీదికి లాక్కుంది. "మీకు బాగా ఆరోగ్యంగా వుందిగా?...నన్ను క్షమించారు కదూ? ... శలవిస్తారా?..." అంటూను...మరోమాటు మంచినీళ్లకు సంజ్ఞ చేసింది ... మేజామీది చెంబులో నీళ్లు గ్లాసులో పోస్తుంటే, గోడకీ మంచానికీ మధ్య పడిన ఊడిపోయిన ఓ కాగితంపొట్లం అప్పుడే కిటికీలోంచి ఒచ్చినగాలివిసురుకి అతనికాళ్ల ముందు కొచ్చిపడింది.

"...అమ్మో ... నాతోడు ...ఒద్దు... ఒద్దు...ఇంకా మిగిలిందా?..." అని లేవబోతూ భార్య ఎంత మొరపెట్టుకున్నా వినకుండా ఆ పొట్లంలో మిగిలిన కాస్తపొడి నోట్లో పోసుకున్నాడు భర్త...ఆ హక్కు అతని కుంది.

---





# కేంద్ర పారిశ్రామిక వస్తుప్రదర్శనాలయం, మద్రాసు

పల్లెదిక్కులలో సంతలు ఎంత అవసరమో అవి లేనిచోట్ల ప్రజల కెంత ఇబ్బంది కలుగుతుందో గ్రామజీవితం అనుభవం వున్నవా రందరూ ఎరిగిన విషయమే. ఒక ప్రదేశంలో ఏటేటా తయారవుతూ వున్న సరకును అంతటినీ ఒక్కచోటచేర్చి, సరుకులను కొనేవారిని అమ్మేవారిని సమావేశం చెయ్యడంలో సంతలు ఎంతో వుపయోగకరంగా వున్నాయి. ఒక ప్రదేశంలో ఒకవస్తువు తయారవుతోందన్న సంగతి ఒక్కొక్కప్పుడు ఆజిల్లాలోనే తెలియకపోవడం కద్దు. మా కేంద్రవస్తుప్రదర్శనాలయం చూసేవారికి కలిగే మొదటి ఆశ్చర్యం అదే. "ఈవస్తువులు మాజిల్లా వేనా?" అని చూడడానికి వచ్చినవారు కొందరుఆశ్చర్యంతో అడగడం నే నెరుగుదును. ఇప్పటికీ రైళ్లకూ, మోటర్లకూ ఎంతోదూరంగావున్న వూళ్లల్లో, పక్కవూరైనా వ్యాపించకుండా, తమ స్వస్థలంలోనే అణిగి మణిగివున్న చక్కని చేతిపనివస్తువులు మాప్రదర్శనాలయంలో వున్నాయి. ఎంతోకష్టంమీద, అధికారుల 'జబర్దస్తీ' మీద, అవి మాప్రదర్శనాలయం వరకూ ప్రయాణం చేశాయికాని కొన్నాలంటే వాటిలో కొన్ని ఆజిల్లాలోనైతం మరోచోట దొరకవు.

ఇంతకూ చెప్పవచ్చే దేమంటే, వ్యక్తిప్రాముఖ్యతకి రోజు లివి. "మీకు కావలసిన బట్టను మేము తయారుచేస్తాము; మాకు కావలసిన పత్తిని మీరు పండించండి; మనం అంతా వకటే" అనే విశ్వసోదరత్వపు రోజులు వెళ్లిపోయాయి. ఇప్పుడు మనం హిట్లరు, డాక్టరు షాటులరోజులలో వున్నాము.

ప్రపంచకంలో ప్రతిదేశమూ, పరగణా, జిల్లా కూడా తన ప్రత్యేకతకు అనుకూలంగా అర్థోత్పత్తిని సాధ్యమైనంతమట్టుకు వృద్ధిచేసుకుని, ప్రపంచం యొక్క అభివృద్ధికి తోడ్పడాలి అని సహృదయు లంగీకరించారు. మనదేశంలోవున్న ఉనిరుద్యోగ సమస్యను, దరిద్రబాధను నివారించడం కోసం మన వ్యవసాయసంపదను, పారిశ్రామిక సంపదను ఇంకా బాగా అభివృద్ధి చేయవలసివుంటుందని ఇప్పుడిప్పుడు అందరికీ నచ్చుతోంది. 'మనకు ఇష్టం వున్నా సరే, లేకపోయినా సరే, ఆర్థిక జాతీయత అన్నిదేశాలతోబాటు మన దేశం లోకి కూడా ప్రవేశించింది; కొంతకాలం ఇక్కడ నిలకడగా వుండేటట్లే వుంది' అని వైస్రాయి, లిన్లిత్‌గో ప్రభువు, మొదలు కిందివరకూ అందరూ అంగీకరించారు. వక్క పంచదారపరిశ్రమ చూడండి. ౧౯౩౮-౩౯ లో ౧౨ కోట్ల ౫౦ లక్షల రూపాయలు ఖరీదుచేసే పంచదార మనదేశంలో తయారైంది. అందులో ౬ కోట్ల రూపాయలు చెరుకుగడను పండించిన రైతుకూ, ౨ కోట్ల రూపాయలు ఫ్యాక్టరీ పనివాళ్లకూ, ౧ కోటి ౨౦ లక్షల రూపాయలు రైళ్లకీ, ౫౦ లక్షల రూపాయలు పై వుద్యోగులకూ ముట్టాయి, మనపంచదార పరిశ్రమకు సంరక్షణ రాకపూర్వం, ఏటేటా ఆ ౧౨౼ కోట్ల రూపాయలూ జావాద్వీపానికి వెడుతూ వుండేవి.

ఈమధ్య చెన్నరాజధానిలోవున్న కాలేజీల, హైస్కూళ్ల, విద్యార్థు లందరికీ కావలసిన వస్తువులు సప్లయిచేయడంకోసం, గవర్నమెంటు పరపతి శాఖవారు, వక స్టోర్సును ఏర్పాటుచేయదలచి, ముందుయేడు కావలసిన సరుకులజాబితాలను పంపవలసిందని అన్ని కాలేజీలకూ, స్కూళ్లకూ వ్రాశారు. ఒక యూనివర్సిటీ నుంచి సుమారు ౪౦ వేల రూపాయలుచేసే సరుకు...

జాబితావచ్చింది.అందులో మూడువంతులు, పేర్లపెట్టి, విదేశీసరుకులు. స్వదేశీసబ్బులకూ, పళ్లపేస్టులకూ, సిరాలకూ, కరువులేని ఈరోజులలో, ఆ విద్యార్థులకు కావలసిన వస్తువుల లిస్టులో, కొన్నివేల రూపాయలు ఖరీదుచేసే సామాను, పేర్లపెట్టి, విదేశీ సబ్బులూ, సిరాలూ, పళ్లపేస్టులూ, మొఖానికి రాసుకునే హేజలీను స్నోలూ వున్నాయి! నేడో రేపో ఆవిద్యార్థులలో ముప్పాతిక మూడువంతులు నిరుద్యోగుల సిబ్బందిలో చేరబోతున్నారని వేరే వ్రాయనక్కరలేదుగదా!

న్నారు. దేశీయ పరిశ్రమల అభివృద్ధికోసం అక్కడక్కడ, అప్పుడప్పుడు జరుగుతూవున్న ప్రయత్నాలను దేశానికంతకూ సంబంధించేటట్లు కేంద్రీకరించి, శాశ్వతంచేయడం అవసరం. ప్రతిజిల్లాలోను శాశ్వతమైన ప్రదర్శనశాల లుండాలి. వాటినన్నిటినీ కేంద్రీకరించే ముఖ్య సంస్థవకటి ముఖ్యపట్టణంలో వుండాలి. ఇవి ఎన్నడో చచ్చిపోయిన పురాతన వస్తువులను దాచివుంచే సంస్థలు కాక మన పరిశ్రమల దినదినాభివృద్ధిని కొలుస్తూ ముందు అభివృద్ధికి దారిచూపే సజీవమైన సంస్థలై వుండాలి.



శ్రీ టంగుటూరి ప్రకాశంగారు ప్రారంభోపన్యాసం చదువుచున్నారు

మొత్తంమీద మన పరిశ్రమలను మనం ప్రోత్సహించి సంరక్షించాలన్న ఉద్యమం గాలిలో వుంది. ఏ చోటా మన పట్నాలలో జరుగుతూవున్న వస్తుప్రదర్శనాలలో జనం తీర్థ ప్రజలాగ మూగడం ఇందు కొక నిదర్శనమని చెప్పవచ్చును. కాని ఏడాది కొకసారి ఏర్పాటయ్యే ఈప్రదర్శనాలు చాలవనీ, జనసమ్మర్దం వున్న ప్రతిచోటా ఇట్టివి యేటికేడాదీ

"మన పారిశ్రామికవస్తూత్పత్తి దినదినమూ విరివి అవుతోంది. అందువల్ల సరకులను తయారుచేసే వారికీ, ఉత్పత్తిచేసేవారికీ పరస్పరసంబంధం ఏర్పాటు చేయడం కోసం ఇట్టి శాశ్వతప్రదర్శనశాలలు ఎంతో అవసరం. 'స్వదేశీవస్తువులను కొనండి' అన్న ప్రబోధము మంచిదేగాని దానిని ఆచరణలో పెట్టడానికి ముందు దేశంలో ఏవస్తువులు తయారవుతున్నారో

పకం" అని సర్. టి. విజయరాఘవాచార్యగారు వ్రాశారు.

నాగరికత చెందిన దేశాలన్నిటిలోను ఇట్టి ప్రదర్శనశాల లున్నాయి. ఊరూ పేరూ సరిగా తెలియని మంచూరియావంటి చిన్న రాజ్యంలో కూడా అట్టి మ్యూజియము వకటి వుంది. అది బ్రహ్మాండమైన వక పెద్దభవనంలో స్థాపింపబడివుంది. దాని వుద్దేశ్యాలు ఇవీ:—

"మంచూరియా, మంగోలియా రాష్ట్రాలసహజ సంపదను ప్రజలకు తెలియచేయడం ఈ మ్యూజియం యొక్క ఉద్దేశం. అందుకోసం ముడిపదార్థాలయొక్క తయారైన పదార్థాలయొక్క, నమోనాలను, అందుకు సంబంధించిన విషయాలను సేకరించి వాటిని తగిన వివరాలతోటీ, చిత్రాలతోటీ ప్రదర్శిస్తుంది. పరిశ్రమాభివృద్ధి



వ్యావసాయిక గ్రామపారిశ్రామిక శాఖామంత్రియైయుండిన శ్రీ వి. ఐ. మునుస్వామి పిళ్లెగారున్నూ, రివిన్యూశాఖా మంత్రియైయుండిన శ్రీ టి. ప్రకాశంగారున్నూ, ఏలూరు తివాసులనూ, బళ్లారి కంబళ్లనూ వస్తుప్రదర్శనాలయమందు పరికించుచున్నారు.

కొరకు చేయబడుతూవున్న శాస్త్రీయపరిశోధనలను కూడా తెలియజేస్తుంది."

ఈ ఉద్యమం మనదేశంలో ఈమధ్యనే ప్రారంభమైంది. కలకత్తా కార్పరేషను కలకత్తాలో వక మ్యూజియం స్థాపించి, ఇందుకు దారి చూపింది.

మనరాష్ట్రంలో కాంగ్రెసు మంత్రిత్వం క్రింద, అప్పటి పారిశ్రామిక మంత్రిగారైన శ్రీయుత వి. వి. గిరిగారు, ప్రతిజిల్లా ముఖ్యపట్టణంలోనూ వక మ్యూజియం స్థాపించే ఉద్యమం ప్రారంభించారు. కాని అసలు పరిశ్రామిక వస్తుప్రదర్శనాలయాలంటే యేమిటో, వాటిని ఏర్పాటుచేసి నడిపే విధమేమిటో, గుర్తెరిగి ఈ రాజధానిలో మద్రాసు కేంద్ర పరిశ్రమాలయాన్ని ఏర్పాటుచేసినది శ్రీ మాగంటి బాపినీడుగారు. వక్క మద్రాసు రాజ

ధానివారిమాటయేమిటి? పంజాబు పరిశ్రామిక మంత్రిగారు, బెంగాలు, బరోడా రాష్ట్రాల పారిశ్రామిక డైరెక్టర్లు ఇక్కడికి స్వయంగా వచ్చి ఈ పద్ధతులను చూసి వెళ్లారు. ఒరిస్సా, సంయుక్త పరగణాలు మొదలైన రాష్ట్రాల తరఫున ఈ పద్ధతులను గురించి 'దరియాప్తులు' వస్తున్నాయి. మద్రాసు పారిశ్రామిక సంఘంతరఫున మద్రాసులో ఈకేంద్ర వస్తుప్రదర్శనాలయమును నిరుడుఆగస్టునెల ౨౨వ తేదీని అప్పటి రివిన్యూ మంత్రిగారైన శ్రీటంగుటూరు ప్రకాశం పంతులుగారు తెరచారు. జిల్లాప్రదర్శనశాలలలో ఆజిల్లాలలో ఉత్పత్తి అయ్యేసరుకులకూ, కేంద్ర ప్రదర్శనశాలలో చెన్న రాష్ట్రంలో తయారయ్యే వస్తువులకూ తగిన ప్రాధాన్యం ఇయ్యబడును. మద్రాసులోవున్న కేంద్ర పరిశ్రమాలయాన్ని నాలుగు మార్గాలుగా అభివృద్ధి చెయ్యాలని సంకల్పించారు:—



బొంబాయి ప్రభుత్వ వర్గమందు ప్రధాన మంత్రిగా ఉండిన శ్రీ బి. జి. ఖేరుగారు వస్తుప్రదర్శనాలయం చూడవచ్చుట.

౧ — మనరాజధానిలో తయారయ్యే వస్తువులకు తగిన ప్రాముఖ్యం ఇయ్యడం; పారిశ్రామికంగా ఇండియాపటంలో ఈ రాజధానియొక్క స్థానం నిర్దేశించడం.

౨ — వస్తువుల విక్రయశాలను ఏర్పాటు చేయడం.

౩ — ఇండియాలో వున్న ఇతర ప్రాంతాల సరుకులను ప్రదర్శించడం.

౪ — మనదేశంలో, మన ముడిపదార్థాలతో ఉత్పత్తిచేయతగ్గ విదేశీవస్తువుల ప్రదర్శనము.

దేశంయొక్క ఆర్థికసంపదను, దాని ఉత్పత్తి, విభజన మొదలైన ముఖ్యవిషయాలను, పరిశ్రమపద్ధతులు తెలియజేసే విధానాలను, మ్యూజియములో పటాలుగా వ్రాసి ప్రదర్శించారు. అదిగాక ఉచితపఠనాలయము, పుస్తకభాండాగారముకూడా వున్నాయి. మన పరిశ్రమలనుగురించి, ఇతర ఆర్థికవిషయాలను గురించి, అప్పుడప్పుడు ఉపన్యాసాలు ఏర్పాటుచేయబడును. పత్రికలలో వ్యాసాలు, కరపత్రాలు వగైరా ప్రచురింపబడును. "ఇది ఇండియను వస్తువేనా?" అన్నది ఈపరిశ్రమాలయము తరఫున వెలువడ్డ మొదటి ప్రచురణము. ఇందులో మనఆర్థికసంపదనుగురించి శ్రీవి.వి. గిరి మొదలైన ప్రముఖుల వ్యాసాలు, ఇండియా, మద

రాసు రాజధాని, అందలి జిల్లాలు — వీటినిగురించి ఎన్నో సంగతులు వివరింపబడివున్నాయి.

మా మ్యూజియములో ప్రేక్షకులసంఖ్య క్రమంగా హెచ్చుతోంది. అనేకమంది విఖ్యాతపురుషులు మా మ్యూజియమును తిలకించి దాని ఉపయోగాన్ని గురించి ఎంతో అభినందించియున్నారు. "ఎన్నో సంగతులు తెలుసుకొనవని అనుకొన్నవారుకూడా ఈ మ్యూజియమును చూచి, అనేకవిషయాలు గ్రహింపగలరు" అని మద్రాసు మేయరు శ్రీ ఎస్. సత్యమూర్తిగారూ, "ఈమ్యూజియమును చూడడంవల్ల అనేకులకు ఆశ్చర్యం కలుగుతుందని నానమ్మకం. ఏమంటే మద్రాసు రాజధానిలో ఎన్నివస్తువులు, ఎన్నిరకాలవస్తువులు, ఉత్పత్తి అవుతున్నాయో సామాన్యంగా అందరూ ఎరుగుదురని నేను అనుకోను." అని మద్రాసుగవర్నరు ఎర్‌స్కిన్ ప్రభువూ వ్రాశారు. ఇక్కడ ప్రదర్శింపబడ్డాయి. అందులో మైసూరు దసరా ఎగ్జిబిషనులో ఈక్రింది వస్తువులకు బహుమతీలు, పతకాలు వచ్చాయి—

(౧) బందరు, ఆంధ్రసైంటిఫిక్ కంపెనీవారి స్కూలు లేబరేటరీ పనిముట్లు.

(౨) ఆంధ్రఖాదీ నిలయము-ఖద్దరు.

(౩) మద్రాసు హెబ్బరు కంపెనీవారి ఆసుపత్రిపనిముట్లు.

(౪) తిరునల్వేలి రుంగచాపలు.

ఇవిగాక తమిళనాడు ఖాదీవస్త్రాలయానికి ఒక సర్టిఫికేట్టు కూడా వచ్చింది.

మా మ్యూజియములో ప్రదర్శింపబడ్డ వస్తువులలో పెద్దపరిశ్రమలు, కుటీరపరిశ్రమలు, వ్యవసాయవస్తుసామగ్రి, ఖనిజములు, అడవుల వస్తుసామగ్రి, సముద్రంలో దొరికే సంపద, కొన్నిరకాలు చేపనూనెలు, వగైరా కలవు. పెద్ద పరిశ్రమలలో



వస్తుప్రదర్శనాలయము చూడవచ్చిన మైసూరు సంస్థానము దివాన్ సర్ మిర్జా ఎం. ఇస్మాయిలుగారు

బడ్డ వస్తువుల విక్రయానికీ, స్వదేశసంస్థానాలవస్తువుల ప్రదర్శనానికీ ఏర్పాట్లు అవసరంగా కావలసివుంది. కాని స్థలముచాలని ఇబ్బందివల్ల ఆ యేర్పాట్లు ఇంకా జరగలేదు. మామ్యూజియంలో ప్రదర్శింపబడ్డ ఒక పొందూరు ఖద్దరుచీర రూ ౨౫౪/- లకు అమ్మకైంది. కిందటి మైసూరుదసరా ఎగ్జిబిషను, బెంగుళూరు దీపావళీ ఎగ్జిబిషను, మద్రాసులో ౧౯౩౯ డిసెంబరు

చెప్ప తగ్గవి పి. ఎస్. జి. కోయంబత్తూరు వారి ఇనుపనాగళ్లు, తూనికరాళ్లు వగైరా, మద్రాసు ఎనామిలు కంపెనీవారి ఎనామిలు సరుకులు, మద్రాసు పెన్సిలు ఫ్యాక్టరీ పెన్సిళ్లు, సౌతుఇండియా కన్ఫెక్షనరీ కంపెనీ, కుంభకోణము, వారి పిప్పరమెంట్లు, బెజవాడ ఆంధ్ర ఫార్మస్యూటికలు కంపెనీవారి మందులు, ఇండియా కానింగుకంపెనీ, బెజవాడ, వారి

వారి సిమెంటు, కాలికట్టు శేరశాసోపు కంపెనీ సోపులు, వగైరాలు; కుటీరపరిశ్రమలలో చక్కని పొందూరు, తిరుప్పూరు ఖాదీరకాలు, మంగుళూరుమట్టిపని, తెనాలి రంగులు, నీలికోల్ పేరాలు, తిరునల్వేలి చాపలు, బళ్లారికంబళ్లు, కుటీరపరిశ్రమలో తయారైన అగ్గిపెట్టెలు, గుంటూరు చలవరాళ్లు, కుంభకోణము ఇత్తడి కంచుపని, ఏలూరుకంబళ్లు, ఆటవస్తువులు వగైరాలు కలవు.

ఈకేంద్రపరిశ్రమాలయము మద్రాసుపారిశ్రామిక సంఘంవారిచే నడపబడుతోంది. సంఘం మెంబర్లలో గవర్నమెంటు వ్యవసాయశాఖ డైరక్టరు, పరిశ్రమశాఖ డైరక్టరు, కోఆపరేటివు రిజిస్ట్రారు, మద్రాసు మేయరు మొదలైనవారు కలరు. ఇంతవరకు ౧౩ జిల్లాప్రదర్శనశాలలు కేంద్రపరిశ్రామాలయమునకు అనుబంధముగా రిజిస్టరీ అయినాయి.

వున్న ఆస్తియేమిటి" అని అనేకులు ప్రేక్షకులు ప్రశ్నిస్తున్నారు. అందుకు సమాధానం ఇది: దీనిఆస్తిలో ముఖ్యంగా చెప్పతగ్గది మా సెక్రెటరీగారైన శ్రీమాగంటి బాపినీడుగారి కార్యోత్సాహము, పట్టుదల, కార్యనిర్వాహకశక్తి, అని చెప్పాలి. ఇట్టి ఆస్తి వున్న చోటరొక్కం రూపకమైన ధనసహాయం దానంతట అదే వస్తుంది.

ప్రేక్షకులు ఇంకా అధిక సంఖ్యాకులుగా వచ్చి మామ్యూజియమును వీక్షించవలసిందని ఇందుమూలంగా ఆహ్వానిస్తున్నాము. అందులో స్త్రీలు ముఖ్యంగావచ్చి చూడవలసిం దని మాకోరిక. దేశంయొక్క పారిశ్రామికాభివృద్ధి చాలావరకు వారి తోడ్పాటుమీద ఆధారపడి వుంది. మొదటినుంచి చివరవరకూ గృహనిర్వాహకత్వం పూర్తిగా స్వదేశీ వస్తువులతో నడపవచ్చు నని రుజువుచేయడంకోసం మా మ్యూజియంలో



కేంద్ర పారిశ్రామిక వస్తు ప్రదర్శనాలయమునకు చెన్నపురి రాష్ట్రమునకు గవర్నరుగా ఉండిన శ్రీ ఎర్స్కైన్ ప్రభువు గారు విజయంచేయుట

• • మా మ్యూజియము ఎనిమిదినెలలైనా పూర్తిగా నిండని శిశువు. కాని ఈస్వల్పకాలంలో, పరిమిత ధన సహాయంతో, మనుష్యబలంతో, వయస్సుకు మీరినపని నిర్వహించి, వయసుకు మించిన మంచిపేరు సంపాదింపగలిగింది. కాని ఇవి ప్రారంభప్రయత్నాలు. జనాదరణ హెచ్చినకొద్దీ మనపరిశ్రమాభివృద్ధికి తోడ్పడ్డానికి ఇందు ఎన్నో అవకాశాలున్నాయి. ఇచ్చటవున్న ఆకర్షణీయమైన ఏర్పాట్లు, పరిశుభ్రత, చూసి "దీనికి దీనిని గురించి ఇతర వివరాలు కావలెనంటే సెక్రటరీ తగిన ఏర్పాట్లు చేసివున్నాము. ప్రేక్షకులకు మ్యూజియమును చూపుటకు అనుభవముకల నిర్దేశకులు ఏర్పాటై యున్నారు. స్త్రీలకు సహాయం చేయడంకోసం వక స్త్రీ నిర్దేశకురాలు కలదు. శుక్రవారమూ, ఆదివారమూ, వుదయంపూట్ల తప్ప తక్కిన అన్ని రోజులలోను మ్యూజియం ఉదయం ౯ మొదలు ౧ గంటలవరకూ, సాయంకాలం ౩ మొదలు ౭ గంటలవరకూ తెరవబడి వుండును. ప్రవేశము ఉచితము.

సెంట్రలు ఇండస్ట్రియలు మ్యూజియం.

# నవ్యసాహిత్యపరిషత్తు

## సప్తమ వార్షికోత్సవము

### శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి అధ్యక్షోపన్యాసము

సహృదయులకు నమస్కారములు. సహృదయులనగా పూర్వకావ్యములు చదివి వానియొక్క నిత్యమననముచేత సారస్వతసౌందర్యము గ్రహించినవారు. ఒక సారస్వతములోని సౌందర్యము గ్రహించుటకు సారస్వతముతో బహుపరిచయ ముండవలెను. శబ్దార్థమాత్ర పరిజ్ఞానము కావ్యరస మాస్వాదించే శక్తి యివ్వదు. ఒక సానుభూతితో కావ్యం చదవాలి. పూర్వకవుల సుచరిత పథాలని జాగ్రత్తగా పరిశీలించాలి. సౌందర్య మన్నది భావంలోనే ఉండనక్కరలేదు. ఒకవృత్తభేదంలో ఒకచిన్న సమాసంలో నుడికారంలో కూర్పులో ఒక చిన్నమాటలో ఉండవచ్చు. పఠిత జాగ్రత్తగా ఉండకపోతే యిటువంటి సౌందర్యాలు గ్రహించ లేకపోతాడు. ఈ సౌందర్యోపాసనకి మార్గం పూర్వకావ్యాలని, పూర్వకవులని మిక్కిలిగా చదివి మననం చేయటం. "వేయిమందిలో ఒకడు సిద్ధికోసం ప్రయత్నిస్తాడు; అట్లాంటి వేయిమందిలో ఒకడు నన్ను పొందుతా" డన్నాడు భగవంతుడు గీతలలో. సరిగ్గా రసజ్ఞత్వంగూడా అట్లాంటిది. వెయ్యిమంది కావ్యాలు చదివితే ఒకడి కెవడికో రసజ్ఞతాబుద్ధి కలుగుతుంది. అటువంటి వెయ్యిమందిలో ఎవడికో సంపూర్ణమైన రసస్వరూపం సాక్షాత్కరిస్తుంది. ఈరసము కావ్యవస్తువులో ఉంటుంది. ఉండి కవిచేత కావ్యమంతటా వెదజల్లబడుతుంది. ఆశ్వాసాలుగా విభజించటంలో, కథని పంచటంలో, కల్పనలు చెయ్యటంలో, పాత్రపోషణంలో, ఔచిత్యంలో, అలంకారాలలో, నుడికారంలో, శబ్దములలో, ప్రతిచోటా యీ రసం ఉంటుంది. ఇన్ని విషయాల్లో ఒకానొక విషయమందు ఒక్కొక్కప్పుడు రస సన్నిధానం లేకపోవచ్చు. అందుచేత ఆ కావ్యంలో రసం లేదనటానికి వీల్లేదు. ఒక్కశబ్దంయొక్క ఔచిత్యం చూస్తే అదిబహుముఖాలుగా ఉంటుంది. వ్యాకరణ సంబంధమైన సంస్కారౌచిత్య మొక్కటే ఔచిత్యంకాదు. అది ఉచితస్థానమందు ప్రయోగింపబడుట కూడా ఔచిత్యం. ఆ శబ్దమందు వ్యంజకత్వం ఉండటం ఒక ఔచిత్యం. ఒక శబ్దమందు వ్యంజకత్వోచితి ఉండి, పాత్రోచితి ఉండి, వ్యాకరణసుష్ఠుత్వం ఉండదు. ఆ శబ్దం రసస్ఫోరకమవుతుందా కాదా అని విచారణ. ఈపట్టు నవ్యసాహిత్యానికి శంకుస్థాపన. ఇందులో రెండువాదాలు ఉన్నవి. ఆశబ్దం మీ ప్రకారం చ్యుతసంస్కృతి అయినా రస పరిహరణీయం; అని ఒకవాదన. రెండవవాదన: అది స్ఫూర్తిమత్తు, అది చ్యుతసంస్కృతియే కాదు. శిష్టవ్యవహారము, వ్యవహార మనాదిసిద్ధంగా వైయాకరణులు స్వీకరిస్తూవచ్చారు. మీ వార్తికకారుడైనటువంటి కాత్యాయనుడు శిష్టవ్యవహారవాది. మీ వ్యాకరణాలల్లో ఉన్ననిపాతలు, పృషోదరాదిత్వాత్సాధువులు, శిష్ట వ్యవహారాన్నే సూచిస్తున్నవి. ఇవిగాక ఆంధ్రంలో ఉన్నకవులు అందరూ అపాణినీయాలైనా శిష్ట వ్యవహృతములైన శబ్దాలను శతపరంపరగా వాడారు అని రెండవవాదన. అయితే సంస్కృతకావ్యాలొక్కటే కావ్యాలుగా పరిగణింపబడ్డరోజులు ఉన్నవి. కొన్నాళ్లు ప్రాకృతభాషాకావ్యాలనే తిరస్కరించారు. దేశభాషలైనవికృతిభాషాకావ్యాలు మరీ నిరసింపబడ్డయి. అసలు రసానికి దేశభాష మూలకందం. అందుకనే ఆచార్యుడు "స్వస్థానవేషభాషాభిను తాస్వంతో రసప్రలుబ్ధధియః" అన్నాడు. హృదయావధికమైన రసము పుట్టవలెనంటే దేశభాషలోని అచ్చమైన నుడికారంతోగాని పుట్టదు. కనుక వికృతిభాషాకావ్యాలు రసస్వరూపాన్ని తెలిస్తా

అందిచ్చేవి గనుక సత్పురుషులు వానియందు రసప్రలుబ్ధులవుతున్నారు. కాని మీ భాష దేశభాష కాదు, ఇది అపభ్రంశం, నింద్యగ్రామ్యం. ఇది రసభంజకం గాని రసప్రేరకం కాదు అనవచ్చును. ఆలంకారికులు అర్థాన్ని అనుసరించి గ్రామ్యమంటారు- వ్యాకరణ రీతిగా అపభ్రంశమైతే చ్యుతసంస్కారం అంటారు. చ్యుతసంస్కారమూ గ్రామ్యమూ ఒకటి కాదు. అవి రెండూ ఒకటిచేయటం భాషను మేకుబందీ చేసి బిగించటం. అసలు యీ భాషే వికృతిభాష. తద్భవ దేశ్య భాషలు వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములు జీర్ణించుకునే భాషలు. ఒక కాలంనాటికయిన వ్యత్యయాలు మేము పట్టీలు వ్రాసి అట్టిపెట్టాము, ఇక వ్యత్యయం జరుగకూడదు అని చుట్టూ నాలుకట్టడానికి హేతువేమిటి? ఆ కట్టినవాళ్ల అధికారవాంఛా? ఈ భాషలో యింకా వ్యత్యయాలు రావటానికి వెసులుబాటు లేకపోవటమా? ప్రావాహికమైన భాషలో మాట్లాడుతున్న కొద్దీరకరకాలమార్పులు వస్తవి. రసస్ఫోరకంగా ఒక విశిష్టమైన అర్థం యిచ్చేటట్లు మారుతుంది. ఒకశబ్దం మారుతుంది. అది మీసూత్రానికి భిన్నంగా ఉంటుంది. ఆశబ్దాన్ని వదిలిపెడితే దానిలోఉన్న మహార్థం తప్పించుకుపోదు. పేదవాడు బిచ్చమడుగుతూ "బాబులారా! ధర్మచెయ్యి దాగకు" అంటాడు. ఈధర్మచెయ్యి తప్పు సమాసం. కాని యిందులో వున్న విశిష్టమైన అర్థం మరియే యితర శబ్దంచేత సంపాదిస్తాము? ఇంకొక సుష్ఠుశబ్దం దీని బదులు వేస్తే అర్థచ్ఛాయలో దీనికీ దానికీ భేదం ఉంటుంది. కనుకనే సాహిత్య మీమాంసకులైన మహాకవుల ప్రయోగాలకును, భాషా మీమాంసకులైన వైయాకరణుల సూత్రాలకును భేదం కనిపించటం. ఈ భేదజ్ఞానం ఆంధ్రంలో శ్రీ గురజాడ అప్పారాయోపజ్ఞకం. ఆయన దీన్ని రెండు మార్గాలుగా ప్రవహింపచేశారు. ఒకటి కావ్యరచన; రెండవది వ్యవహార భాషావాదం. ఈ రెండుమార్గాలు రెక్కలు చాచి బాగా విజృంభించినై. వీనిలో అనేక శాఖోపశాఖలుగూడా పుట్టినై. అప్పారావు గారు మహాశిల్పి. సంఘసంస్కర్త. వాడుకభాషలో వ్రాసినపాటలు రమ్యమైన కథాసృష్టికలవి. పండితులు విని భావం బాగా ఉంది, భాష బాగులేదుఅంటారు. భాష బాగులేకపోతే భావం యెల్లాస్ఫురిస్తుంది? వారి ఉద్దేశ్యం భాష బాగాలేదని కాదు. వారి ఉద్దేశం ప్రకారం చ్యుతసంస్కారాలైన శబ్దాలు ప్రయోగించారని. వచ్చుచున్నాడు, వస్తున్నాడు—ఈ రెండు శబ్దాలకీ అర్థభేదం లేదు. ప్రకృతిప్రత్యయవివరణం చేస్తే మొదటిది లొంగుతుంది, రెండవదిలొంగదు అని వివాదపెట్టవచ్చును. ఇంకొకసూత్రం కల్పించుకుంటే ఆవాదనే ఉండదు. అసలు శబ్దం చ్యుతసంస్కారం అవుతుంది అనడానికి సంస్కృతభాషలో ఉన్న సంప్రదాయం తెలుగులో అంతగా పట్టదు. సంస్కృతంలో సర్వశబ్దాలూ వ్యుత్పన్నాలు. తెలుగులో వికృతులు దేశ్యాలు. ఉయ్యాల పయ్యెద మొదలయిన అల్పసంఖ్యాకములైన కొన్నిశబ్దాలకుమాత్రమే వ్యుత్పన్నత కలిగించేందుకు ప్రయత్నం చేయబడ్డది. ఆంధ్రభాష ప్రావాహికం. ఇటువంటిభాషకు లక్షణ నియామకం కన్న లక్ష్యైకరణ్యత్వం యెక్కువ యోగ్యంగా కనిపిస్తున్నది ఏ భాషైనా సజీవమై ఉంటే పండితపామరులు అందరిచేతా మాట్లాడబడుతూంటే తలా ఒకచోటా, తలా ఒకమార్పూ పొందుతుంది. భిన్నవర్ణాల నాశ్రయించి, భిన్నసంఘమర్యాదల నాశ్రయించి, భిన్నప్రాంతాల నాశ్రయించి సజీవభాషలో భిన్నత్వ మేర్పడుతుంది. వీటి అన్నింటిలో అనుస్యూతమై ఒక భాషయొక్క యేకాకారం కనబడుతూనే ఉంటుంది. ఆ యేకమైన ఆకారం చెడితే భాష చెడ్డట్లుగాని లేకపోతే చెడ్డట్లుకాదు. కొందరు అతివాదులు వ్యవహార భాషలో యింగ్లీషువాక్యవిన్యాసాన్ని తర్జుమాచేస్తున్నారు. భాష చెడటం యిక్కడ. వాడుక భాషాశబ్దా లుపయోగిస్తే భాష చెడదు. అది గ్రాంథిక భాష కాకపోవచ్చును. ఆంధ్రభాషయే. ఈ ప్రాంతీయాలు, ఈ నిమ్నజాతులు వాడే శబ్దాలు, ఉత్తమకావ్యమైన నాటకంలో పాత్రౌచితికోసం వాడబడవచ్చునుగదా! మరి ఆ శబ్దాలు రసహేతువులుగా! అది నివృత్తి చేసే రసంయొక్క స్వరూపం వేరు కావచ్చును. వానియందలి భాషా

త్వం తొలగిపోవటంలేదు. అట్టే మాట్లాడితే భాషాత్వం వానియందే ఉంది.

సంస్కృతం కూడా మాట్లాడబడే రోజుల్లో యీ ప్రాంతీయ భేదాలచేత భిన్నప్రాకృతాలూ, పాళీ మొదలైన భాషలనూ కన్నది. హిందీ వ్రజ భాష ఖడీబోలీ రెండుగా నైనది. ఏభాషకైనా యీ దశలు తప్పవు. పైగా యీ ఉద్యమం చాలామంచిది. ఎందుచేతనంటే పండితులు రసము ధ్వని మొదలైన లాక్షణిక గుణాలు మరచిపోయి ఒక్క శబ్దసాధుత్వాన్ని పట్టుకొని వ్రేలాడుతున్నారు. అందుమూలంగా నీరస గ్రాంథికంలో గ్రంథాలు కుప్పతెప్పలుగా బయలుదేరినై. వాడుకభాషలో వ్రాస్తే ఒక వ్యాకృతమైన శబ్దంయొక్క స్వరూపం వెనుక దాక్కోడానికి వీల్లేదు. రసంలేని వ్రాత వ్రాస్తే వాని స్వరూపం వెంటనే తెలుస్తుంది. దేశంలో రసబుద్ధి వర్ధిల్లించటానికైనా వాడుకభాష అవసరం.

అప్పారాయోపజ్ఞకమైన రసగీతాలను రాయప్రోలు సుబ్బారావుగారందుకున్నారు. ఆయన చేసిన పని చాలా గొప్పది. ఆ రోజులలో పండితులు అప్పారావుగారి కావ్యాలల్లో ఉన్న అందం చూడకుండా నిందించారు. సుబ్బారావుగారు వారిగీతినూత్నత్వం పండితులకు తగిన భాషలో ప్రకటించి భాషను గురించి మాట్లాడటానికి వీలులేకుండా చేసి ఆ మార్గంలో ఉన్న కొత్తదనం పండితులచేత గూడా కొత్తదనమని ఒప్పించారు. మన పూర్వసాహిత్యంలో ఒక్క ప్రబంధాలే కావు. స్తోత్రాలు, శతకాలు, చాటువులు, యక్షగానాలు, దరువులు, ఉదాహరణాలు, లక్షోపలక్షలు కలవు. దేశము వాని నన్నింటినీ మఱచిపోయి ఒక్క మార్గకవితలోని ప్రబంధాలు మాత్రమే, అక్కడి వర్ణనలు మాత్రమే భాషా, సాహిత్యమూ అనుకుంది. అప్పారావుగారు గాని, సుబ్బారావుగారు గాని చేసినదేమనగా, రసపుష్టమైన అనేక దేశియశబ్దాలను మడికారాన్ని రసవ్యంజకంగా కథలలో అతికి "అబ్బాయీ! భాష కాయువు పట్టుయిల్లా ప్రయోగింపబడే శబ్దం. ఇది దేశీయమైన శబ్దం. జాతియొక్క [illegible]

అని చూపించారు. చాలామంది ఒప్పుకొన్నారు రసనిష్ఠకలవాడు రసాభివ్యంజకంగా ఉన్నదాన్ని. యెప్పుడూ ఒప్పుకుంటాడు. శబ్దనిష్ఠ కలిగి రసాన్ని గురించి వివదించేవాడు యెల్లా ఒప్పుకొంటాడు?

ఈ కవితామార్గం క్రమంగా విజృంభించింది. క్రొత్త సిద్ధాంతాల మీద గాలి తిరిగింది. కాని కొందరికి పూర్వకావ్యాలలోని భాషమీద మోజు పోలేదు. అందుచేత యీ కవితాస్రవంతి రెండు మార్గాల ప్రవహించింది. అబ్బూరి రామకృష్ణరావుగారు, దువ్వూరి రామిరెడ్డిగారు మొదలైన ప్రముఖులు గ్రాంథికభాషలో క్రొత్తకావ్యాలు వ్రాశారు. అడివి బాపిరాజుగారు, నండూరి సుబ్బారావుగారు, కవికొండల వెంకటరావుగారు గేయాలు వ్రాశారు. కాని వీరిలో యెవరి వ్యక్తిత్వం వారికే ఉన్నది. అడివి బాపిరాజుగారికి కూడ్తేరిదొరగారి శిష్యత్వంవల్ల జానపదగీతరచన, చిత్రకళ అభ్యాసమైంది. ఈ వాడుకభాషావాదంలో అనేక పిల్ల సమేరీలు పుట్టినై.

కాల్డ్వెలు గ్రామరు చదివి ద్రావిడభాషల సంప్రదాయం, తెలుగుకి వాటితో గల సంబంధం; ఇదొక నైపుణ భాషాశాస్త్రమని పేరుతో బయలుదేరింది. ఈభాషాశాస్త్రానికి అచ్చంగా శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారు ఆచార్యులైనాడు. ఆంధ్రభాషలో వారు చూడని గ్రంథం లేదు. వారు మథించని శబ్దం లేదు. ఆయనముందర రాతికోటలు బాంబులు పడి పగిలినట్లయినవి.

ఈమహాపురుషుడు ఈనాడు తన శరీరంచేత లేక, ఆత్మశక్తిచేత మాత్రమే ఈపరిషత్తును పాలిస్తున్నాడు.

శ్రీగురజాడ అప్పారావుపంతులుగారు తీసిన నూత్న కావ్యమార్గం వెయ్యిమంది పోషిస్తూవస్తే, వారుతీసిన వ్యావహారిక భాషావాదం శ్రీరామమూర్తి పంతులుగారొక్కరు వెయ్యిమంది పెట్టుగా పోషించారు.

మన భాషలో ఇద్దరే వాగనుశాసనులు. నన్నయభట్టుగారును, గిడుగు రామమూర్తి భటు

ఈమహోద్యమాన్ని వారి దివ్యాత్మ పాలిస్తున్నది.

ఈ శబ్దవ్యుత్పత్తివ్యవహారంలో ఔక్యం కలిగించుకుంటూ ప్రధానంగా ఆంధ్రచరిత్ర పరిశోధన మొదలుపెట్టి శ్రీకొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులుగారు నవ్యసాహిత్యంలో మరియొక బావుటా లేవతీశారు. శ్రీచిలుకూరి వీరభద్రరావు పంతులుగారు కూడా అనాటివారే.

ఈ నవ్యసాహిత్యం ఒక్క కావ్యనిర్మాణానికే సంబంధించింది కాకుండా బహుమార్గాల వెలిసింది. ఒకటి గ్రాంథికభాషతో పేశలించిన నూత్న కావ్యనిర్మాణం. రెండవది క్రొత్త వృత్తాలతో వాడుకభాషలో వ్రాసినగేయాలు. మూడవది శిల్పము. నాల్గవది భాషాశాస్త్రం, ఐదు చరిత్రపరిశోధన. ఈమార్గాలల్లో పరిశ్రమలుచేస్తున్న అందరూ అంతరంగికంగా సానుభూతితో ఒకరియెడల ఒకరు భ్రాతృభావంతో మెలగుతూవచ్చారు. ఒక గేయకవి, ఒకభావకవీ భావానికి ప్రాధాన్య మిచ్చి ఒకరి కొకరు యిద్దరూ కవులుగానే పరిగణించుకొన్నారు. చిత్రకారుడైన స్నేహితుడితో శిల్పము కళ అన్నశబ్దాలు సమానాధికరణాలుగా చూసుకున్నారు. భాషాతత్త్వ శోధకులు యీకవులకు అలవాల మైనారు. చరిత్రపరిశోధన యీమహోద్యమాని కెంతో సాహాయ్యంచేసింది. ఈభావకత్వానికి ఆంగ్లేయసారస్వతం గొప్పదోహదమైంది. కవుల నాదరించి అగ్రహారా లిచ్చే దాతలు లేరు. ఎవనిజీవిక వాడు చూచుకోవలసి వచ్చింది. అందుచేత కవికి ఖండకావ్యం తేలిక యిచ్చింది. ఈ ఖండకావ్య నిర్మాతలలో ప్రాథమికులలో కొందరు కీర్తిగడించినవారు, కొందరు ఒకటి రెండు వ్రాసి ఉపసంహరించుకొన్నవారు కూడా గలరు. శ్రీ బసవరాజు అప్పారావుగారి వాణి ఆరోజులలో మధురంగా వినిపించినవానిలో ఒకటి. ఆయనపలుకుబడి గుండెకు సూటిగా ఉండేది. ఆయన కొన్ని కావ్యాలలో హృదయమే మాటల్లో పెట్టేవాడు. **Wordsworth** కవివలె ఒక ఆవేశం వస్తే దివ్యంగా పాడి తక్కినప్పుడు ఛామంగా వ్రాసేవాడు. ఒకటిరెండు వ్రాసి యుపసంహరించుకొన్నవారిలో నే పెరిగియున్నది, వింజమూరి రంగాచార్యులుగారే. ఇటువంటివారు దేశములో ఇం కెంత మందియో ఉండవచ్చును. ఇది యంతయు నవ్యసాహిత్యంయొక్క ప్రథమదశ.

రెండవదశ యింతకన్న పరిపుష్టమైనది. కవితామార్గములో శ్రీ శివశంకరశాస్త్రిగారు నిర్మించిన సాహితీసమితి బయలుదేరినది. అందులో క్రొత్తకవులు పుట్టుటయేకాక సాహిత్యశాఖలో భిన్నకావ్యాలు బయలుదేరినవి. చిన్నకథకు ఒక ఆకార మేర్పరచినది సాహితీసమితి. కీర్తిశేషుడు చామర్తి రాజశేఖరరావు, విరాగియై యెచటికి పోయెనో తెలియని కొడవటిగంటి వేంకటసుబ్బయ్య, నోరి నరసింహశాస్త్రి, శివశంకరశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, చింతా దీక్షితులుగార్లు సాహితీసమితిని ప్రకాశింపజేసిరి. మునిమాణిక్యం నరసింహారావు, చింతా దీక్షితులుగార్లు అచ్చముగా చిన్నకథనే అవలంబించారు. చిన్నకథలో వారిద్దరికీ చెరొకమార్గంలో సిద్ధి లభించింది. ఆంగ్లేయ సారస్వంలో 'గ్రే' యెటువంటి స్థానాన్ని సంపాదించుకొన్నాడో వేదులకవి అట్లాంటిది సంపాదించుకున్నాడు. శివశంకరశాస్త్రి, నోరి నరసింహశాస్త్రిగార్లు కథలూ, పద్యాలూ, రెండూ వ్రాసి నూతనసారస్వతానికి వన్నె తెచ్చారు. కృష్ణశాస్త్రిగారు సాహితీసమితి మనిషే అయినా, ఆయన వేరే వ్యక్తిత్వం తెచ్చుకున్నాడు. అప్పుడు గేయాలు వ్రాసినవారిలో నూతక్కి రామశేషయ్యచౌదరిగారొకరు, కాపుపెండ్లి అని మరికొన్ని యితరగీతాలు వ్రాసి చక్కని సంస్కారబుద్ధి అన్ని విధాలా చూపించారు. ఇట్లా యీసాహితీసమితి యిక్కడ నడుస్తోంటే తక్కిన తెలుగుదేశంలో కవులెవరూ లేకపోలేదు. పాతూరి అంజయ్యగారని ఒకాయన కృష్ణాపత్రికలో చాలా మధురమైన గీతాలు వ్రాస్తూ ఉండేవాడు. ఆయన యేమైనాడో తెలియదు. శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు రాయప్రోలు సుబ్బారావుగారి ప్రథమదినములలో కవిత్వంకూడా వ్రాసేవారు. వారి శమీ పూజ, పెనుగొండపాట మొదలైనవి తెలుగులో భావవు. అటువంటి

గొప్ప మేధావి కవిత్వాన్ని వదలివేసి వనగా ఆంధ్రసరస్వతి దుఃఖించాలిసిన విషయం. స్వంతకావ్యాలు యెక్కువ వ్రాయలేదు కాని శాలివాహన సప్తశతి తెలిగించటం మాత్రం గొప్పపని చేశారు. ఈరోజులలో కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వతత్వవిచారము వ్రాసి విమర్శపథాలలో గొప్ప దృక్పథం కలిగించి నవ్య సాహిత్యానికి క్రొత్తత్రోవలు త్రవ్వారు. వారి ముసలమ్మ మరణమను కావ్యము, అర్ధశాస్త్రాంకిత పద్యాలు, వారి కవితాస్రవంతియొక్క యచ్ఛత్వాన్ని లోకానికి చెప్పి చూపినవి. ఆ రోజులలో పెట్టి లక్ష్మీనరసింహంగారు మొదలైనవారు యితరజిల్లాలలో కవితారచన చేశారు. పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావులు సన్నని తియ్యని మార్గంలో వ్రాస్తూ ఉండేవారు. కొడాలి ఆంజనేయులుగారు ఒక మధురకవితను సాగించేవారు. పెనుమర్తి వెంకటరత్నంగారు కూడా చిన్నతనంలో చక్కని కవిత్వం వ్రాసినా యెంతో వృద్ధికి రావలసినవాడైనా, కాలంచేశాడు.

ఇక మూడవదశ: సాహితీసమితిలో కొందరు వ్రాయటం మానుకొన్నారు. పెట్టి లక్ష్మీనరసింహం గారు మొదలైనవారు గ్రాంథికంలో చేరారు. కాని కొందరు రచయితలు సారస్వతం వెంట వస్తూనే ఉన్నారు. రాయప్రోలు సుబ్బారావుగారు చాలా రోజులు వ్రాయటం మానివేశారనుకున్నాం. వ్రాస్తూనే ఉన్నారట. ప్రకటించలేదు. మళ్ళీ వారు కావ్యప్రపంచాన్ని రమ్యాలోకం చేశారు. శివశంకరశాస్త్రి గారిజీవితానికీ సాహిత్యానికీ లంకె. వేదులవారివ్రాయడం మందగించింది. కృష్ణశాస్త్రిగారు యీ దశలో ఒక క్రొత్తమార్గం యేర్పరిచారు. ఇంగ్లీషుభాషకీ తెలుగు భాషకీ ఒక గొప్ప భేదం ఉంది. ఇంగ్లీషుభాషలో అనేక శబ్దాలకు లాక్షణికార్థం ఉంటుంది. పైగా వాటికి లాక్షణికార్థం ప్రధానం. మనభాషలో అల్లాంటి శబ్దాలు తక్కువ కనుకనే యింగ్లీషు కవిత్వం సులభంగా కవిత్వం అనిపిస్తుంది. అనేకమంది యింగ్లీషు భావాలను మక్కికి మక్కిగా తెలుగుచేసి అన్నము కాకుండా, గంజి కాకుండా చేస్తారు. కృష్ణశాస్త్రిగారు అట్లా కాకుండా 'ఇంగ్లీషు భావాలను తెలుగులో యిల్లా చెబితే బాగానే ఉందిరా' అనేటట్లు వ్రాశారు. ఆయనది ఒకమార్గం. ఆమార్గ మాయనదే. దానిని గురించి సవిస్తరంగా చెప్పాలి అంటే యిది సమయం కాదు. ఈదశలో చిత్రకళలో గొప్పపరిణామం జరిగింది. బందరు ఆంధ్రజాతీయకళాశాలలో ప్రమోదకుమార చటర్జీ గారిక్రింద బాపిరాజు, కౌతాసోదరులు, ఇతర విద్యార్థులు, అభినవ కళావిన్యాసాల నభ్యసించారు. రాజమహేంద్రవరములో దామెర్ల రామారావుగారి స్కూలు గొప్ప వికాసం తెచ్చినది. రామారావుగారు చిన్న వయస్సులో పోయినను తనకొక స్వంత Technique ఏర్పాటు చేసికొని పోయినారు. బాపిరాజు గారి బొమ్మలు Holland లో గూడా కీర్తి పొందినవి. కౌతాసోదరుల ప్రశస్తిగూడా పాశ్చాత్యదేశములకు ప్రాకింది. చిత్రకళలో యీ వంగీయ సంప్రదాయముతో, అజంతాయెల్లోరా గుహల శిల్పాదర్శములతో బౌద్ధమత సంప్రదాయములు కలిసి అవి నెమ్మదిగా కవిత్వములోనికి ప్రాకనారంభించినవి. చరిత్రలో మల్లంపల్లి సోమశేఖరశర్మ, భావరాజు కృష్ణరావు, డాక్టరు నేలటూరి రమణయ్య గార్లును యితర ప్రముఖులును బహు పరిశోధనలుచేసి ఆంధ్రచరిత్రవిషయములను ప్రకాశింపచేసిరి. ఈ ఉద్యమములో యెవరికి వారుగా యెప్పుడును లేరు. ఈ సోమశేఖరశర్మ ప్రభృతులు లక్ష్మణరావుపంతులుగారి శిష్యులై వారి యుద్యమమును సాగించినవారు. డాక్టరు చిలుకూరి నారాయణరావు గారు భాషాశాస్త్రమునందు రామమూర్తి పంతులు గారి శిష్యులై ఆంధ్రవాఙ్మయ చరిత్ర అనే మహాగ్రంథాన్ని నిర్మించారు. గేయాలల్లో బాపిరాజు గారి చేయి యెప్పుడూ ఊరుకోలేదు. అది ఊరుకునే చెయ్యికాదు. ఈసమయంలోనే దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు భారతి పత్రికను స్థాపించినారు. అది నవ్యసాహిత్యానికి ఆనాటినుండి ఈనాటివరకు అండగా నిలుచుంది. నవ్యసాహిత్యం తక్కిన తెలుగు దేశపు అనేకసంస్థలతోపాటు శ్రీ పంతులుగారియందు కృతజ్ఞతా భావం వహించియే ఉంది.

ఇక్కడ ఇంకొక విషయము చెప్పవలయును. నవ్యసాహిత్యము యొక్క యీదశలోనే దువ్వూరి రామిరెడ్డిగారి సరస్వతి వికాసం పొందింది. దానికి డా. కజిన్సు, రామలింగారెడ్డిగార్లు ఇచ్చిన ప్రోత్సాహం సానుకూలపడ్డది. రామలింగారెడ్డిగారు భావలో కొందరు యువకులలో ప్రారంభమునుండి ఒక గొప్ప మూలశక్తిగా పనిచేశారు. వారి తెలుగు ఆర్థికశాస్త్రము, కవిత్వతత్త్వ విచారం, నవ్యసాహిత్య భావాలకు ఎంతైనా ప్రోత్సాహమిచ్చినై. అబ్బూరి రామకృష్ణరావు, రాయప్రోలు సుబ్బారావు, దువ్వూరి రామిరెడ్డి, పింగళి-కాటూరు కవులు వారిప్రోత్సాహం పొందినవారే. వారిని ఆదర్శంగా ఉంచుకొని వ్రాసినవారే. ప్రధానముగా పింగళి కాటూరు కవులకు శ్రీముట్నూరి కృష్ణారావు పంతులుగారి ప్రోత్సాహం. సారస్వతంలో కొందరిది ప్రత్యక్షగురుత్వం, కొందరిది పరోక్షగురుత్వం. ఈరోజులలో వెంపటి నాగభూషణంగారు, వెల్లటూరి సోమనాథంగారు యింగ్లీషులోనే కవిత్వం వ్రాసి అది ఒక ఛాయగా నడిపారు. ఈదశలో **Non Co-operation movement** చరమదశ జరుగుతూ ఉంది. దేశభక్తి గీతాలు ప్రబలినవి. కొన్ని స్థలాల్లో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి పలుకుబడి విజృంభించింది. జాతీయగీతాలు ఎంతమందైనా వ్రాశారు. ఈజాతీయగీతాల్లో వాడుకభాషలో వ్రాసినవానిలో గరిమెళ్ల సత్యనారాయణగారి గీతాలు తెనుగుజాతిని మేల్కొలిపినవి. ఈకాలంలోనే త్రిపురనేని రామస్వామి చౌదరిగారి సూతపురాణం వెలువడింది. వారిశిష్యులు చాలామంది ఉన్నారు. వీరందరూ గ్రాంథిక భాషాజ్ఞానం బాగా కలవారు. వైదర్భీరీతిలో చక్కగా వ్రాయగలవారు. వారిది కూడా నవ్యసాహిత్యం యెల్లా అవుతుందీ అంటే సాహిత్యాదర్శాల్లో సంప్రదాయాల్లో యెదురు తిరిగి నవ్యత్వం కోరటం మూలంగా వారిదీ నవ్యసాహిత్యమవుతుంది.

ఇక నాల్గవదశ - ఈదశలో క్రొత్తకవులు చాలామంది పుట్టారు. జాషువాకవి తన కోకిలా గీతానికి కుహూ కుహూ మొదలుపెట్టాడు. పిదప దశనాటికి తనకు వేరే ఒకమార్గం నిర్మించుకోబోయే శ్రీరంగం శ్రీనివాసరావు గ్రాంథికభాషలో పద్యాలు వ్రాయటం మొదలుపెట్టాడు. కొంపల్లె జనార్దనరావుగారు ఉదయిని ప్రారంభించాడు. పురిపండా అప్పలస్వామి, శ్రీరంగం నారాయణబాబు, కాసూరి నరసింహారావుగార్లు మొదలైనవారు విశాఖపట్నంనుండి, సహదేవ సూర్యప్రకాశరావు ప్రభృతులు రాజమహేంద్రవరమునుండి క్రొత్తరచనలు చేశారు. శ్రీ తెలికిచర్ల వెంకటరత్నంగారు భాషా తత్వశాఖకు, 'ప్రతిభ'తో కవిత్వానికి చాలా సాహాయ్యంచేశారు. శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు వెనుకటి దశలో జయంతి పత్రిక పెట్టి భావకవిత్వానికి ఒకవిధంగా ఆచార్యులు కావడమే కాకుండా యీదశలో త్రివేణి అను ఆంగ్లేయ మాసపత్రికతో యీ ఆంధ్ర నవ్యసాహిత్యానికి యితర దాక్షిణాత్య సాహిత్యాలతో సంబంధ బాంధవ్యాలు కలపటం ప్రారంభించారు. ఈ దశలోనే పెమ్మరాజు లక్ష్మీపతి, వఝల కాళిదాసుగార్ల మధుర కవిత్వంకూడా వినిపించింది.

ఇక నైదవదశ. ఇది ప్రస్తుతదశ. ఇందులో జాషువాగారి మధుర కోకిలత్వం స్థిరపడ్డది. శ్రీరంగం శ్రీనివాసరావుగారి ముక్తకంఠం వినిపడ్డది. ఆయన చాలా క్రొత్తదైన ఒకమార్గం నవ్యసాహిత్యంలో సృష్టించాడు. విశ్వభారతిలో చదువుకొని వచ్చిన మల్లవరపు విశ్వేశ్వరరావుగారు కళ్యాణకింకిణితో గోపాలరెడ్డిగారి పెళ్లి చేయించారు. తెనాలి ప్రాంతాలలో కమ్మవారిలో చక్కని భాషాజ్ఞానం కలిగి సాధువైన మార్గాన కవిత్వం వ్రాసేవారు బయలుదేరారు. తుమ్మల సీతారామమూర్తిచౌదరి, ఏటుకూరి లక్ష్మీనరసయ్య, బోడేపూడి వెంకటరావు, నాసిరెడ్డి వెంకటసుబ్బయ్యగార్లు తమక్రొత్త రచనలతో తెలుగుభాషకు సొంపులు దిద్దుతున్నారు. శ్రీ కృష్ణశాస్త్రిగారు అప్పటికీ యిప్పటికీ అటు భావగీతాలు, ఇటు చిన్ననాటకాలు, ఆకలిపాటలు, భక్తిగీతాలు వ్రాస్తూనేయున్నారు. చింతా దీక్షితులుగారుకూడా కథలు వ్రాయటం మానివేశారు.

నవ్యసాహిత్యముయొక్క యీచివరి రెండుదశల లోను ఒక శక్తిమంతమైన వాడుకభాషారచన గలిగిన ఒకగద్యరచయిత పిడుగువలె ప్రవర్తించాడు. ఆయన భావాలు నచ్చనివాళ్లు చాలామంది ఉన్నారు. ఆధునిక సారస్వతమంటే ఆయన పేరెత్తకుండా వీలు లేదు. ఆయన నవలలు, నాటకాలు, కథలు వ్రాశారు, ఆయనపేరు గుడిపాటి వెంకటచలంగారు. ఆయన తెలుగు ప్రబంధాలు చదువుకో లేదంటారు. ఇంగ్లీషు చదువుకున్నాడు. ఆయన వ్రాసేవన్నీ యింగ్లీషు భావాలే. కాని ఆయనమాత్రం అచ్చమైన తెలుగువాడి నోట, వాడిహృదయంలో నుంచి వచ్చే భాష. ఆయన వ్రాసే ప్రకృతివర్ణనలు తెలుగుదేశంలో నువ్వూ నేనూ చూచేవి. ఆయన భాషననుసరించి ఆయన భావుకత్వాన్ని గురించి నేనెంతైన పొగుడుతాను. కాని ఆయన సిద్ధాంతాలు నా మనస్సుకి వేరుగా ఉంటవి.

ఎడతెగకుండా రెండు మూడు సాహిత్యదశలనుండీ వ్రాస్తూఉన్నవారు కవికొండల వెంకటరావుగారు, వేలూరి శివరామశాస్త్రిగారు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఒకకాలంలో వ్రాసి మానివేసిన పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారిని గురించి కొంచెం చెప్పి వీరు ముగ్గురిని గురించీ చెబుతాను. ఆదినారాయణశాస్త్రిగారు పండితులు, వాడుకభాషావాదులు తెలుగు కవులను గురించి మెచ్చుకొనే ఒకగీతం వ్రాశారు. ధృతరాష్ట్రివిషాదమని ఒక గేయం వ్రాశారు కాని జైనుల అర్థశాస్త్రకథలు అని వ్రాశారు. ఆ కథలలో ఉన్న వాడుకభాష, దానికదేసాటి. అవియింకా వ్రాసి పుస్తకరూపంగా ప్రకటిస్తే సంస్కృతంలో ఆచార్యదండికే స్థానం ఉందో, వాడుకభాషలో ఆదినారాయణశాస్త్రిగారికా స్థానం ఉంటుంది. కవికొండల వెంకటరావుగారు వ్రాయని పద్ధతిలేదు. ఆయన కవిత్వంలో గొప్ప ప్రకృతి పరిశీలన ఉంటుంది గోదావరిజిల్లా పాటకజనం యాస ఉంటుంది. సూక్ష్మతమమై గ్రహించరాని భావుకత్వం ఉంటుంది. వేలూరి శివరామశాస్త్రిగారు గొప్ప పండితులు. చిన్నకథలు, కవిత్వం, అవ్యవహితంగా వ్రాసినవారు. వారి కథలలో గొప్పతరగతికి చెందిన కథలు చాలా కలవు.

నవ్యసాహిత్యంలో ఆయన దూరంగా ఉండి ఆయనతో యితరులకూ కూడా తెలియకుండా గొప్ప భాగస్వామి అయినాడు. అది ఆయన వలదన్నా పోయేది కాదు. ఈ రీతిగా వారికి తెలియకుండా నవ్యసాహిత్యంలో పాళ్లు పెట్టుకున్నవారు చాలామందిఉన్నారు. మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రిలు గార్లు చేసిన పరిశోధన నవ్యసాహిత్యానికే చెందుతుంది. పింగళి లక్ష్మీకాంతంగారి సౌందరనందం నవ్యసాహిత్యానికే చెందుతుంది. ఇది ప్రమోదకుమార చటర్జీ శిల్పపుటాత్తికి. అదే ఆకృతికట్టి శ్రీముట్నూరి కృష్ణారావుగారి ప్రభావముతో కలిసి సౌందరనందంగా మూర్తికట్టింది. కాటూరి వేంకటేశ్వరరావుగారు యీ పరిషత్తులో ప్రత్యేకసభ్యుడు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంఘసంస్కరణమూ, ఆంధ్రరాష్ట్రమూ యీ రెంటినీ కలిపి వ్రాసిన కథలూ వ్యాసాలూ భాషాదృష్టితో చూస్తే వాడుకభాషకి క్రొత్త అలంకారాలు. ఆదినారాయణశాస్త్రిగారి అర్థశాస్త్రకథల్లో భాషకు, కథ చెప్పటంలో ఉన్న ఒడుపువల్ల ఒక గొప్ప దశవస్తే, వీరికి పలుకుబడి సొగసుచేత ఒక గొప్ప వస్తుంది.

వీరుకాక హైదరాబాదునుండి సురవరము ప్రతాపరెడ్డిగారు వారి గ్రంథాలు వారి వ్యాసములచేత కొంత పరిశోధన చూపించారు. నిజాం రాష్ట్రములో వారు యీ ఉద్యమానికి లంకగా ఉండి పనిచేస్తున్నారు. సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారి జాతక కథలు మరొక నవ్యసాహిత్య గ్రంథం. ఈ కాలానికి లక్షణంగా ఉన్న ప్రణయకవిత్వం కంటె ఒక విశిష్ట లక్షణము గల ప్రణయకవిత్వం వ్రాసినవాడు నాయని సుబ్బారావు. ఆధునికులలో చాలామంది రచనను తిక్కన రచనవలె ఉందని చాలామందిని చాలామంది పొగిడారు. వారెవ్వరిలోను తిక్కన అక్షరవిన్యాస వైఖరి లేదు. ఒక్క నాయని సుబ్బారావులోనే ఉన్నది. ఇల్లా కావ్యనాటకాదులు వ్రాసినవారే కాక యితర రచనలతో నవ్యసాహిత్యాన్ని ప్రోదిచేసినవారున్నారు. గొబ్బూరి విజయరాఘవానందరావుగారు తమ భూగోళశాస్త్ర పరిశోధనలవల్ల నవ్యసాహి

త్యానికి చేసిన మేలు మరువతగినది కాదు. వారీ నవ్య సాహిత్య మహాకాశంలో ఒక చంద్రునివలె ప్రకాశిస్తున్నారు. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి వ్యాకరణం నవ్యసాహిత్య వ్యాకృతి.

వఝల చినసీతారామశాస్త్రిగారు గ్రాంథిక వాదులు. వారిని నవ్యసాహిత్యంలో చేరిస్తే వారి కేం కోపం వస్తుందో! అయినా నేనంటే వారికి దయ గనుక సాహసించి అంటున్నాను. వారి వ్యాకరణ పారిజాతం నవ్యసాహిత్యంలోనే చేరుతుంది. ఇన్ని గ్రంథాలూ నవ్యసాహిత్యంలో యెల్లాచేరుతవీ అంటే నవ్యసాహిత్య మంటే నిర్వచనం చెబితే తేలుతుంది.

సాహిత్యమంటే ఒక జాతియొక్క సంస్కారం. మన జాతి పూర్వం ఒక గొప్ప సంస్కారదశను పొందింది. సృష్టిక్రమంలో, సృష్ట్యాదినుండి కాలనిర్ణయంలో, భిన్న రాజచరిత్ర నిర్ణయంలో, సంఘధర్మ నీతులలో, ఆర్థిక రాజకీయాలల్లో, సారస్వతపథాలల్లో ఒక విశిష్టమైన సంస్కారంతో గూడిన సిద్ధాంతాల మీద మన జాతి నడిచింది. ఇవ్వాళ ఆంగ్లేయులు మన్ని ఆక్రమించటం చేత ఆ మహాసంస్కారంమీద అభిమానం పోయింది. పాశ్చాత్య దేశీయుల సంస్కారం మీద అభిమానం ప్రబలింది. ఏతదభిమాన పురస్కృతములైన భాషాతత్త్వం, చరిత్రనిర్మాణం, సృష్ట్యాదికాల నిర్ణయం, సంఘధర్మాలు, విశ్వాసాలు, వీటిని యే యే గ్రంథం పరామర్శిస్తుందో అదంతా నవ్యసాహిత్యం.

ఇప్పుడు పాశ్చాత్య సారస్వత ప్రభావంచేత మన దేశంలో క్రొత్తగా పుట్టిన కావ్యభేదాలను గురించి చెబుతాను. మొట్ట మొదటిది ఖండకావ్యము. ఇది వ్రాయని యువకుడే లేడు. ఇందులో ఉత్కృష్ట దశ ప్రాప్తించిన వాళ్లనిగూర్చి యిదివరకే చెప్పాను. రెండవది నవల. ఇందులో ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి మాలపల్లి, అడివి బాపిరాజుగారి హిమబిందు, నారాయణరావులు చెప్పదగినవి. శివశంకర శాస్త్రి, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగార్లు, యింకను మరికొందరు, బెంగాలీ నుండియో హిందీ నుండియో తర్జుమాలు చేసిరి. తర్జుమాలు చేసినవారు కూడ నవ్యసాహిత్యానికి దోహదంచేసినవారు.

ప్రస్తుత రాజకీయ పరిస్థితులను గురించి నార్ల వేంకటేశ్వరరావు, గోపిచంద్, మానికొండ సత్యనారాయణశాస్త్రి ప్రభృతులు తెలుగులో గ్రంథములు వ్రాసి అధునాతన యుగభావాలను ప్రకోపింప జేసిన వారు.

మూడవది నాటకం. నాటకం మనదేశానికి క్రొత్తగా వచ్చింది కాదు. కాని నవ్యసాహిత్యబలంచేత ఆకారం చాలా మార్చుకుంది గనుక దాన్ని గూడా చెబుతున్నాను. నోరి నరసింహశాస్త్రిగారి సోమనాథవిజయం, ఉన్నవ లక్ష్మీనారాయణగారి నాయకురాలు, అబ్బూరి రామకృష్ణరావుగారి నదీసుందరి, వేలూరి చంద్రశేఖరముగారి కాంచనమాల-వీనిలో చెప్పదగినవి. ఈ చంద్రశేఖరముగారు కవిత్వంకూడా వ్రాశారు. అది యెక్కువ ప్రకటించలేదు. అప్రకటితములైన వానిని నే నొక స్నేహితునివద్ద చూచాను. భాష అడివిగా ఉన్నది. భావం లోకోత్తరంగా ఉన్నది. క్రాస్లు పచినరచనవలె మెఱుగుబెట్టని భాషలో హృదయమును కొట్టే భావాలు ఆయన చెప్పారు. నేను చూచిన రెండుమూడు గీతాలమీదనే యీ యభిప్రాయం. అన్నిగీతాలు యిట్లే ఉన్నవని నేను చెప్పలేను.

చిన్నకథ నాల్గవది. ఇందులో నిష్ణాతులు కొందరిని పూర్వము పేర్కొన్నాను. మిగిలినవారు వెంపటి నాగభూషణం, మల్లాది రామకృష్ణశాస్త్రి, కరణం శ్రీనివాసశిరోమణి, కొడవటిగంటి కుటుంబరావు ప్రభృతులు. వీరుకాక చాలామంది ఉన్నారు. ఈ కథావాఙ్మయంలో అడివి బాపిరాజుగారికికూడా గొప్ప స్థానం ఉంది. ఆయన అనేక చిన్నకథలు వ్రాశాడు. ఆకథలన్నీ చిత్రకళావిజ్ఞానంచేతనిండి ఒక ప్రత్యేక వైశిష్ట్యాన్ని తెచ్చుకొన్నై. ఐదవది గేయాలు. ఇందులో మఱల బాపిరాజుగారికి గొప్ప స్థానము కలదు. నండూరి సుబ్బారావు, నూతక్కి రామశేషయ్య చౌదరి, చిలుమామిళ్ల పార్థసారథి

గారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు వీరందరూ వ్రాసిన గేయాలు నవ్యసాహిత్యానికి అలంకారాలు.

ఆఱవది చిన్ననాటకం, విశ్వనాథ కవిరాజు గారు, మల్లాది అవధానిగారు, బి. వి. రాజమన్నారు గారు మొదలయినవారు దీనికి దోహదం చేశారు.

ఏడవది హాస్యరచన. ఇది యీ తెలుగుదేశములో ఒక్కనిదే సొత్తు. ఆ హాస్య మొక్కొక్కప్పుడు చిన్ననాటకం, ఒక్కొక్కప్పుడు చిన్నవ్యాసం, ఒక్కొక్కప్పుడు ఉపన్యాసం; రాజమహేంద్రవరములో ఆ పురుషుడు నిలుచుంటే చాలు, సభంతా చప్పట్లతో మ్రోగిపోవును. నవ్యసాహిత్యశాఖల్లో యేపనైనా ఒకడు చేయంది యింకొకడు చేశాడుకాని యీ భమిడిపాటి కామేశ్వరరావుగారు చేసిన హాస్యరచన మఱియొకడు చేయలేదు. ఆయన హాస్యంలో నిగూఢంగా బోలెడంత ఆక్షేపణ, ఆంధ్రాభిమానం, వ్యక్తిగతము లైన వికారాలు, తెలుగువాళ్ల మనల్లో ఉండే వెక్కిరింపు, ఎన్నో నిగూఢంగా ఉంటై. అచ్చంగా ఆయన హాస్యకారుడు అనుకున్నవాడు తెలివితక్కువ వాడు.

శ్రోత్రకవిత్వంలో హాస్యం కలిపి చమత్కారంగా వ్రాసి ఆ పద్యాలు సభలో నిలుచుండి దివ్య కంఠంతో పాడుచున్నవాడు మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రిగారు. ఈ శ్రోత్రకవులందరికీ 'పారడీలు' వ్రాసి, ముట్నూరి కృష్ణారావుపంతులు గారి, కాటూరి వేంకటేశ్వరరావుగారి ప్రోత్సాహంతో ఆపారడీకి ఒకకళ తెచ్చినకవి జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు. ఒకరకపు హాస్యరచనలో బందరు నివాసులై కీర్తిశేషులైన వెల్లటూరి స్వామినాథంగారన్నా యన పద్యములు చాలా వైశిష్ట్యం కలవి. 'నారాజు' వ్రాసికీర్తి తెచ్చిన పింగళి నాగేంద్రరావుగారు కూడ యిటువంటి పద్యాలు వ్రాశారు. నవ్యసాహిత్యచాటు పద్య మణిమంజరి అని ఒకటి అచ్చువేసి యిటువంటి వన్నీ సంకలనము చేయవలసిన బాధ్యత యెవరిమీదనో ఉంది.

వీరందరూ నవ్యసాహిత్య నిర్మాతలు. వీరిలో కొందరు కొందరు మహానుభావులు చేయవలసిన పని యీ కార్యం చేయలేక పోయేవారు. కొందరు కవుల గీతాలు కొందరాలపించి ప్రాశస్త్యం తెచ్చినవారున్నారు. తెల్లంకొండ రాఘవరావుగారు, నూతక్కి రామశేషయ్య చౌదరి, కాటూరి వెంకటేశ్వరరావు, చిరుమామిళ్ళ పార్థసారథి, చిరుమామిళ్ళ శివరామ కృష్ణ ప్రసాద్ మొదలైనవారు తాము కవులై ధనవంతులై యితర పేదకవులకు సహాయంచేసి నవ్యసాహిత్యానికి ద్వివిధోపకారం చేసినవారు. దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారి మేనకోడళ్ళు కృష్ణశాస్త్రిగారి, బాపిరాజుగారి పాటలు పాడి నవ్యసాహిత్యసభలు ప్రకాశింప చేసినవాళ్ళు. ఓన నేర్చిన భరతనాట్యం చేత బి. వి. నరసింహారావుగారు, కృష్ణశాస్త్రి, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావుగార్ల పాటలు పాడి నవ్యసాహిత్యాన్ని విస్తరింప చేసినవాడు. రాయలసీమలో చిలుకూరి నారాయణరావుగారి శిష్యులుగా కొందరు మధురకవు లున్నారు. చిన్నకథలు వ్రాసినవా రున్నారు. నంద్యాలలో కొందరిని చూచితిని. వారిపేర్లు జ్ఞాపకములేదు. పుట్టపర్తి నారాయణా చార్యులుగారు తన కవిత్వంచేతా విమర్శనచేతా రాయలసీమలో నవ్యసాహిత్యోద్యమానికి దోహదం చేస్తున్నారు.

ఈ నవ్యసాహిత్యంయొక్క అభిమానులు తెలుగుదేశములో ఒక కొసనుండి ఇంకో కొసవరకు వ్యాపించియున్నారు. మద్రాసులో వింజమూరి గోవిందరాజాచార్యులుగారు, నెల్లూరులో తూము లూరి శివరామయ్యగారు, ఒంగోలులో నాయని నరసింహారావునాయుడుగారు, బాపట్లలో పలగపూడి సుబ్బారావు,మాధవపెద్ది కాళిదాసుగార్లుఇట్లా ఆయా గ్రామాలలో వారే కాక, ఇంకా ఎంతోమంది, మఱింకా చాలా గ్రామాల్లో ఇంకెందరో కలరు. అందరిపేర్లూ చెప్పటానికి వ్యవధిచాలదు. ఇది ఈ పరిషత్తుయొక్క పరిణాహమును తెలియ చేస్తుంది.

ఈ ఉద్యమం ఒక ప్రాంతానికి చెందిందిగాదు. ఒక తెలుగు దేశానికి సంబంధించిందికాదు. భారతదేశంలో ప్రతి రాజధానిలో యీ ఉద్యమం ఉంది. బెంగా

ప్రేమచంద్ మొదలైనవారు మహాకవులుగా పరిగణింప బడుతున్నారు. ఇంగ్లీషులో ఉన్న పి. ఇ. యన్. పత్రిక, హిందీలోని 'హంస' పత్రిక యీమహాద్యమానికి భారతదేశం మొత్తంమీద యేకీభావం తీసుకురావడానికి ప్రయత్నిస్తున్నవి. నాలుగు సంవత్సరాల కొకసారి అయినాసరే, ఒక సంచికవేసి నవ్యసాహిత్యంలో తా మున్నామని చూపించ తలచుకొన్న యువకు లున్నారు. ఆ రేండ్లక్రింద ప్రకటింపబడిన వైశాఖి, యేడాదిక్రింద నిజాం రాష్ట్రమునుండి వచ్చిన కిన్నెర యీ యుద్యమములోని అంతర్వేణికలు.

ఇవన్నీ నవ్యసాహిత్యంలోని ఘట్టాలు. ఈమహాస్వరూపమంతా యేకముఖంగా పనిచేస్తోంది. వీరందరూ నవ్యసాహిత్య పరిషత్తులో సభ్యులుకారు. కొంద రగుటకు ఒప్పుకోరు. వీత దక్షిముఖంగా నడుస్తున్నామనే అంగీకరించరు కొందరు. అయినా యెక్కడ ఉన్నా ఇది ఒక మహాసాభ్రాతృతాపీఠి. నవ్యసాహిత్యానికి ఒకపరిషత్తు యేర్పరచి యీ పర్యాలోచన చెయ్యటం యీ పరామర్శ జరపటం, యేడాది కేడాదికీ యీ కళ్యాణాలు చెయ్యటం కొందరే పూనుకున్నారు. అంతమాత్రాన ఇది యేక దేశవిషయంకాదు.

ఈనవ్యసాహిత్యంయొక్క భవిష్యత్తు యేమిటో చెప్పటం సాధ్యంకాదు. దీని భవిష్యత్తంతా రాచకీయంమీద ఆధారపడి ఉంది. స్వరాజ్యంవస్తే దాని స్వరూపం యెట్లా ఉంటుందో ? ఇంగ్లీషుచదువు నిలుస్తుందో నిలవదో! రాజ్యాంగం కాంగ్రెసు చేతుల్లో ఉంటుందో, సామ్యవాదుల చేతుల్లో ఉంటుందో? విశ్వవిద్యాలయాల చదువులలో సంస్కృత దేశభాషలకు ప్రాధాన్యం వస్తుందో రాదో? ఇందులో యేది యెట్లా జరిగినా, నవ్యసాహిత్యం అట్లాంటి మార్పు పొందుతుంది. తక్కిన భావాలెట్లా ఉన్నా క్రొత్తగా తెచ్చుకొన్న కావ్యభేదాలు సారస్వతంలో నిలుస్తవి. ఏది ఎట్లాఉన్నా రచయితలందరూ ఒకవిషయం మాత్రం జ్ఞాపకం ఉంచుకోవాలి. భావం నీయిష్టం వచ్చినట్లు చేసుకో. ఆభావానికి అమలు ఉన్నవాళ్లు ఆభావం అమలులోఉంటుంది. భావమాత్రం అచ్చంగా నీ తెలుగుభావవాడు! నుడికారంలో, ప్రయోగించడంలో, తెలుంగుపుస్తకంలో తెలుగు కాని పోకడ పోవద్దు. ఇది ఒక్కటీ లక్ష్యంగా పెట్టుకుంటే నవ్యసాహిత్యానికి భయంలేదు.



# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు

శ్రీ వడ్లమూడి వెంకటరత్నము

ఇక పరిషత్తువారు ప్రకరణార్థమును సరిగా గమనింపలేదనుటకు దృష్టాంతముగా నే నుదాహరించిన ఆంధ్రమహాభారతనిఘంటు ప్రోక్తపదములనుగూర్చి శాస్త్రిగారి పరామర్శము నొకింత పరిశీలింతము.

అగు=ఆధారమగు (మహాభారతనిఘంటువు.)

"ఆ. అధికతాపతప్త మైనది వాచిత్త
మెవర వతనితోడ నొకట నునికి
యెన్నఁడొక్కొ మనకు నిందఱ కగు వాతఁ
డేల మసలెనొక్కొ యిన్ని యేండ్లు.?"

(ఆరణ్య ౩-౨౯౦)

ఇచటి 'యగు'నకు ఆధారమగు, ప్రాపగు అనియే యర్థము చెప్పవలయును. అనుచు

శ్లో. "సర్వేషా మాశ్రయో౽స్మాకం,
రణే౽రీణాం ప్రమర్దితా"

(సం. భా. ఆరణ్య ౧౪౩-౧౭)

అని నే నుదాహరించి యుంటిని. దీని నాక్షేపించుచు శాస్త్రిగారు చెప్పినకారణములు చూడుడు.

(౧) అగు నాతఁడు అని చెప్పినచో ఎన్నఁడొక్కొ అనుతావున క్రియ నధ్యాహారము చేసికొనవలయును. అది తగదు.

(౨) సీసపాదములు నాలుగింట నర్జునునకు గల గుణవిశేషములు చెప్పి ముగించి మరల నాతని గుణవిశేషమునే ఇక్కడ ప్రస్తావించుట స్వారస్యముగాదు.

(౩) ఈ యొక్క ప్రయోగమునుబట్టి అగు ధాతువునకు క్రొత్తయర్థ మొకటి గల్పించుట యనవసరము.

(౪) మూలమునుబట్టి యీ క్రొత్తయర్థము మూలమునకు సార్థకము గాదు.

వీనికి నా సమాధానములు :—

(౧) ఎన్నఁడొక్కొ అనుతావున "క్రియనధ్యాహారము చేసికొనవలయును; అది తగదు" అని శాస్త్రిగారనుట సముచితము గాదు. ఇచట క్రియలేనంతమాత్రమున అర్థస్ఫూర్తి కేమియు లోపము లేదు. ఒకవేళ క్రియకావలయుననియే యనుకొన్నచో అధ్యాహారమే చేసికొనవిందు. అందుల కేమియు నభ్యంతర ముండదు. కాని, క్రియలు చెప్పక 'ఒక్కొ'తో ముగించిన వాక్యములు ఆంధ్రమహాభారతమున—నన్నయభట్టారకుని కవిత్వమున పెక్కులు కలవు. మచ్చునకు

ఆ. "...ఇది యపూర్వ మీత డెవ్వఁడొక్కొ"

(ఆరణ్య ౧-౩౧౪)

ఆ. "...ఇమ్మని యేల సైచు నింక నెట్టులొక్కొ"

(ఆరణ్య ౨-౩౩౦)

ఇట్టిచోట్ల క్రియాపదములు లేకయే సంశయార్థకములతో వాక్యములు ముగియుట ఆంధ్రభాషా సంప్రదాయమునకు క్రొత్త గాదు. పండితుల కిది యపురూపమును గాదు.

(౨) "సీసపాదములలో నర్జునుని గుణవిశేషములు చెప్పి ముగించి మరల గీతములో నాతని గుణవిశేషమును జెప్పుట స్వారస్యము గాదు." అనుటలో వింతదన మున్నది. ఏమనగా నీ ఆటవెలదిలో చెప్పిన గుణవిశేషము సీసపాదములలో చెప్పబడి యుండలేదు. చూడుడు.

"సీ. అలిగి వజ్రాయుధు నైనను పోరిలో
నోర్వంగనోపు నత్యుగ్రవీరు
జవమునఁ బవనుఁ దేజంబున నాదిత్యుఁ
బోలినవాని సంభోజనేత్రు
నాయతబాహుఁ గృతాస్త్రు సింహస్కంధు
సర్వధనుర్ధరాచార్యు విజయు

నిత్యశుమాన్యతు నీ తమ్ము నర్జును
  శుభగుణ సుందరుఁ జూచునంత
కధిక తాపతప్త మైనది నాచిత్త
మెంనర నతనితోడ నొకట మనికి
యెన్నఁడొకొ మనకు నిండఁ గను వాతఁ
డేల మసలెనొకొ యిన్నియేండ్లు"
(ఆరణ్య 3-౨౯౦)

ఈ సీసపాదములలో జెప్పిన గుణవిశేషములను గాదుగదా యెత్తుగీతిలో చెప్పినది. లేక కొన్ని విశేషణములను చెప్పియుగించి మరల విశేషణమును జెప్పుట ప్వారసికము గాదందురా? ఈరీతి శాస్త్రిగారికి ప్వారసికము గాదేమోగాని నన్నయభట్టారకునకును, ఆంధ్ర భారతరసికులకు నగును.

మచ్చున కొకటి

"పీతసమస్తదోషుఁడయివేడ్కఁదపం బొనరించుచున్నవిఖ్యాతుఁబురోహితప్రవరుగావరియించిరి భక్తితో జగత్పూతచరిత్రు సాధుజనపూజితు ధార్మికు ధౌమ్యుదేవల భ్రాతృవరుణ్మహాత్ము మితభాషణు భూసురవంశ
భూషణున్"
(ఆది ౭-౧౫౮)

చాలునా ?

ఈవిశేషణప్రయోగపద్ధతిని సమాప్తపునరాత్తమనిగానీ ప్వారసికము గాదనిగానీ రసికు లీసడింప లేదు, ఆదరించిరి. పెక్కురు పండితు లిది యోగ్యమనియే సమర్థించిరి.

3. ఈయొక్క ప్రయోగమునుబట్టి క్రొత్త యర్థమును గల్పించుట యనవసర మనిగదా శాస్త్రిగారి యభిప్రాయము! ఈక్రొత్తదన మెవరికి? నిఘంటువులకా? భాషకా? నిఘంటువుల కన్నచో నది వాని యసమగ్రత యనుటయే. లేక భాష కందురా? అది సమంజసము గాదు. అనుధాతువునకు ఆశ్రయమగు, ప్రాపగు అను అర్థము లోకవ్యవహారరూఢము.

ఉదా. భార్యకు భర్త గావలయును; భర్తకు భార్య కావలయును. కాని యితరులు కష్టములలో నగుదురా?

తండ్రికి బిడ్డ; బిడ్డకు తండ్రి కావలయును గాని యితరు లెవ రగుదురు?

ఇట్టి తావుల 'అగు' నకు 'ప్రాపు' తప్ప మఱియొక యర్థము సరసము గాదు. అన్యోన్యాశ్రయమే యన్యోన్యక్షేమకరముగాన నాయర్థమే సముచితము. కాబట్టి యీయర్థము భాషకు క్రొత్తదిగాదు.

'ఈయొక్క ప్రయోగమునుబట్టియే యీయర్థమెట్లు చెప్పవగును' అని శాస్త్రిగారికి గల మఱియొక సందియము. ఒక్కప్రయోగమును బట్టియే నిఘంటువులో కొన్నిమాటల కర్థములు వ్రాసియున్నారు. చూడుడు

(క) అందగించు : స. క్రి ౧ ఎంచు, ౨ ఏర్పఱచు, నిర్మించు, రచించు. ఈ రెండర్థములందు ప్రయోగాంతరము గానరాదు.

(ఖ) అంపాచారము: ధారాపాతము
డీనికి ప్రయోగాంతరము మృగ్యము.

(చ) అంచు అణచు
ప్రయోగాంతరము కనబడలేదు.

ఇట్లు సూ - ఆం - ని - లో వ్రాసియున్నారే; మఱి యిప్పుడొక్కమాటకే క్రొత్తయర్థమా? అనుచున్నారేమి? ఆ సందర్భమున కవి యేయర్థమున బ్రయోగించెనో యాలోచింప వలయునుగాని యీయొక్కమాటకేనా అనుట యుచితమా? అందునను నన్నయమనీషివంటి కవీంద్రుని ప్రయోగమునకా యీ సంకోచము?

(౪) మూలమునుబట్టి యీ యర్థము మూలమున కనుగుణము గాదట! ఏలకాదో శాస్త్రిగారు చెప్పలేదు. 'సంస్కృత భారతమునగల ప్రతిశ్లోకము తెలుగున ననువదింపబడలేదు గావున నీయర్థమున నీశబ్దము ప్రయోగింపబడ్డదని చెప్పవలనుపడదు' అని శాస్త్రిగా రనుచున్నారు. సంస్కృతములో నున్న ప్రతిపదము మక్కికిమక్కిగా

ననువదింపబడ్డ దనుట యెట్టివిపరీతమో సంస్కృత ములో నున్న యర్థము ననుసరించి తెనుగులో శబ్దములు ప్రయోగింపబడ లేదనుటయు నట్టివిపరీతమే. శబ్దరత్నా కరాదులందువలెనే సూర్యరాయాంధ్ర నిఘంటువు నందుగూడ అర్థనిర్ణయమున కచ్చటచ్చట భారతాది శ్లోకముల నుదాహరించుచు వచ్చినారు. తాము చేసిన పనినే యితరులు చేసినప్పు డీయాక్షేపణ లేలాగో!

మఱియు శాస్త్రిగారా శ్లోకభావము పైయాట వెలదిపద్యమున గలదని ఒకపక్షమున నంగీకరించుచు ‘అను’ ధాతువునకు ‘ఆశ్రయ’ శబ్దముగాకున్న ‘సుఖా వహ’ శబ్దమును జెప్పగూడదా? అనుచున్నారు. పోనీ ఆయర్థమైన తమ నిఘంటువున వ్రాసినారా? అన్న నదియు లేదు. ఆశ్రయ, సుఖావహ శబ్దములకు భావమున కొంత సమానత్వ మున్నది. అయినను ఆశ్రయశబ్దమున కర్థపుష్టి యెక్కువ గలదు. కనుక మహాభారతనిఘం టువు అనుధాతువునకు ఆశ్రయార్థము పఠించుట సరసమే యగునని నాతలంపు.

ఈ శబ్దమున కాయర్థము చెప్పుటకు విశేష కారణ మింకను నిది. పై ఆటవెలదిపద్యమును శాస్త్రి గారి యుద్దేశప్రకారము అన్వయించినచో నిట్లగును.

‘అధికతాపతప్తమైనది నాచిత్తము. ఒవర నతని తోడ నొకట నునికి యెన్న డొక్కొ మనకు నిందఱ కగును! అతఁడేల మసలె నొక్కొ యిన్ని యేండ్లు!’

దీనిని భారత నిఘంట్వభిప్రాయానుసార మన్వ యించినచో నిట్లు అగును.

‘అధికతాపతప్త మైనది నాచిత్తము. ఒవర నతనితోడ నొకట నునికి యెన్నఁడొక్కొ! మనకు నిం దఱ కగునాతఁ డేల మసలెనొక్కొ యిన్ని యేండ్లు!’

ఇందు చిత్త మధికతాపతప్త మైనదను అనుతాప కథనమును, అతని తోడియునికి యెన్నడో అనునభి లాషయు, అత డిన్ని యేండ్లేల మసలెనో యను సంశయ మును ఉభయాన్వయములందును దుల్యములే కాని రెం డవయభిప్రాయప్రకారము ‘అను’ధాతువును అతడు అను సర్వనామమునకు విశేషణముగా నన్వయించి నచో ‘మన ...

భావముగూడ కలిగి పాండవుల కర్జునునియెడగల విశ్వాస భావముగూడ ప్రస్ఫుట మగును. పాండవుల కర్జునుని యెడ నిట్టి విశ్వాసభావము గలదని వారి సంభాషణము లనుబట్టి మన మెఱుగవచ్చును. చూడుడు.

“క. అట్టియవసరంబున యుధిష్ఠిరునకు భీముం డిట్లనియె. (ఆరణ్య ౧-౩౯౧)

మధ్యాక్కర.
నీ నిదేశంబున నరిగి పార్థుండు నిష్ఠతోఁ దపము
మానుగాఁ జేయుచునున్న వాఁ డేల మసలెనో రాక
వానిదర్శనప్రీతిఁ బాసియున్న యివ్వర్షములు యుగస
మానంబు లైనవి మనకు నతని సమాగమకాంక్ష.
(౧-౩౯౨)

వ. మఱి పాండవ పాంచాల యాదవ వీరుల జీవనంబు లాతనియంద నిలిచినవి. తదీయభుజాశ్రయ బలంబునం బరుల జయించి ధరణీ రాజ్యంబుఁ బరిగ్రహింత మని యున్నవారము”
(౧-౩౯౩)

ఇట భీముడు ‘మఱి’ యని ప్రారంభించి యర్జునుని యాధారత్వముం జెప్పుటచే నావిషయ మెంత ప్రధానమో తెలియగలదు.

మఱియు

“వ. అజాతశత్రుండు ధౌమ్యుంజూచి యిట్లనియె.
(ఆరణ్య ౨-౨౭౬)

చ. అలయక మాకు నందఱ క
హర్నిశమున్ ప్రియకారియైన య
త్యలఘుపరాక్రమోన్నతుమ
హాభుజు నర్జును దివ్యసాయకం
బులు వడయంగ నొక్కరున
ప్పుచ్చితిఁ దద్దయు వేడ్క నెద్దియుం
దలఁపక యిప్డు తద్విరహి
తమ్మగు కామ్యక మొప్పదయ్యెడున్.
(౨-౨౭౪)

ఇందును అర్జునుని అహర్నిశప్రియకారిత్వమును స్మరించుచు నాతనియెడగల విశ్వాసమును ప్రకటించు

విశేషణముగనే యన్వయించి 'ఆధారమగు' అను నర్థము చెప్పుట రసికజనరంజకము గాకపోదు. ఈ యర్థము పై సీసపాదములలో లేదు. అట్టిచో పాండవుల సద్భావమును బలపఱచుచు సరళముగ గలుగుచున్న నీయర్థమున కేల స్వస్తి చెప్పవలయును? లేక 'అగు' క్రియగనే యన్వయించి అతడు అన్న నిర్విశేషక సర్వనామమునకే యాభావము చెప్పెద మందురా? ఆక్లేశ మేల కావలయును? కనుక 'అగు' ధాతువున కిచట ప్రాపను, ఆశ్రయమగు నను అర్థమే సరసమని రసజ్ఞు లూహింపకపోరు.

అసు=జీవించు (మహాభారతనిఘంటువు) అని వ్రాసి "వ. నేఁడు రణభూమియందు నర్జునుం డొండెఁద్రిగర్తు లొండెం గావలయు" ద్రోణ (౧-౨౨౦) అని యుదాహరణ మిచ్చుచు

శ్లో. అద్యాస్త్వనర్జునా భూమి రత్రిగర్తాథవా పునః,
(సం. భా. ద్రో ౧౬-౧౬)

అని దాని కుపబలముగా నిచ్చియుంటిని.

దీనిని శాస్త్రిగా రాక్షేపించుచు నీ క్రింది కారణములు తెలిపియున్నారు.

(అ) ఇది 'అగు' లోని 'ఉండు' నను అర్థములో గతార్థము.

ఇది సూర్యరాయాంధ్రనిఘంటువున నుక్తమే.

(ఆ) తిక్కన మూలమునకు సరిగా తెనుగున జెప్పలేదు.

(ఇ) సంస్కృత భారతసందర్భము వేఱు; తెనుగుభారతసందర్భము వేఱు.

(ఈ) అగునకు 'జీవించు' అని చెప్పరాదు; ఉండు అని చెప్పవలయును.

వీనికి నా సమాధానములు:—

(అ) 'అగు' నకు 'ఉండు' అని పర్యాయపదము చెప్పి యొకప్పు డాభావమును ప్రకటింపనగును గాని 'ఈవేళ నేనైన నుండవలయును; వాడైన నుండవలయును' అన్నప్పుడు కేవల మునికి మాత్రము తీసికొనక వారిలో నొకరి మహాప్రస్థానము దాక భావమును బరువెత్తించినగాని పౌరుష సంపద ప్రస్ఫుటముగాదు. కాబట్టి యిచ్చటి 'అగు' నకు వీరు వ్రాసిన 'ఉండు' చాలదుగాని 'ఉండు' నకు వ్రాసిన 'జీవించు' అను నిఘంటర్థ్వము సరిపడును.

(ఆ) సంస్కృతభారతమున 'భూమి' అని యుండగా తిక్కన రణభూమి అని ప్రయోగించినాడట! అందువలన నియ్యది మూలానుసరణము కాదట!

సంస్కృత మూలమునుబట్టి ఈనాఁడీ భూమి త్రిగర్తులు లేనిదిగా నైన గావలయును; అర్జునుడు లేనిదిగా నైన గావలయును. (ఈభూమిమీద నిక త్రిగర్తులు నర్జునుడు—ఉభయులు – జీవించుట చెల్లదు. ఎవరో యొకరే యుండవలయును. అనుఅభిప్రాయము ప్రకట మగుచున్నది.) అనగా తెనుగుభారతమున అర్జునుడైన బ్రతుకవలయును; త్రిగర్తులైన బ్రదుకవలయును. (ఉభయులు బ్రదుకుట చెల్లనేరదు) అని కవిబ్రహ్మ వ్యాసహృదయము, సందర్భశుద్ధి, పౌరుషము ఎఱిగినవాడు గావున పలికియున్నాడు. మఱి మూలములో లేని 'రణ' శబ్దము నేల తెచ్చిపెట్టె నన వచ్చును. ఈవాక్యములు రణమునకు బయలుదేఱువేళ త్రిగర్తులు పలికినవి. వారి బ్రదుకులు రణముననే తేల వలసియున్నవి. కనుకనే తిక్కనమనీషి పౌరుషద్యోతకముగా 'రణభూమి' అని ప్రయోగించినాడు. ప్రకరణమునుబట్టి 'భూమి' అనగా రణభూమి అనియు జెప్ప వచ్చును. అప్పుడు వ్యాసాభిప్రాయము నిదియే యగును.

(ఇ) సంస్కృతభారతసందర్భము వే అనియు తెనుగుభారతసందర్భము వే అనియు శాస్త్రిగా రనుచున్నారు. కాని యావేఱుపాటు లేవియో వివరింపలేదు. కనుక నుపేక్షింతును.

(ఈ) నేఁడు యుద్ధభూమియందు అర్జునుడో త్రిగర్తులో వుండవలయును. అనువాక్యమునకు శాస్త్రిగారు 'అర్జునుడు, త్రిగర్తులు ఇరువురు నుండక ఎవరో యొకరు పాఱిపోవుటయో, లేక చచ్చుటయో జరుగవలయును.' అని తాత్పర్యము చెప్పుచున్నారు. నేఁడు ఎవరో యొక రుండవలయును ; ఉభయులు నుండ గూడదు. అని

గనే యుండెడిది. ఉండకున్న నేమికావలయును? అను నాకాంక్ష కలుగగా ఎవరో యొకరు చావవలయును. అను హృదయంగమమగు భావము సరలముగ స్ఫురించెడిది. అప్పుడు భారతనిఘంట్వర్థమును ఘట్టకుటీన్యాయమున నైన నంగీకరించిన ట్లయ్యెడిది. కాని శాస్త్రిగారికి సమకాలికమగు ఇతర నిఘంటువును ఒప్పికొనుట కిష్టములేదు. కనుకనే వారింకను పెడదారిని దూరముపోయి 'ఉండకున్న నేమికావలయును?' అను ప్రశ్నమునకు ఒకపక్షమున 'పాఱిపోవలయును.' అని వ్యాఖ్యానించినారు. ఔరా! ఏమి స్వారస్యము! నేనొకతావున అన్వయమున ప్రమాదపడినందులకు 'పండితులు నిశ్చేష్టులు కాకలేనదే' యన్నారు శాస్త్రిగారు. తిక్కనభారతమున కిప్పుడు వీరు చేసిన వ్యాఖ్యానమువలన పండితు లేమగుదురో! సాహిత్య సరస్వతి యేమగునో! శాస్త్రిగారు ఈ పరామర్శము వ్రాయునప్పుడు - ఒక్కసారి తిక్కన చెప్పిన యీ ఘట్టమును పరికించి వ్రాసినచో నెంతబాగుగ నుండెడిది!

శాస్త్రిగారి యభిప్రాయ ను సారము త్రిగర్తులు రెండవ పక్షములో పాఱిపోవుటకుగూడ నిశ్చయించుకొనిరనిగదా తేలుచున్నది! అట్లు పాఱిపోవుటకు త్రోవ చూచుకొన్నవారు అటో యిటో తేలవలసిన అర్జునునితోడి ఆ ఘోర యుద్ధమున కేల తలపెట్టుదురు? తమకు వీలుగానిచో తప్పించుకొని పాఱిపోవ నవకాశ ముంచుకొనియే యీ ప్రతిజ్ఞ చేసినా రనుట పరిహాసాస్పదముగాదా? వీలుగా నున్నచో వస్తువులంగొని లేనిపక్షమున నావలకు బోవచ్చు ననుకొనుటకు అది యంగడివీధి గాదు, వా రంగడివారును గారు.

ఘోర శత్రువులతోడి యుద్ధమున కేగుశూరుడు తాను - తనశత్రువు వీరిలో నెవరో యొకరు చావవలయును; ఎవరో యొకరు బ్రదుకవలయును అని ప్రతిజ్ఞ చేయునో, లేక ఎవరో యొకరు పాఱిపోవుటయో లేక చచ్చుటయో జరుగవలయునని చేయుదురో పారువంతుల నేరిసేని విచారింపవలెను.

ఈ వాక్యము త్రిగర్తులు యుద్ధమునకు బోవుటకు ముందుచేసిన ప్రతిజ్ఞలోనిది. [illegible]

ములు. పైవచనముతరువాతనున్న యీపద్యముంజూచి వారు బ్రదుకునే పణముగా బెట్టిరో పాఱిపోవుటగూడ పణముగా నుంచిరో రసికులు నిర్ణయింపుడు.

సీ. అర్జునిఁ జంపుదు మతని గోడిత మేని
  గోవధంబును వనితావధంబు
బ్రహ్మవధంబును బరదారగమనంబు
  బ్రహ్మస్వహరణంబుఁ బరగ నాప
హరణంబు గురుజనత్యాగంబు శరణాగ
  తారక్షణము నసృతాభిరతియు
మద్యపానము సరిమానవపై ముఖ్య
  మును గృహదాహంబు జనుల కెట్టి
గతులఁ బుచ్చు నట్టిగతులు వాటిలు నక్కి
రీటికోలుతలకు నోట లేక
దుష్కరంబు సేసి తుదిగన్న పుణ్యాత్మ
కలితగతుల మేలుగలుగుమాకు

(భార-ద్రోణ ౧-౩౨౧)

ఇం తెండైన పాఱిపోవుట యనునది వాసనగా నైనగలదా? చావో బ్రదుకో కదా యిందు చెప్పబడ్డది! ఓడినచో నైన ఘోరాన్న దుర్గతులు గలుగు ననియు, ఓటమిలేక పుణ్యగతులు పొందుదు మనియుగదా యిందలి ప్రతిజ్ఞ! ఇట్టి ఘోరశపథములవలననేకదా వారు సంశప్తకు లయిరి! వారట్లు ఘంటాపథముగా మొత్తుకొనుచుండగా శాస్త్రిగారి కీపాఱిపోవుట యెట్లు తోచినదోగదా! కనుక నిచటి సరసాభిప్రాయమునుబట్టి వ్యాస - తిక్కనల యభిప్రాయము లొక్కటియే యని తేలి యిచ్చటి 'అసు'నకు 'జీవించు' అనునర్థమే సమంజసమని స్పష్టమగుట లేదా? శాస్త్రిగారి ప్రయత్నము ఉన్న నిఘంట్వర్థమును సంరక్షించుకొనుటకు గాదా?

అంతర్గతము = మనస్సు.

(భారత నిఘంటువు.)

దీనిని పరామర్శించుచు పరామర్శకు లిచ్చిన కారణములు.

౧ ఈ యర్థము నే నిఘంటువు నీయలేదు.

౨ దీనికి హృదయాంతర్గతముగా నని యర్థము

దీనికి నా సమాధానములు:—

౧ ఏ నిఘంటువును చెప్పలేదు గాన నగ్రాహ్య మనుట సరిగాదు.

ఇప్పు డీ నిఘంటువులోనున్న యర్థములన్నియు నితరనిఘంటువు లిచ్చినవేనా? ఇతరనిఘంటువు లీయని యర్థము లిం దేమియు లేవా? ఉన్నవనియే నా యభిప్రాయము. శాస్త్రిగా రట్లు తలంపరా యేమి? ఇందు విశేషార్థములు లేకున్నచో దీనికొఱ కుపయోగించిన శ్రమాదులు సఫలములే యగునా?

ఏ నిఘంటువు నీపదము నీయలే దనుటకంటె ఏ గ్రంథకర్తయు నీయర్థమున బ్రయోగింపలేదనిగానీ, ఏ యాంధ్రుడు నీయర్థమున నీపదమును వ్యవహరింపడని గానీ చెప్పుట లెస్స. ఇది సంస్కృతపదమయినను సంస్కృతమున ఈ పదమునకు మనస్సను నర్థము లేకుండవచ్చును. ఆ యర్థము తెనుగునందు కలుగ వచ్చును. దాని కేమి? పెక్కుసంస్కృతశబ్దములు సంస్కృతభాషలో తమకుగల యర్థములను విడిచి పెట్టుకొని విపరీతములు, వింతలువను అర్థములతో తెనుగున వ్యవహరింపబడుట పండితులకు క్రొత్తగాదు. సంస్కృతనిఘంటువులయం దాయర్థములు కానరావు. అయినను వాడుకయందును, కొన్నిగ్రంథములయందును ఆ యర్థములు మనకు గనబడుచుండును. చూడుడు.

అబద్ధము: దీనికి తెనుగున అసత్యమనునర్థము గలదుగదా! సంస్కృతమున నీయర్థముగలదా? ఇట్లే ఉచితము, భాగ్యము, అర్థి మొదలగుపదములు తెనుగు సారస్వతమున నెన్ని లేవు? అంతదూర మేల? సూ. ఆం. నిఘంటువులోనే

అనుమానము = సందేహము, సంశయము.

ఈ అర్థము ఆంధ్రగ్రంథములందే కనబడు చున్నది.

ఆగ్రహము...కోపము

ఈ యర్థము తెనుగుగ్రంథములందును, వాడుక లోను గన్పించుచున్నది.

అన్వ్రశుతము: వంశసంప్రదాయము ననుసరించి వచ్చినది. కులక్రమాగతము: ఈ యర్థము వాడుక లోనిది.

ఇట్లు లిచ్చియున్నారు. దీనినిబట్టి సంస్కృత మున నీయర్థము లేదనుటయు పొసగదు.

(౨) నిజ అంతర్గతమునన్ దీనికి తనహృదయాంతర్గతముగా అనుటకంటె 'తనమనస్సులో' అని చెప్పుట సరలము. అంతర్గతము అను యౌగికశబ్దమునకు 'లోపలనున్నది' అని యర్థము అగుటచే లోపలనున్న వానిలో ప్రధానమై, ఆలోచనాదులకు స్థానమైన మనస్సు అనుట అసమంజసము గాదు. పంకజము మొదలగు శబ్దము లిట్టులే పదార్థకము లయినవి. ఆపక్షమున అంతర్గతమునన్ అనునది సప్తమీవిభక్త్యంతమయి శబ్దరూపముగూడ చక్కగా సిద్ధించును.

కాక శాస్త్రిగారు చెప్పినట్లు క్రియావిశేషణముగనైన నన్వయింపవచ్చును. అందువలన అర్థమునకు గలుగు బాధనష్టములు లేవు. కాని మనోగతముగా— అనగా—మనస్సునందు అని యొక్కయడుగు చుట్టు జిరిగి రావలయును. శబ్దరూపసిద్ధి అంతసరలమగునా అనునది శాస్త్రిగారు తెలుపవలయును. 'నన్' అనునది క్రియావిశేషణముల కనుప్రయుక్తములగు భారత ప్రయోగము లున్నవా? అట్టివి చేర్చి సమగ్రవ్యాకరణము రచింపవలయునా?

ఆడరు=వెంబడించు (మహాభారతనిఘంటువు)

చ. "అతిరథసంబుపై నడరి యాతనిఁబట్టినుశర్మ..."
(విరాట 3—౨౦౧)

మూలము. ప్రమథ్య జిత్వాచ ప్రసహ్య మత్స్యం
విరాట మోజస్విన మభ్యధావత్.
(సం. భార. విరాట 33—౭)

అని యుదాహరించి యుంటిని.

దీనిపై శాస్త్రిగారి యాక్షేపములు:—

౧. అడరునకు కవియు అనునర్థముగాని వెంబడించు అనునర్థముగాదు.

౨. మూలమునకు పదమునకు సంబంధము లేదు

౩. ఈ పద్యమునకు సంబంధించినమూల మిది.

శ్లో. సుశర్మా . . విరథం మత్స్యరాజానం జీవ
గ్రాహమథాగ్రహీత్.

(సం-భార-విరాట ౩౫-౧౧)

౪. అభ్యధావత్ అనుదానికి ఎదురుగా బరు వెత్తె ననవలయును గాని వెంట అని యర్థము చెప్పుట మిక్కిలి తప్పు

వీనికి నా ప్రత్యుత్తరములు:—

౧. కవియుట అనగా సమీపించుట అని శాస్త్రిగారి భావమయియుండును. ఇందులకు భారత నిఘంటువునకు గూడ వ్యతిరేకభావ ముండ దను కొందును. కాని యీసమీపించుట యేదిక్కుగా? అను ప్రశ్నకు భారతనిఘంటువు "వెనుకనుండి" అని యర్థము చెప్పుచున్నది. కాని శాస్త్రిగారో ఏదిశ యయినది చెప్పుటలేదు. లేక శాస్త్రిగారు 'అభిముఖ ముగా సమీపించుట' అని యర్థము చెప్పుదురా? ఏదిక్కునుండి యయినది సందర్భమునుబట్టి నిర్ణయింప వలయును. ఆసందర్భమును జూడుడు—

చ. – – – – త్రిగర్తనా,
థులు నరుదేరఁ దద్రథమ్ము
తోఁ గదియించి తదీయసారథిన్
బలువిడిఁ గూర్చి రథ్యముల
ప్రాణములం గొని రుగ్రమూర్తులై.

(విరాట ౩-౧౯౯)

వ. ఇవ్విధంబున విరాటుండు విరథుం డగు టయు

(౩-౨౦౦)

చ. అతిరభసంబునై సడరి యాతనిఁ బట్టి సుశర్మ

(విరాట ౩-౨౦౧)

విరాటుడు సుశర్మతోడను, ఆతని తమ్మునితోడను బోరాడుచుండెను. వా రిరువురును తమ రథములతో విరాటరథమును సమీపించి అతనిసారథిని, గుఱ్ఱములను జంపిరి. విరాటుడు విరథు...

అపుడు సుశర్మ ఆతనిని బంధింపబోవుచుండెను. ఈ పోకను జెప్పునది యీ 'యడరు'.

సుశర్మ తన్నుపట్టుకొనుటకై తనమీదికి వచ్చునపుడు విరాటు డేమిచేయుచుండెనో యూహించినచో ఈ 'అడరు'న కర్థము సరలముగా దేలగలదు. విరాటు డప్పుడు యుద్ధముచేయుటకుగానీ, పట్టుకొమ్మనిగానీ యెదురుగా వచ్చుచుండునా? లేక భయాదులచేత గానీ, సత్యాగ్రహముపూనిగానీ రథముమీదనే కూరుచుండియుండునా? లేక పిఱికితనముచే వెన్నిచ్చిగానీ యుద్ధముచేయుట కనుకూలముగా మఱియొకరథ మధిరోహించుటకుగానీ పోవుచుండునా? ఏది సరసమో పండితు లాలోచింతురుగాక! లేక యీ యాలోచన యనుచితమా?

(౨-౩) మూలమునకు పద్యమునకు సంబంధము లేదు. అని శాస్త్రిగా రనుచున్నారు భారత నిఘంటువు విరాట ౩౩-౨ గా మూలమును సూచించి యున్నది. శాస్త్రిగా రాంధ్రభారత ఘట్టమును(౩౫-౫ విరాట. గా) సూచించియున్నారు. ఈ సంఖ్యలనుబట్టి యీ ప్రతులభేదము ప్రకట మగుచున్నది. ఈ రెంటిని తెక్కనభారతముతో పోల్చి చూచిగాని నిర్ణయింపరాదు గావున ప్రస్తుతము నేను వానినిగూర్చి చర్చింపను.

(౪) 'అభి'కి వెంట అనిఅర్థము చెప్పుట మిక్కిలి తప్పు అనుచున్నారు శాస్త్రిగారు. వామన శివరావు ఆప్తుని సంస్కృతాంధ్ర నిఘంటువులో "అభి:— **has all the senses of** అను, **given in 1-4-90 except that of** భాగ..." అని చెప్పి అభిగసి అను పదమునొద్ద **To follow, To go after** "అనురాగా ద్వనేరామం దిష్ట్వా త్వమభిగచ్ఛసి" (రామా) అను నుదాహరణ మిచ్చియు,

"అను"దగ్గర అభిముఖ్యమును జెప్పుచు

అభిముఖ్యే: మాతర మనుధావతి వత్సః' అని 'అను' 'అభి' సమానార్థకములుగా (కొన్ని యర్థములు మినహాయించి) చెప్పియు,

'అభినివిశతే సన్మార్గం' **Follows a good path**

అని యుదాహరణ మిచ్చియును,

‘అభిపూర్వం’ **One after another successively** అనియు వ్రాసియున్నది

ఈ నిఘంటువు ప్రమాణ మైనచో అభికి వెంట అనునర్థము మిక్కిలితప్పు గాగలదా? లేక ఆనిఘంటువే ప్రమాణము గాదా?

అడరు = పడు—

"అట్లు వచ్చు నా గద గొని యచటియోధు
లలికి తమతమమీాదన యడరు నని యుఁ
దలఁచి యొదిగిరి రారాజుఁ దలఁపరైరి"
(భీ3-౫౮)

ఇచటి ‘అడరు’నకు ‘పడు’ అని యర్థముగదా! ఈ యర్థము సూ - ఆం - ని - లో లేదు అను నాయాక్షేపణకు శాస్త్రిగారు ప్రత్యుత్తరమే యీయరైరి. ఏ మాత్ర మవకాశమున్నను విజృంభించెడి వారే గాని యిం దవకాశము చిక్కలేదు గాబోలు చల్లగ జాఱవిడిచినారు. ఈ యొక్క యర్థమైన సరియైన దీయని యంగీకరింపకున్న మానె ఊరకున్నందులకు ధన్యుడనే.

శాస్త్రిగారు "ఇట్టి స్వల్పవిషయములనుగూడ గమనింపక వీరి మిత్రులు మహాభారతమునకు నిఘంటువును వ్రాయుటయును" అని విసరివ్రేటు: మా మిత్రులకేగాదు; అట్టే పండితునికికూడ దగులుచున్నది. అట్టే గారికి లేని నిఘంటు రచనాధికారము శాస్త్రిగారి దృష్టిలో నామిత్రులకు — దారు రచియించిన నిఘంటువు అసమగ్ర మని విమర్శించిన — నామిత్రుల కెట్లుండగలదు? కానిందు; దీనికేమి? శాస్త్రిగారు తమ పరామర్శవ్యాసములో నొకవాక్యమును తమయుదారతను ప్రకటించుచు వ్రాసినారు.

"సరియగు శబ్దములు నిఘంటువులో వదలిపెట్టబడినచో వట్టివాని నెవరు చూపినను కృతజ్ఞతాపూర్వకముగా సూర్యరాయాంధ్రనిఘంటువువారు గ్రహింతురు"అని, శాస్త్రిగా రాంధ్రపండితలోకమున కీవిజ్ఞప్తిని ప్రకటించి వారు తెలిపినమాటలను స్వీకరింపరా?

ఈ చర్చలవలన సూ - ఆం - ని. సమగ్రమో, అసమగ్రమో పాఠకలోకము నిర్ణయించుకొనును. ఆంధ్రభాషాసర్వస్వ మనదగిన సమగ్రనిఘంటువు కావలయు ననుకొను ఆంధ్రుల యభిలాష యీ నిఘంటువుచే సఫల మగుచున్నదా? ఆంధ్రభాషాభిమానులకు గావలసిన శబ్దచరిత్రార్థాదులు ఇది సంపూర్ణముగా తెలుపుచున్నదా? దీనికంటె సమగ్రమగు నిఘంటువును రచియించుట అనవసరము, అసంభవము అని తలంచి సంతృప్తి చెందుచున్నారా? ఆంధ్రు లీవిషయమున తమ యభిప్రాయములను స్పష్టముగ ప్రకటింతురుగాక! నిఘంటు వాంధ్రులెల్లరిది. కాని పరిషత్తువారిది మాత్రమే గాదు. దాని లాభాలాభములతో ఆంధ్రుల కెల్లరకు సంబంధముగలదు. ఈ తలంపుతోడనే నిఘంటువుమీాద నా యభిప్రాయము వెల్లడించిన యీ నాసాహసము క్షంతవ్యము కాకపోదు.



# వింత నిఘంటువులు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

౧

ఆలజాలంబు నీటిలో నాడుచూడ
గాలిపడగ యాకసమునఁ గ్రాలుత్రోవ
నిదురలోపలఁ గలఁడోచు నీడవిధము
గానవచ్చునె యప్పుడు కన్నఁగాక!

కలలోఁ గన్న పురుషుని, నా చూచినప్పుడు గుర్తింపవలసినదే కాని పిదప మరలఁ గానవగునా యని యుషతోఁ జిత్రరేఖ యను సందర్భమున, ఉత్తరహరివంశమునఁ బంచమాశ్వాసమునఁ బైపద్య మున్నది. ఇందు 'ఆలజాలము' అన్న పదమున కర్థము గావలెను. ఈపదము తెలుఁగున నాకన్యత్ర కానరాలేదు. సంస్కృతమునఁ గాదంబరిలో రెండుచోట్లఁ గానవచ్చినది.

౧. యేషాంచ క్షుద్రాణాం ప్రజ్ఞా పరాభిసంధానాయ న జ్ఞానాయ శ్రుత మాలజాలాయ—
౨. ఇత్యేతాని చాన్యాని చాలజాలాని దుర్జ్ఞేయత గృహీతా చిన్తయన్తీ జాగ్రత్యేవాతిష్ఠమ్.

ఇందు తొలివాక్యమున 'ఆలజాల'పదమునకు ముద్రితవ్యాఖ్యలో టీక లేదు. రెండవ వాక్యమున, ఆలజాలాని = స్వప్నాంతర్గత ప్రాయాణి అని యర్థ మున్నది. సంస్కృతమున నింక నితరత్ర నాకీ పదము గానరాలేదు.

కన్నడమున పంపభారతమున 'బాణజాలమదుభోంకనె నోడు పు డాళజాల మాయ్తెనె కడిదాట్టి" ౧౨–౬౮.

అని యున్నది. పై కర్ణాటకప్రయోగమున, ఆలజాలపదమునకు, ఛిన్నభిన్న మయినది, మాయమయినది అన్న యర్థము పొసఁగును. కాదంబరీ ప్రయోగములకు పలవరింత, చీకాకు అన్న రీతి నర్థము పొసఁగును. తెలుఁగుప్రయోగమున కీయర్థములు పొందుపడవు. ఔపచారికముగాఁ నేదో యర్థము పైప్రయోగముల కనుగుణముగాఁ గుదుర్చుకొనవలెను. కాని, వృద్ధానుశ్రుతిలో 'ఆలజాలం మీనపదమ్' అని నిఘంటువాక్య మున్నది. ఈ వాక్య మే నిఘంటువులోనిదో యెఱుఁగరాదు. నా చూచినంతవఱకు నేసంస్కృత నిఘంటువునను గానరాలేదు. ఇది నాచన సోమన పద్యమునకై యే పుట్టిన నిఘంటువేమో యనిపించుచున్నది. ఈ నిఘంటువుప్రకారమునఁ జూడఁగాఁ బద్యమునకుఁ జక్కనియర్థము పొసఁగును. నీటిలో చేప యడుగు నడచుజాడ, ఆకసమున గాలిపడగ యాడుత్రోవ ఇత్యాదిగా సుందరమయిన యర్థసంగతి యేర్పడును.

ఔదుంబరాణి పుష్పాణి శ్వేతః కాకశ్చ దృశ్యతే,
మత్స్యపాదో జలే దృశ్యః నారీచిత్తం నదృశ్యతే.

అని శ్లోక మొకటిగూడ ఆలజాలమునకు మీనపదార్థమును బలపఱచునది గలదు.

ఇట్టి వింతనిఘంటువులు మఱికొన్ని గలవు.

## ౨

అర్జునస్య ఇమే బాణాః నేమే బాణాః శిఖండినః,
కృన్తన్తి మమ గాత్రాణి మాఘమాసే గవామివ.
—భీష్మ, ౧౨౦-౬౪

మహాభారతము భీష్మపర్వమున నీ శ్లోక మున్నది. తిక్కన సోమయాజులవారు దీని నీ క్రిందివిధమునఁ దెలిఁగించిరి.

"అశనికల్పము లివి యర్జునబాణముల్
గాని శిఖండివి గావు సుమ్మ
కర్కటి గర్భంబు కరణి గాత్రము వ్రచ్చె
నిట్టివి వానికి నెందుఁ గలవు."

'మాఘమాసే గవా మివ' అన్నదానికి, "కర్కటి గర్భంబు కరణి" తెలుఁగుసేఁత. ఈ తెలుఁగుసేఁత కనుగుణముగా నొక వింత నిఘంటువు గలదు. 'మాఘమా కర్కటీ ప్రోక్తా తదపత్యంతు సేగవా.' ఈ నిఘంటు వెక్కడిదో యెఱుఁగరాదు. కాని తిక్కన నాఁటికే యిది కలదో తిక్కన తెలిఁగింపును బట్టి పుట్టినదో యెఱుఁగరాదు. 'మాఘ మాసే గవామివ' అన్న చరణమునకు సరళరీతిని 'మాఘమాసే-గవామ్-ఇవ' అన్న పదవిభాగమే తోఁచును. 'మాఘ మా-సేగవామ్' అన్నది కుటిలరీతి. మాఘ మా-అకారాంత స్త్రీలింగము గాఁబోలును. ఈ పైశ్లోకార్థము నీనిఘంటువును, నీ నిఘంటు వున కీ శ్లోకమును నాశ్రయములు. సాతవాహన సప్తశతిలో మాఘమాసే-గవామివ అన్న పదవిభాగమున కనుగుణ మనఁదగినది గాథ యొకటి కలదు.

వికిణఇ మాహమాస
మ్మి పామరో పాఇడిం వఇల్లేణ
ణిద్ధూమ ముమ్మురవ్వి అ
సామలియథణో పడిచ్ఛన్తో.

దీనికి శ్రీనాథుని తెలిఁగింపు.

మాఘమాసంబు పులివలె మలయుచుండఁ
బచ్చడం బమ్మెకొన్నాఁడు పణములకును
(పసరమునకు)
మదితచన్నులు పొగలేని మురుమురములు
చలికి నోరగోయ కేలుండు సైరికుండు.
—క్రీడాభిరామము.

ఇందు మాఘమాసమున గోవులు తక్కువ ధరలకును, పచ్చడములు హెచ్చు ధరలకు నమ్మకమునకు వచ్చుట చెప్పఁబడినది. మాఘమాసమున గోవుల ధరలు పడిపోవుట చలికాలమున వానికి వ్యాధ్యాదిబాధ లుండుటచేఁ గాఁబోలును. భారతకాలమునుండి రెండువేలేండ్ల క్రిందటినాఁటిదాక మాఘ మాసము నేటి ధనుర్మాసము వలె శైత్యాధిక్యము గలది గాఁబోలును.

## 3

పురాణములలో కలికాలవర్ణన ఘట్టమున నీ శ్లోక ముండును.

అట్టశూలా జనపదా శ్శివశూలా శ్చతుష్పథాః,
ప్రమదాః కేశశూలిన్యో భవిష్యంతి కలౌయుగే.

ఈ శ్లోకమున కర్థ మెఱుఁగ రాదు. 'అట్ట శూలంబుల యగును దేశములెల్ల' అన్నరీతిని దెలిఁగింపవలసిన దే. నేఁటి కైదువందల యేండ్ల ప్రాఁతకాలమునాఁటి దగు ప్రసంగ రత్నావళిలో నీ పురాణశ్లోకమున కీ క్రింది నిఘంటువునుబట్టి యర్థము చెప్పఁబడినది.

అట్టమన్న మితిప్రోక్తం బ్రాహ్మణశ్చ చతుష్పథః,
కేశోయోని శ్శివోవేదః శూలోవిక్రయ ఉచ్యతే.

౪

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి.

ఈశ్లోకము నిత్యే యాపామరపండితము పఠింతురు. 'రఘుకులాన్వయ రత్నదీపం' అనుట కర్థము పొసఁగదు. ఈ క్రింది వింత నిఘంటువు పొసఁగించును.

అన్వయస్తు సముద్రస్స్యాత్ - రత్నదీపశ్చచంద్రమాః.

౫

గ్రంథగ్రంథిం తదాచక్రేముని ర్గూఢం కుతూహలాత్
యస్మిన్ ప్రతిజ్ఞయా ప్రాహ మునిర్ద్వైపాయన స్త్విదమ్
అష్టౌ శ్లోకసహస్రాణి హ్యష్టౌ శ్లోకశతానిచ,
అహం వేద్మి శుకో వేత్తి సంజయో వేత్తి వానవా.
తచ్ఛ్లోక కూటమద్యాపి గ్రథితం సుదృఢం మునే
భేత్తుం నశక్యతేఽర్థస్య గూఢత్వా త్ప్రశ్రితస్యచ.

—భా. ఆ. అనుక్రమణికాధ్యాయం

'సంజయో వేత్తి వానవా' యనుచోట, సరసార్థసంధాయకముగా నొక వింతనిఘంటువు గలదు. "వానవా దీర్ఘదర్శీస్యాత్" అని యది.

౬

యస్యస్తౌతి మతిం మనీషి సదసి శ్రీనీలకంఠాధ్వరీ
కౌండాజ్జ్యోతిషికళ్ళయస్యకురుతే సమ్మానమార్యశ్శ్వనమ్
యత్రానుగ్రహ దృష్టి మర్పయతి చ శ్రీబాల కృష్ణోగురుః
సోయం దీవ్యతి చొక్కనాథమఖినామక్రీతదాసః కవిః

"అక్రీతదాసోజామాతా" అనివింతనిఘంటువు. రామభద్రదీక్షితుఁడు చొక్కనాథ మఖికి అల్లుఁడే - కాని యీ నిఘంటు వెక్కడిదో ?

ఆప్టే రచించిన సంస్కృతాంగ్ల నిఘంటువులో పైనిచెప్పిన శబ్దముల అర్థవిచార మెట్లున్నదో చూడగా ఈ వింత నిఘంటువులలో చెప్పిన అర్థములు కొన్ని ఆప్టే సంగ్రహించి నట్లున్నది: అలః - లం = **Spawn** ; జాలం = **Collection** ; మాఘమా = **a female crab** ; అట్టం = **food, boiled rice** ; అట్టశూలా జనపదాః **Mb.** (అట్టం అన్నం శూలం విక్రేయం యేషాంతే **Nilakantha**).

అన్వయః అంటే సముద్రమని లేదుగాని **race, lineage, posterity** అనే అర్థములున్నవి ; రత్నదీపః అంటే చంద్రుడని లేదుగాని **a jewel-lamp ; a gem serving as a lamp** అని ఉన్నది. ఏ అర్థంగైకొన్నా "రఘుకులాన్వయ రత్నదీపమ్" అనుట కర్థము పొసగుచున్నది.

అక్రీత దాసోజామాతా అని నిఘంటువులో చెప్పినది ఔపచారికంగా వరవిక్రయంలేని కాలంలో ఇల్లరికముంజీ అల్లుళ్లగురించి చెప్పదగినదిగా ఉన్నది.

—సీతాపతి.

---




## మనవి

బాలబాలికల కానందముగా
బాల హృదయములు విరియునట్లుగా
బాలచిత్తములు చిగురుచ్చునట్లుగ
పాటలు పాడండో కవులారా!

ఆలమందలను ఆకర్షించే
బాలకృష్ణ మురళీ నాదమువలె
బాలబాలికల నాకర్షించే
పాటలు పాడండో కవులారా!

పిల్లల ఊహాలు ప్రబలేరీతిని
పిల్లల మదిలో నిలిచే విధమున
పిల్లల కనువగు నీతులు చూపే
పిట్టకథలు రచియించండయ్యా!

ఎచ్చరికలతో ఊఁ.ఊఁ. అంటూ
ముచ్చటపడి విన వచ్చేపిల్లల
కచ్చెరువును కల్గిస్తూ అందరు
మెచ్చేకథలను చెప్పండయ్యా!

## బాలిక—చిలుక

బా: ఎండలో ఎక్కడికి ఎగిరిపోయెదవు?
ఉండవే మాయింట ఓముద్దుచిలుక!
చి: రెక్కలాడించుతూ రివ్వుమని మింట
చక్కగా ఎగురుదును; చల్లగా నుండు.
బా: సొంపైన మందిరము; చూడు మా ఇల్లు;
పెంపుడు చిలుకవై పెరుగు మా యింట.
చి: మేడమిద్దెలుకన్న మేలు మాబయలు;
తోడి చిలుకలజట్టు వీడి రాలేను.
బా: అందమగు పంజరము ఉంది మాయింట;
అందులో నివసించి హాయిగా ఉండు.
చి: న్యాయమా? స్వేచ్ఛతో నన్నుండనీక
చేయించితివి నాకు చెరసాల యొకటి!
బా: బంగారు కడియాలు బంగారు గొలుసు
సింగారముగ నీకు చేయింతు చిలుక!
చి: దొంగనా మీయింట? దోచినా? నన్ను
బంగారుసంకెళ్ల బంధింప నేల?
బా: మేడపై గదిలోని మేటిచిత్రాలు
చూడవే; ఒకసారి చూచిపోరాదె?
చి: మా యడవిచిత్రాలు మీయింటగలవె?
మాయచిత్రాలుగా మీయింటివెల్ల.
బా: చిలుకమ్మ! ప్రతిదినము చెప్పెదను చదువు;
పలికింతు నీచేత తెలుగుపల్కులను.
చి: మాజాతిభాష నే మరచిపోనేల?
నీజాతిభాష నే నేర్చుకోనేల?
బా: ఆరముగ్గినపండ్లు అట్టె యుంచాను;
ఆరగింతువు రావె ఓ రామచిలుక.
చి: మంచిపండ్లెన్నైన మాయడవి గలవు;
ఎంచుకొని తినగలను; ఎందు కీపండ్లు?

# పుస్తకసమీక్ష

## శ్రీ రమణలీల

ఇది రమణమహర్షి షష్టిపూర్త్యుత్సవోపహారము. రచయిత: శ్రీ శ్రీ కృష్ణకౌండిన్యులు ప్రచురణకర్త: శ్రీ శ్రీ నిరంజనానందస్వాములు, సర్వాధికారులు శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామలై. రు ౧/౮ లు.

కర్మయోగము ననుష్ఠించి పరార్థజీవులై మెలగువారు మానవులందు శ్రేష్ఠులు" అని గేటేమహాకవి పలికిననాటనుండి అధునాతన భావప్రపంచమున నొక యపూర్వమైన సంచలనము ఉదయించినది. లోకమాన్యుని గీతాభాష్యమందును, రవీంద్రుని గీతాంజలియందును టాల్‌స్టాయి గాంధిప్రభృతుల జీవితవిధానములందును పూర్వోక్తభావము విశేష ప్రాముఖ్యమును పడసినది.

ఒరుల ఆర్థిక రాజకీయోన్నతికై నడుముగట్టువారు మాత్రమే పరార్థజీవులు కారు. మానవుల వైజ్ఞానికోన్నతికొఱకును, ఆధ్యాత్మిక నైతిక ప్రాభవముకొఱకును పాటుపడువారును పరార్థజీవులే! వీరు స్థాన స్థానములందును మసలి వచఃకౌశలమును ప్రదర్శింప నక్కఱలేదు. ఏకడనున్నను, భాస్వదాత్మసందీప్తములైన వీరి జీవితములు అసంఖ్యాకుల దృష్టి నాకర్షించును. వీరి మనికిపట్టులనుండి భాగీరథివోలె భావనిచయము భువనప్రకరములందు వెలివిరియుచుండును. పురవీథులందును, పణ్యాంగణములందును మసలిరి కారని తొల్లింటి మునిముఖ్యులు అడవులందు స్వాంతముక్తికై దేవులాడిన స్వార్థపరులని తలపఁజెల్లదు. ప్రాచీనవైజ్ఞానిక విభూతియంతయు వనములందే యుదయించినది. స్వర్గమర్త్యభూములకు రహదారులు వనములందే, మున్యాశ్రమ పరిసర ప్రదేశములందే యేర్పడినవి; మానవోద్ధరణమునకు తోడుపడిన శక్తులందే వృద్ధినందినవి. ఆశ్రమములందు నుదయించిన భావములు సర్వకాలములందును, సమస్త సీమలందును, అస్తమయ మెఱుఁగని మయూఖములట్లు వెలు

గొందుచునే యుండును. వాక్కులనుండియే కాక దివ్యానుభూతి నందిన మహాత్ముల మౌనమునుండి కూడ మ్రుచ్చులను ముముక్షువులఁ జేయజాలు శక్తి ఉదయించును.

ప్రస్తుత గ్రంథమును పఠించుతఱి పాఠకుల మానసములం దీయంశములు తప్పక తలసూపితీరును. అరుణాచలవాసియైన మహాత్ముని జీవితము వ్యక్తిగత ముక్తికిని, సంఘముక్తికిని మార్గదర్శకము కాజాలునని పఠకులు గ్రహింపక మానరు.

క్రమతపస్సుకతన అద్భుతమైన ఆంతరంగికపరిణతినంది, అనల్పమైన ఆధ్యాత్మికశక్తిని పడసిన మహాత్ముడు శ్రీ రమణమహర్షి. మానవమాని సౌందర్యసౌరభ మాధుర్యములను ప్రకృతిరమ మానవులకు ప్రసాదించునట్లు మౌనముద్ర వహించియే శ్రీ రమణయోగీంద్రుడు సచ్చిదానందములను వెలారించుచుండును. సన్నిహితులైన భక్తులు ఆంతరంగికముగ వానియం దోలలాడుచుందురు. ఈ విషయమును దృష్టాంతీకరించు సంఘటనము లెన్నియో ప్రస్తుతగ్రంథమున నుల్లేఖింపబడినవి. గ్రంథకర్తగారి వచనములను పరికింపుడు; "స్వామి జీవితమే అనుకరణీయమై యుండఁగా నా సన్నిధియే జ్ఞానోత్తేజకమగుచుండఁగా నింద్రియనిగ్రహాదులు తమంతటనే లభించుచున్నవి." (పుట ౪౫౧). "ఇంట ధ్యానము సాగకున్నను, ఏకాంత ప్రదేశములందును సాధ్యము కాకున్నను, మహర్షి సన్నిధానమున సులభముగ, శాంతి ప్రసన్నతలు గలిగి సమాధి లబ్ధమగునట్లు కొన్ని పర్యాయము లంతర్ముఖదృష్టి యుపలబ్ధమగుచున్నదనియు నదియే స్వామి తమయందు జూపు ననుగ్రహమనియు ఎందఱో శిష్యులు నుడివియున్నారు." (పుట ౪౪౬)

బాల్యమున స్వస్థలమునుండి తరలి, అరుణాచలమును జేరి తపమున బద్ధదీక్షితుడై, దీక్షావిజయము నంది శ్రీ రమణ మునీంద్రుడు నేడు ప్రపంచదృష్టి నెట్లాకర్షించెనో శ్రీ కృష్ణకౌండిన్యులు విపులముగా దెలిపిరి.

ణావు మెట్లు గోచరించినదో వివరించిరి. ఋషీంద్రుని యజ్ఞముల దృష్టాంతము కతన నాతోర్వన్నతినందిన ప్రాచీ ప్రతీచీ భక్తులను గురించిన వృత్తాంతమును, ఆశ్రమ మహాత్త్వమును గురించిన ఉదంతమును గ్రంథమున నొప్పుచున్నవి. సన్నిహిత విషయ కథనముతో తృప్తి నందక భావసామ్యముగల ఆధ్యాత్మి కాంశముల నెన్నింటినో గ్రంథకర్తగారు తెలిపిరి. తత్త్వశాస్త్ర మతశాస్త్రములందును, సాహిత్యమందును, వీరందిన పాండితి అనల్పమైనదని గ్రంథము వేనోళుల చాటుచున్నది. వీరి గద్యము నిర్దుష్టమై హృద్యమైయున్నది. ముముక్షువులందఱునీ పవిత్రగ్రంథమును పఠింతురుగాక!

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

---

## సంస్కృత న్యాయములు

వ్యాఖ్యాతలు: శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగార్లు. లక్ష్మీ గ్రంథ మండలి, తెనాలి. వెల రూ ౨-౮-౦.

ఈ గ్రంథమునందు సంస్కృత న్యాయములను అకారాద్యక్షర క్రమముగా గూర్చి వానికి కొంచెము వ్యాఖ్యానముగూడ రచించియున్నారు. మొదటి భాగమునందు వైదిక లౌకిక న్యాయములును, రెండవ భాగమునందు లోకోక్తులును, వేదాంత వ్యాకరణాది పరిభాషలనుండి వెలువడి తద్రూపమునసే యుండు న్యాయములును నీయబడినవి. కొన్ని న్యాయములకు వానికి సంబంధించిన కథలనుగూడ ప్రకటించినారు. ఆ న్యాయమువలన వాకథ స్ఫురించకున్నచో అర్థమేమియు నుండదు. (ఉదా. భైరవ విప్రన్యాయము, భర్చున్యాయము). వీటిలో కొన్నిటిని మనము వ్యవహారములో సాధారణముగా నుపయోగించుచున్నాము. (ఉదా. పిష్టపేషణన్యాయము, కాకతాళీయన్యాయము, పయోముఖవిషకుంభ న్యాయము మొ.) కొన్నిటిని పూర్వకవులు గ్రంథములలో వాడియున్నారు. కొన్ని న్యాయముల క్రింద పూర్వకవికృతములగు పద్యము లుదాహరింపబడినవి కాని ఈయుదాహరణముల సంఖ్య చాల తక్కువగా నున్నది. మనుచరిత్ర, హరిశ్చంద్రోపాఖ్యానము మొదలగు గ్రంథములలో నీలోకోక్తు లధికముగా నున్నవి. వాటినన్నిటిని ఈ పుస్తకమునందాయాచోట్ల నుదాహరించినచో బాగుగా నుండును. ఒకేయర్థము గల న్యాయములకు ప్రత్యేక వివరణ మనవసరము, ఒకచోట మాత్రము వివరించిన చాలును. (ఉదా: అంధకూపన్యాయము, అంధపరంపరా న్యాయము) అర్థము తెలిసి లోకోక్తుల నుపయోగించుటకును, తెలియనివాటి కర్థము తెలిసికొనుటకును విద్యార్థుల కీపుస్తకము బాగుగా నుపయోగపడగలదు. ప్రతి గ్రంథాలయములో నీ పుస్తకముండితీరవలెను. గ్రంథకర్త లీ విధముగానే తెనుగు సామెతలను పండితసహాయముతో సోదాహరణముగా ప్రకటించి భాషాసేవ చేయుదురని నమ్ముచున్నాను.

వెంపటి శ్రీనివాసమూర్తి

---

## సమీక్ష

రచయిత : శ్రీ విద్వాన్ విశ్వంగారు. ప్రకాశకులు : నవ్యసాహిత్యమాలవారు. అనంతపురం. వెల రు ౦-౧౦-౦ లు.

శ్రీయుత విద్వాన్ విశ్వం, టి. నాగిరెడ్డిగార్ల సంపాదకత్వమున వెలువడుచున్న నవ్యసాహిత్యమాలా గ్రంథములలో ఇది ఎనిమిదవగ్రంథము. విశ్వంగారి హృదయావేదనాగ్ని నుండి వెలువడుచున్న రచనాగ్నికణములలో ఇది ఒకటి. భారతదేశపురోభివృద్ధికిగాను కొందరు ప్రాచీనపద్ధతు లవలంబించాలనీ మరికొందరు సమూలంగా మార్చునంది ఆధునిక నాగరికతావిధానములనే స్వీకరించాలనీ వ్రాస్తూవుండడం పత్రికాపాఠకులలో చాలామందికి తెలిసేవుంది. ఈ గ్రంథము రెండవమార్గానికే ప్రోత్సాహమిస్తూవుంది. గ్రంథమందలి వ్యాసాలు వేరువేరుగా వున్నప్పటికీ మొత్తం మీద అన్నింటికీ ఒక లంకెవుంది. సాంఘిక, ధార్మిక, రాజకీయ, నైతికవిషయాలలో ప్రస్తుతకాలానికి తగినట్లుగా నూతనపద్ధతులనే అవలంబించి తీరాలనీ అన్యదా దేశవిముక్తి ఆకాశపుష్పమనీ రచయిత మంచి బిగువైన శైలిలో తన హృదయోద్గారాలను వెలువరించియున్నాడు. ఆంధ్రు లందరూ పఠింపవలసిన గ్రంథము.

## తెనుఁగు తల్లి - పోతన సంచిక

ఇది (హైదరాబాద) భాగ్యనగరమున వెలువడుచున్న మాస పత్రికయొక్క ప్రత్యేక సంచిక. పత్రికాసంపాదకురాలు శ్రీమతి రాచమల్ల సత్యవతీదేవిగారు. సాధారణముగా ఈ పత్రికకు సంవత్సరము చందా ౧-౮-౦. విడి సంచిక వెల ౦-౩-౦. గాని ఈప్రత్యేకసంచిక వెల ౦-౮-౦. ఇది మాకు విమర్శనార్థము పంపించినారు.

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో ౧౪-౨-౪౦ మొదలుకొని ౨౩-౨-౪౦ వరకును జరిగిన పోతనవర్ధంతి - సారస్వత వార మహోత్సవములకు అనుబంధముగా ఈప్రత్యేకసంచిక ప్రకటితమైనది. ప్రతిమాసము ౪౦ పుటలతో వెలువడుచున్న తెలుఁగుతల్లి ఈసారి ౧౪౦ పుటలతో వెలువడినది. ఇందులో పోతనవర్ధంతియందు చదివిన ఉపన్యాసములేకాక మరికొన్ని వ్యాసములుకూడను కలవు.

ముఖపత్రమునందు పోతనామాత్యుని చిత్రము ముద్రితమైనది. ఇది పోతనవర్ధంతి మొదటిదినమున బహిర్గతమైన తైలవర్ణచిత్రమునకు ప్రతి. దీనిని చిత్రించినవారు శ్రీదశిక సుబ్బరాయశర్మగారు. "భాగవతావతారికయందు పోతనామాత్యుడు చేసిన వర్ణనమును ఆధారముగా గొని గోదావరీతీరమందు మహనీయ మంజుల పులినతట మంటపమధ్యంబున ఆతడు కించిదున్మీలిత నేత్రుడై మహేశ్వరధ్యాన తత్పరుడుగా ఉండడం, అంతట 'మెఱుఁగు చెంగటనున్న మేఘంబుకైవడి' అనే పద్యంలో వర్ణించినట్లు శ్రీరామచంద్రమూర్తి ప్రత్యక్షం కావడమూ కించిదవశిష్ట చంద్రబింబమూ, స్నానాలరేవు - ఈసన్నివేశాన్ని శర్మగారు మిక్కిలి విజ్ఞానంతో చిత్రించా"రనిన్ని "ఆ సమున్నతఫాలరేఖ, అరమోడ్పు కన్నులూ, నాతికార్శ్యము నొందినతనువూ, ఆ శాంతగంభీర భావమూ చూసి ప్రేక్షకు లంతా పోతనగారే ప్రత్యక్షమయ్యారని తలంచారు." అనిన్ని ఈసంచికలో సీం

మొదటి మూడుదినములును జరిగిన పోతన వర్ధంతి సభలకు అధ్యక్షులయిన శ్రీ. డా. చిలుకూరి నారాయణరావుగారు "సుకవి!"యని పోతనగారిని గురించి రచించిన పద్యములతోను, వారి అధ్యక్షోపన్యాసముతోను ఈసంచిక ప్రారంభించినది. ఆపద్యములలో వారు "భుక్తిలో సుఖమున్నదో మరి ముక్తిలో సుఖమున్నదో ఆభుక్తిముక్తుల తారతమ్యము వ్యక్తపఱచితివి" అని పోతన పేదయయినా ధనమును కాంక్షించక ముక్తికోసమే భాగవతమును రచించినాడన్న సూచన వ్యక్తపఱచినారు. "కృష్ణ నిర్యాణము వలన అర్జునునకు కలిగిన నిర్వేదవర్ణనము గాని, భీష్ముడు చేసిన శ్రీకృష్ణస్తుతిగాని పోతన్న బుద్ధికి భారతములో చప్పబడినట్లు కానవచ్చినవి. వాటిని విస్తరించి చెప్పడములో పోతన తిక్కన్నను మించిపోయినాడు భాగవత ప్రథమస్కంధ మంతా తుదకు చప్పబడిపోయిన భారతకథను జీవింపజేయడానికి పుట్టినదా అనిపిస్తుం"దని ఉపన్యాసమం దన్నారు. కృష్ణుడు జారుడు కాడని చెప్పుతూ "మునిభార్యలు కృష్ణుని మీద మోహముతో ఆహారములు కొనివచ్చునప్పుడు 'అంగనలార! నా దేహసంగంబు నరులకెల్ల సౌఖ్యానురాగ సంజనకంబు గాదు; ముక్తి ప్రదాయకము' అని కృష్ణు డన్నమాటలు భాగవతమునుండి ఎత్తి చూపించినారు; "తను హృద్భాషల సఖ్యముఁ...అను నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ముఁ హరిన్నమ్మి సజ్జనుడైయుండుట భద్ర మంచు దలఁతుఁ సత్యంబు దైత్యోత్తమా" అని ప్రహ్లాదుని నోట పలికించినదే పోతన ఉపదేశించిన తత్త్వ" మని తెలియజేసినారు; "విశిష్టాద్వైత పరముగా చేయబడిన తత్త్వోపదేశము లను భాగవతములోని ప్రతిస్కంధమునుంచిన్నీ ఉదాహరింతు"నన్నారు; పోతన రచనలో తొంటి లాక్షణికసూత్రములకు విరుద్ధముగా ఉండే ప్రయోగముల నిరసించేవారికి ప్రత్యుత్తరముగా "రసవాహిని అయిన పోతనకవిత్వములో దోషములు పట్టనెంచే వాడు చెరకును చేతితో పట్టుకొని దానివేళ్లను నములనారంభించే మూఢునివంటివా డని వేరే చెప్పవలెనా?" అన్నారు. వీరి ఉపన్యాసమంతా చదివి తీర

ము"ను గురించి రచించినపద్యములందు "మూఁడుకోట్ల యాంధ్రపుత్రుల కంఠానఁ బ్రాణ ముండ, నాంధ్ర భాగవతము ఆంధ్రదేశమందు నజరామరంబుగా నలరఁగలదు పోతనాగ్రగణ్య" అని ధైర్యముగా చెప్పినారు.

శ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారు పోతనకాలపు చరిత్ర చక్కగానే ఉన్నదిగాని సింహావలోకనములో చెప్పినట్లు "ఆచారిత్రక టీకుమీద కొంతహాస్యరసం పారబోసి తడప వలసింది. లేకపోతే ఆచుక్కలో శ్రోతలమైన మాగతేమిటో!" అనిపించిఉంటుంది. ఈ చరిత్రకును పోతనగారి జీవితమునకును గల సంబంధము సూచింపగలిగితే పాఠకులకు కొంత మేలుగా ఉండును.

శ్రీరాయప్రోలు సుబ్బారావుగారు పోతన కవిత్వమునుగూర్చి రచించిన వ్యాసము కవి హృదయము కవికే తెలుస్తుం దన్నమాటకు నిదర్శనంగా ఉంది. "కాంతా సమ్మితంగా ఉంటేనే కాని కావ్యం రాణించదు గదా; జ్ఞానులకు వేదాంతులకు కాంత అంటే క్రూరభూతంగా స్ఫురిస్తుంది గదా; ఏమి సాధనము? అనే చిక్కును శ్రీపోతనగారి భాగవతము పరిహరించింది"—అన్నారు సుబ్బారావుగారు. భక్తికి అనువిద్ధమయిన "మధుర భావం ప్రకాశింపజేసినందువల్లనే కృష్ణావతారం హిందూమత కల్పవృక్షానికి బీజమేదైనా ఏకతత్ శాఖా శిఖాలంకారమైన పుష్పంగా పరిణమించింది" అనిన్ని "ఈ అవతారంలో రసోపస్కారములకు సంగీత నాట్య కాంతా సాహచర్యములు సాంద్రంగా లీనమైన కారణంచేత భాగవతం కావ్యంగా రూపొందింది; శ్రావ్యంగా వినడానికి, దృశ్యంగా అభినయించడానికి, భావ్యంగా పారాయణ చేయడానికి యోగ్యమైంది." అనిన్నీ పోతనగారి భాగవత కావ్య స్వరూపం తెలియజేశారు; పోతనగారి కవిత్వము వరదబోవు మహాప్రవాహమువలె స్ఫురిస్తుందని వారి కవితా ప్రవాహాన్ని చిత్రంగా వర్ణించారు. పెద్దనార్యుని ఉత్పలమాలవలె పోతనామాత్యుని గంగావతరణంకూడా స్వీయరచనా విధానాన్ని సూచిస్తుం దని నాభావము" అన్నారు.

వారు "పోతనసత్కవీ!" యని రచించిన పద్యములు కడు హృద్యముగా ఉన్నవి. శ్రీ అచ్యుతుని వేంకటాచలపతిరావుగారు "శ్రీపోతనార్యప్రశంస" చేస్తూ రచించిన పద్యాలలో కొన్ని పోతనపద్యముల వరవడిని చక్కగా సాగినవి.

శ్రీతూములూరి శివరామకృష్ణమూర్తి శాస్త్రి గారు రచించిన "పోతనామాత్యుడు - భాగవతాంధ్రీకరణము" అనే వ్యాసము వారి విద్యావ్యాసంగ పరిశ్రమ ఫలమును తెలియజేస్తుంది. సంస్కృతభాషలో భాగవత మెంత ఉత్కృష్ట గ్రంథమని నిరూపింపబడినదో తెలుగున దాని పవిత్రత పోతనచేతులలో బడి అంత కినుమడించినది." అని పోతనగారి ఆంధ్రీకరణమందలి విశేషమును ప్రకటించినారు. అందుకు నిదర్శనంగా కొన్ని శ్లోకములున్ను పద్యాలున్ను సంస్కృతాంధ్రభాగవతములనుండి ఎత్తి చూపిస్తూ "సిరికిం జెప్పడు..." అనే పద్య ముదాహరించారు గాని, అందులో "పరివారంబును జీర డభ్రగపతిం మన్నింప"డన్నారు. "అభ్రగపతిం బన్నింప" డని ఉండవలెను. అచ్చుతప్పేమో అనుకొన్నాము గాని వారి వాఖ్యానంలో సైతము "సంస్కృత భాగవతములో విష్ణుడు గరుడవాహనముమీద వచ్చినాడు. పోతన్నగారి విష్ణుడు గరుడుని మన్నింపకుండ వచ్చినాడు" అన్నారు. రెండుచోట్లను అచ్చుతప్పే అనుకొంటాము.

విద్వాన్ శ్రీ. బి. శ్యామరాజుగారి "శ్రీపోతనామాత్యప్రశంస" యను పద్యాలలో "సుకవితా యశస్స్ఫూర్తి రాజ్యైన కిమ్మను సూక్తి కో నినువంటి ధన్యుడు గలండా పోతనార్యోత్తమా!" అన్నారు.

శ్రీ. బి. రంగనాథరావుగారు తమ "పోతన: వీరభద్రవిజయము" అనేవ్యాసంలో భాగవత వీరభద్రవిజయములందలి రచన, భక్తిరసము మొదలయినవి పరిపోల్చి తుదకు "పండిత పామరులనెల్లలో బరచుకొని వారి కభ్యుదయ మొనర్చుటలో శ్రీభాగవతమున కున్న మహత్తరశక్తి వీరభద్రవిజయములో నున్నదనుట సాహసమగును" అన్నారు. అసలు ఈవీరభద్రవిజయము వాస్తవముగా పోతనగారు రచించినదేనా అన్న విషయము చర్చింతురేమో అనుకొంటిమి.

ఈసంచికలో ఎక్కువగా మెచ్చుకోదగిన విషయము పలువురు సోదరీమణులు ఉత్సవములందు తోడ్పడుటే కాక ఈసంచికకు తమవ్యాసములు పంపినారు. వారిలో శ్రీమతి నేమాని భారతీరత్నాకరాంబగారు రచించిన 'భాగవతము-స్త్రీలు' దివ్యముగానున్నది. స్త్రీ పాత్రపోషణము ఎంతచక్కగా పోతనగారు చేసినారో వీరు చూపించినారు. కొన్ని విషయములు స్త్రీగనుక వీరికి తట్టినవిగాని పురుషులకు సాధారణముగా వెంటనే గోచరించవేమో! రుక్మిణి ప్రేమ సందేశము, శ్రీకృష్ణుడు రుక్మిని చంపుటకు చూచినప్పుడు రుక్మిణి చెప్పిన మాటలనేర్పు, రుక్మిణి నమ్రత మొదలయిన విషయముల గూర్చి ఈమె వ్రాసినదిచక్కగానున్నది. శ్రీ. టి. ప్రేమలతగారు రచించిన పోతన సందేశములో ఎత్తుకొన్న విషయములు గొప్పవే కాని ఏదిన్నీ నిండుగా చర్చించి వ్రాయలేదు. భారతీరత్నాకరాంబగారు రచించిన వ్యాసము చదివి, వీరు తమవ్యాసము విస్తరించి రచించిన రొండల బాగుండునని మాఅభిప్రాయము. "భక్త శిఖామణి పోతన" అనేవ్యాసంలో భాగవతమందలి కథలు గురించి వ్రాస్తూ శ్రీబూర్గుల అనంతలక్ష్మీదేవిగారు "ఈకథలు సంపూర్ణముగా చదివినచో వాటిలోని శృంగార వర్ణనలు పాఠకులకు ఏవగింపు కలిగింపక, వాటిలో విడదీయకుండా కలిసిపోయినటువంటి వైరాగ్య భక్తి భావములే ప్రబోధమునొందును" అని తెలియజేసినారు. శ్రీ. వి. జయలక్ష్మిగారు "అంజలి" పట్టి "పదలాలిత్యము సొంపున, మృదుపద సంఘటనమునను, మేలిమిరససంపద పెంపున పోతనకవి నెదురుకొనంగలరె సుకవు లేకాలమునక?" అని స్తుతించినారు.

ఇచ్చట స్థలము చాలనందున పోతనతో సంబంధములేని తక్కిన వ్యాసములగూర్చి వ్రాయలేదు.

ఈ"తెలుఁగుతల్లి"కి సంపాదకురాలైన శ్రీరాచమల్లి సత్యవతీదేవి ధన్యురాలు.

—సీతాపతి.

---

## భారతీయవైశ్య

౧౮-వ శతాబ్దపు ఉత్తరభాగం మొదలుకొని నేటివరకు అఖండాంధ్రదేశంలో గలిగిన వైశ్యాభివృద్ధిని తెలుసుకోవలెనంటే ఇంతకన్నా ఉత్తమమైన మింకొకటి దొరకదు. దీని సంపాదకునూ, వ్యవస్థాపకునూ శ్రీ అన్నవరపు సుబ్బారాయగుప్తగారు వ్రాసినలాగు ఇంకనూ తమజాతి ఎంతో అభ్యుదయం పొందవలసి వున్నప్పటికీ ఈనూరు నూటఏబది ఏండ్లలో గలిగిన వారియభ్యున్నతి నవలోకించి కేవలం వైశ్యులేకాదు తక్కిన వర్ణాలవారు కూడా సంతోషించవలసిందే. మొత్తంమీద నూరింటికి పైగా పద్య గద్య వ్యాసా లున్నాయి ఈ వైశ్యాభ్యుదయసంచికలో. కొలదిమాత్రం ఇతరులు వ్రాసినవి తప్ప తక్కినవన్నీ గుప్తపుంగవుల విన్యాసాలే. విద్యావిషయంలో ఇది తక్కువైన అభివృద్ధికాదు. ఈ విద్యావిషయంలోమాత్రమే కాక స్వసంఘాభివృద్ధికి గావలసిన సకలవిషయాలను గురించిన వ్యాసాలిందులో గలవు. ఇక చిత్రపటాలకు లెక్కలేదు. ఒక్కచోట గూర్చోని దేశమంతటా గల ప్రధాన వైశ్యనాయకులనూ, పేరెక్కిన స్త్రీ పురుషులనూ, కొందరు ధర్మాత్ములు స్థాపించిన సంస్థలనూ ఈపత్రికలోని చిత్రాలద్వారా చూడవచ్చు. చిట్టచివర సంధ్యావందనాది నిత్యకర్మానుష్ఠానాల గూర్చి, అఖండాంధ్రదేశంలోని ౧౦౨ గోత్రాలవైశ్య కుటుంబాలకు చెందిన ప్రవర, శాఖా, సూత్రాదులగూర్చి వివరములును గలవు. ఒక్కవైశ్యులేకాదు, ఆంధ్రులందరూ చూడదగిన దీపత్రిక.

---

## హిందూదేశచరిత్ర పత్రిక

(జర్నల్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ)—సంపుటం ౧౮ భాగం ౩ నం ౫౪ రు. డిసెంబరు ౧౯౩౯. సంవత్సరమునకు ౩ సార్లు వెలువడును.

ఇది విమర్శనార్థం క్రిందటిమాసం మా కార్యాలయానికి వచ్చినది. ఇందులో ౧౮౦౧ నుండి ౧౮౬౨ వరకును గల చెన్నపురి సూప్రీమ్‌కోర్టు జడ్జీలగురించి జె. సి. వైట్ గారున్నూ, శిల్పంతో విశదమగుబుద్ధజీవితం గురించి డాక్టర్ బి. సి. లా గారున్నూ, సిపాయీల పెద్ద పితూరీకిపూర్వము విద్యావిషయక పరిశ్రమాభివృద్ధిగురించి శ్రీ రామ్ నిహోర్ చతుర్వేదిగారున్నూ, ౧౭౫౭ లో బెంగాల్ మండలమందు జరిగిన విప్లవము గురించి ఆచార్య ఇ. ఎచ్. అహ్కారిగారున్నూ, ఈశ్వరప్రభుత్వమునకును నిరంకుశప్రభుత్వమునకునుగల వైషమ్యమునుగురించి డాక్టర్ మహమ్మద్ అజీజ్ అహ్మద్ గారున్నూ, ప్రతివాదిభయంకర మణ్ణానాచార్యుల

కృష్ణస్వామి అయ్యంగారున్ను రచించిన వ్యాసములు గలవు.

సంపాదకీయ వ్యాసమందు మైసూరు సంస్థాన రాజకీయ సంస్కారముల గురించిన్నీ, హిందూదేశ చరిత్రాధార గ్రంథసంరక్షక సంఘము గురించిన్నీ, హిందూదేశచరిత్ర మహాసభ (కాంగ్రెస్) గురించిన్నీ, "న్యూ ఇండియన్ ఆంటిక్వెరీ" అనే పత్రిక గురించిన్నీ, ప్రాచీన హిందూదేశ నాగరికత గూర్చి గ్రంథములు ప్రకటింపదలచిన చెన్నపురి అడియార్ గ్రంథాలయమువారి ఉద్యమము గురించిన్నీ రచితములైన విషయములు గలవు.

శిల్పంలో విశదమయిన బుద్ధజీవితంగురించి రచితమయిన వ్యాసంలో సాంచి, బుద్ధగయ మొదలయిన స్థలములతో పాటు ఆంధ్రదేశమందలి అమరావతి, నాగార్జునకొండ, గోలి మొదలయిన స్థలములందలి స్తూపములు మొదలయిన కట్టడములలోని శిల్పమునుండి సైతము గ్రహింపదగిన బుద్ధజీవితవిషయములను బి. సి. లాగారు వర్ణించారు. ఆంధ్రచారిత్రక పరిశోధకు లయిన ఆంధ్రులు ఈ విషయములు మరింత ఎక్కువగా పరిశీలించి వ్యాసములు రచింతురుగాక.

చతుర్వేదిగారి వ్యాసములో ఇదివరకు కొద్దిగా మాత్రమే పైకి వచ్చిన విషయములు ప్రమాణములతో ఎక్కువగా బయల్పడినవి.

౧౮౧౩కు పూర్వం ఇండియా దేశస్థులకు విద్య చెప్పించకుండ అజ్ఞానస్థితిలో ఉంచడానికే కంపెనీ ప్రభుత్వమువారు నిశ్చయించుకొన్నారన్న విషయము చతుర్వేదిగారు సప్రమాణంగా బయల్పెట్టినారు. ౧౭౯౩ లో చార్టర్ చట్టము పార్లమెంట్ సభలో చర్చకు వచ్చినప్పుడు భారతీయుల విద్యాభివృద్ధికి ప్రభుత్వమువారు తగిన యేర్పాట్లు చేయవలెనన్న ఉపపాదనం ఎవరో మహనీయులు పార్లమెంటులో చేసినప్పుడు అది ౧౭-౫-౧౭౯౩ లో మొదట సభాసమ్మతమైనది. మరి మూడు దినాలకు తగినవిద్యాధికులను గురువులుగా పని చేయుటకు ఇంగ్లండునుండి ఇండియాకు పంపడానికి సైతము అధికారం ఇవ్వడమైనది. ఇంతలో కంపెనీ డైరెక్టరవరో "అమెరికాలో ప్రజలకు పాఠశాలలు పెట్టించి చదువుచెప్పించి ఉన్నతాశయములు గల్గించి విప్లవము తెచ్చిపెట్టుకొని అమెరికాదేశము పోగొట్టుకొన్నాము; ఆ విధంగానే ఇండియాదేశం సైతము పోగొట్టుకోవలసి వస్తుంది గనుక భారతీయులకు చదువు చెప్పించకండి, అజ్ఞానంలోనే వారిని ఉంచండి" అని బోధిస్తూ ఉపన్యసించేటప్పటికి పార్లమెంటువారు, చేసుకొన్న తీర్మానము రద్దుపరచుకొన్నారట.

అయినా, ప్రాచ్య విద్యాభిమాను లయినవారు కంపెనీ ఉద్యోగస్థులలో లేకపోలేదు. ౧౭౮౧లో వారన్ హేస్టింగ్జు (మొదటి గవర్నర్ జనరల్) మహమ్మదీయులను మంచి చేసుకొనే ఉద్దేశంతోనే అయినను, మహమ్మదీయకళాశాల స్థాపించాడు. కాశీలో రెసిడెంట్‌గా ఉండిన జోనాథన్ డన్‌కను కాశీ సంస్కృతకళాశాల స్థాపించాడు. ౧౮౧౩ - ౧౮౩౩ - ఈకాలంలో భారతీయులకు విద్యాభివృద్ధి చేయవలెనన్న ఆశయము కంపెనీవారికి ఉదయించినది. క్రమంగా ప్రాచ్య విద్యావ్యాసంగ మందలి అభిలాష ఎక్కువయినది. పాశ్చాత్యవిజ్ఞానం ఇంగ్లీషుభాషద్వారా భారతీయులకు నేర్పవలెనన్న సంకల్పము మెకాలే మొదలయిన విద్యాధికులకు సద్భావముతోనే ఉదయించినది. ఈ విషయములున్ను విద్యావిధానపరిణామమున్ను చతుర్వేదిగారి వ్యాసమందు చక్కగా ప్రకటితము లయినవి.

ఈశ్వర ప్రభుత్వమునకును నిరంకుశప్రభుత్వమునకును గల వైషమ్యమును గురించి రచితమైన వ్యాసంలో అహమ్మదుగారు ఈశ్వరప్రభుత్వమునకు నిర్వచనం చెప్పి ఇది ఇండియాలో సుల్తానుల ప్రభుత్వమునకు అన్వయించ రాదని తెలియజేశారు. ఈ సుల్తానులు ఈశ్వర ప్రతినిధులమనుకోలేదు ఈశ్వరాంశ గలవారమే అనుకొన్నారు; ప్రవక్తలవలెనే వ్యవహరించి నిరంకుశ ప్రభుత్వము వహించారు. అక్బర్ చక్రవర్తి ప్రవక్తవలె క్రొత్తమతమును స్థాపించుటకే పూనుకొన్నాడు. వీరి ప్రభుత్వము నిరంకుశప్రభుత్వమే కాని ఈశ్వరప్రభుత్వము కాదనిన్ని రెంటికిని వైషమ్య మున్నదనిన్ని అహమ్మదుగారు తెలియజేసినారు.

స్థలం చాలనందున తక్కిన వ్యాసములు విమర్శించలేదు. ఈ పత్రిక దేశచరిత్రవ్యాసంగం చేసేవా రందరున్ను చదువవలసినది.

—సీతాపతి.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,